# హెచ్చరిక!



## ఈ రోజు మీ బిడ్డ జలుబు రేపు ఫ్లూ, రొమ్ము పడిశము లేదా న్యూమోనియా కావచ్చు!

వ్యాధి ముదరక ముందే మీ బిడ్డ జలుబు బాధను త్వరగా పోగొట్టండి. జలుబులకొరకై ప్రత్యేకముగా చేయబడిన యీ ఘాటైన ఆయింట్‌మెంటు రుద్దండి.

మీ బిడ్డ ఆరోగ్యమును గురించి అశ్రద్ధ చెయకండి! జలుబు, తుమ్ములు, రొంప, గొంతు నొప్పి వీటి మొదటి లక్షణములు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను గుండెమీదా గొంతుమీదా, వీపుమీదా రుద్దండి. మీ బిడ్డకు ముక్కు, గొంతు, గుండెలలో వెంటనే స్వస్థత చేకూరును. అప్పుడు యీ నమ్మకముగా పనిచేయు ఆయింట్‌మెంటు మీ బిడ్డ రాత్రులందు నిద్రపోవు సమయములో జలుబు బాధలను నివారించును. తెల్లవారే సరికి మీ బిడ్డ జలుబు పోయి మరల ఉత్సాహంగా వుండును.

**విక్స్ వేపోరబ్ జలుబులను త్వరగా పోగొట్టును.... 2 విధములుగా!**

**1** ముక్కు ద్వారా పని చేయును



మీరు గాలిని పీల్చునపుడు విక్స్ వేపోరబ్ ఘాటైన వాసన, శ్వాస నాళాలలోనికి పోయి ముక్కు, గొంతులోని జలుబు బాధలను పోగొట్టును.

**2** చర్మం ద్వారా పని చేస్తుంది.



విక్స్ వేపోరబ్ చర్మాన్ని వెచ్చ పరచి, బాధనుపోగొట్టి, ఊపిరి సలుపనిచ్చును. మీ బిడ్డ త్వరగా ఉత్సాహంగా వుండును!

పెద్దసైజు నీలం బుడ్డి



చిన్న ఆకుపచ్చ డబ్బీ









# విక్స్ వేపోరబ్‌ను

రొమ్ము, గొంతు, వీపులపై రుద్దండి! అది అందరు వాడదగినది!

VR 5

# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది






మీ ముఖమును మృదువుగా మరియు
మనోహరముగా ఉంచుకొనుటకు

## పాండ్స్

వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణములోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరుము అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

చర్మమును శుభ్రపరచే క్రీమ్: ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపించబడినది)

ఆంధ్రపత్రిక వారపత్రిక

# విషయసూచిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 11

25-11-59
బుధవారం

వికారి కార్తిక బహుళ నవమి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.

ముఖచిత్రం:
సాహిణీవారి 'బండరాముడు' చిత్రంలో
సావిత్రి.


రాజధాని కబుర్లు — 3
న్యూఢిల్లీ లేఖ — 6
పరిస్థితులు పరిణామాలు — 8
లంకెబిందెలు — 14
మీగడతరగలు — 15
తెలుగువెలుగులు — 16
హరివంశము — 17
క్రాస్ వర్డ్ - కల్యాణం — 20
చక్రనేమి — 24
జీవనరాగం — 28
అంబాడీల వింత ఆచారాలు — 32
అన్వేషణ — 34
రాశిఫలాలు — 38
బాలసాహితి — 40
వనితాలోకం — 48
సినిమా — 56
పదికట్టు — 64


## ఉత్తరాలు

### ఆర్. టి. సి. హామీ

ఆర్. టి. సి. అధికారులు ఇచ్చిన హామీ (28-10-59) చూసి సంతృప్తి పడిన పబ్లిక్ ఎంత అమాయకులనిపించింది.

పబ్లిక్ ఎంతసేపూ 7బి, 7 సి రూట్లలో బస్సుల గూర్చి ప్రస్తావించారు. ఇంతకన్నా గమనార్హమైన విషయాలు బేగంపేట మీదుగా పయనించే, రాణిగంజ్—బొల్లారం, లేక రాణిగంజ్—అమీర్ పేట (51, 51 బి) బస్సురూట్లలో జరుగుతుంటాయి. 2-11-59 సాయంకాలము 4 గంటలకు అమీర్ పేట కు పోవలసిన బస్సు (1442) వక్కాలము వచ్చి రాణిగంజ్ స్టాప్ లో నిలుచుంది. ప్రయాణికులు (బస్సు పరిమితికి 1½ రెట్లు) అందరూ ఎక్కినా 4-55 గం. లైనా అది, గతి లేదు. చివరకు అందరూ దిగి, ఇంకొక బస్సు (1480) ఎక్కుతున్నప్పుడు అక్కడ [illegible] కనుక్కొంటే, హెడ్ లైట్ లు వెలుగుట లేదని చెప్పినారు. ఈ సంగతేదో ముందుగానే చెప్పితే (బి. సి. కాలము నాటి) బస్సులో కూరుకుపోయిన ప్రయాణికులకు ఊపిరాడకుండా 15 నిముషాల బాధ పడే కర్మ తప్పేది. లేక ఆర్. టి. సి. వారికి లైట్లు పని చేయుటలేదని తెలుసుకొనుటకు 15 నిమిషములు పట్టినదా? దీనికి అధికారులు ఏమని చెలవిస్తారు?

బి. కమలాకుమారి,
(సికిందరాబాదు)

### గుంటూరు కుంభకరుడు

శ్రీ ప్రకాశం గారి హెచ్చరికను హైదరాబాదు కుంభకర్ణుడు మేల్కొంటాడేమోగాని గుంటూరు కుంభకర్ణుడు మాత్రం మేల్కొనడు. అటువంటి పరిస్థితులలో వున్నది గుంటూరు పురపాలక సంఘము. పురపాలక సంఘాధికారులు పట్టణాన్ని ఒక్కసారి [illegible] చూచిన పాపాన, బొక్కయిలు ఏకమూలు చేసిన పాపాన పోలేదు. బ్రాడీపేట, అరండల్ పేటల్లో, పట్టణంలోవున్న పెద్దలు, ఆఫీసర్లలో ఎక్కువ మంది నివసిస్తున్నారు. పట్టణములో వున్న మురికిపేటల్లో ఈ రెండూ ప్రసిద్ధిచెందినవి. కొన్ని వేల రూపాయలు పన్నుల రూపంగా ఈ పేటలనుండి వసూలవుతున్నా తగిన మురికిపారుదల వసతులు లేక ముఖ్యకూపాలలో, మురికియూ దోమలమధ్య సామాన్య తరగతి వారినుండి మధ్యతరగతి వారివరకూ అనారోగ్యంలో చాలామంది బాధ పడుతున్నట్లు పురపాలకధూనికి తెలిసినా తెలియనట్లుండటము శోచనీయం. ఇప్పటికైనా సత్వర చర్యలు తీసుకోడానికి గుంటూరు కుంభకర్ణుడు నిద్ర మేల్కొంటే ఉత్తమం.

గొనురాపంత్, గుంటూరు.

(55 వ పేజీ చూడండి)

# కీర్తిశేషుడు కురుగంటి - సి.ఐ.బి. ఇళ్ళు 'లాభచంద్రుని కథ'

## రాజధానికబుర్లు

ప్రవీణ్

### "ఇల్లు కట్టి చూడు..."

'నేపుల్స్ చూసి చచ్చిపో'. అని ఇంగ్లీషులో ఓ సామెత ఉంది. అది తెలిసిన ఒక ప్రబుద్ధుడు, నేపుల్స్ చూడగానే చచ్చిపోడానికి ఉద్యుక్తుడయ్యాడట! అదేవిధంగా—'ఇల్లుకట్టిచూడు...' అని సామెత విన్న మన అధికారులు, ఇల్లు కట్టించి చూస్తూ ఊరుకుంటున్నారని తెలుస్తోంది.

ఎవరైనా ఫిర్యాదుచేస్తే—'ని పెళ్ళి చేసి చూడు' అని కూడా అంటున్నారని వినికిడి.

నగరంలో 'సిటీ ఇంప్రూవ్ మెంట్ బోర్డు' అంటూ ఉంది. అది ప్రొద్దున్న లేచి సాయంత్రం దాకా ఏం చేస్తుంటుందో తెలియదు. ఇళ్ళు కట్టడానికి సథకాలు వేస్తుంటుంది. ఎక్కడ? ఫలానాచోట! సరే—ఆ స్థలాలు కలెక్టరు సంపాదించాలి. రెండు మూడు సంవత్సరాలు—ఈ లోగా హైకోర్టులో రిట్ దరఖాస్తులు పడకపోతే! తర్వాత బహుశ: పి. డబ్ల్యు. డి. కి పని అప్పచెప్ప బడుతుంది. నగరపాలక సంఘం బహుశ: ప్లానులు మంజూరు చేయాలి. ఇం ఎన్నో 'బహుశ'ల తర్వాత గృహాలు నిర్మించబడతాయ్. ప్రతిరోజూ ఈ ఇళ్ళకోసం దరఖాస్తులు దాఖలౌతూంటాయ్ దరఖాస్తులు కావాలని సి ఐ బి ప్రకటిస్తుంది. కూడా. పదిహేను ఇళ్ళకోసం పదిహేను వేల దరఖాస్తులొస్తే—ఉదాహరణకి—ఆ బోర్డు ఏ నియమాలననుసరించి మంజూరు చేస్తుందో తెలియదు.

చిక్కడ్ పల్లి అవతల బురద ప్రాంతంలో కొన్ని ఇళ్లు కట్టించింది సి. ఐ. బి. కొన్ని సంవత్సరాల క్రితం. ఐదారు సంవత్సరాల నుండి గోడలకు వెల్ల లేదుట. కొన్ని తలుపులకు గొళ్ళేలు లేవట. కొన్ని కప్పులలోంచి ఎండ వాన నిరాఘాటంగా లోనికి వస్తాయట. అక్కడినుంచి రోడ్డుమీదకు రావడానికి ఇంతవరకు సిమెంటు రోడ్డులేదు. రోడ్డేలేంకే దీపాలెల్లా వస్తాయ్? దర్యాప్తు చేస్తే, ఇళ్ళు కట్టడానికేగాని, అవి సరైన పరిస్థితిలో ఉండేటట్టు చూడానికి బడ్జెటులో ఏర్పాటులేదట. ఆ ఇళ్లల్లో ఉండే జనం మొరలు వినిపించుకునే నాథుడు ప్రభుత్వంలో ఉన్నట్లు కనపడ్డు. దానికి ఇవతలఉన్న 'వివేక నగర్' ప్రాంతంలో ఎందరో అధికారులు, న్యాయవాదులు ఉన్నారు. అందరికీ ఇళ్ళల్లో దీపాలున్నాయ్. కాని వీధుల్లో దీపాలులేవు. వేద్దామనే కోరిక నగరపాలక సంఘానికి ఉన్నట్టు ఎక్కడా సూచనలు కనపడటల్లేదు.

ఈవారం రాజధాని నగరంలో హరిజన మంత్రుల సమావేశం జరిగింది. ఎన్నో రాష్ట్రాలనుంచి వార్షిక యాత్ర కొచ్చారు పెద్దలెందరో. వారి ప్రణాళికలను మళ్ళీవారం పరిశీలిద్దాం.

* * *

మృత్యువు ఎప్పుడూ సందు మలుపులో నిలబడి, వికటాట్టహాసం చేస్తూంటుంది - ఇది మనం గమనించం. మృత్యువు ప్రతిఇంటి కప్పుపైనా రాబందులా కూచొని తొంగిచూస్తుంటుంది-అది మనకు కనపడదు. కొందరే ఆ అట్టహాసం వినగల్గుతారు; కొందరికే కనిపిస్తుంది ఆ రాబందు.

అడవి బాపిరాజు గారు హైదరాబాదులో ఉండే రోజుల్లో నాంపల్లిలోని బాజార్ ఘాట్ లో ఉండేవారు. అక్కడి వేమనాంధ్ర భాషానిలయంలో బాపిరాజు చిత్రపటావిష్కరణ జరిగినప్పుడు ప్రసంగించిన వక్తలలో కురుగంటి సీతారామయ్యగారొకరు. ఈ వారం ఆ నిలయంలో 'కురుగంటి సంతాపసభ' జరిగింది.

సీతారామయ్యగారి తండ్రి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు. పతీమణిపేరు శేషమ్మ. మనమరాలికి నాగవల్లి అనిపేరు పెట్టుకున్నారు. ఈ విషయాలకి, నాగులచవితి సాయంత్రం ఆయనను కాలసర్పం కాటు వేయడానికి ఏమీ సంబంధంలేదు. కాని—ఉందేమో అనుకుంటేగాని మనసు ఊరట చెందదు

నవంబరు నాల్గవతేది ఉదయం ఆయన ఆరోగ్యంగానే ఉన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని సంస్కృత అకాడమీలోని తమ కార్యాలయానికి హాజరై తమవిధులు నిర్వర్తించారు. పారిభాషిక పదకోశ సంఘ సమావేశానికి హాజరైనారు. సాయంత్రం నాలుగున్నర గంటలకు ఇల్లుచేరారు. కాఫీపెట్టుకు తాగారు. వంట్లో వస్తూన్న బాధల స్వరూపాన్ని గమనించి రమ్మని గద్వాలలో ఉన్న కుమారునికి, గుంటూరులో ఉన్న అలునికి తంతిద్వారా కబురంపారు. వైద్యునికి కబురంపుకున్నారు, మంచం, పరుపుఉండగా, వసారా వరండాలో చాప పరుచుకొని, పైన తువ్వాలు పరచి, క్రింద పడుకున్నారు.

వైద్యుడిచ్చిన మందులవల్ల బాధోపశమనం కాలేదు. సీతారామ భజన చేస్తూ, ఆరున్నరగంటలకు కన్నుమూశారు. చిక్కడపల్లిలో కొత్తగా కట్టిన ఇల్లు విడిచి, నాంపల్లిలో మొదటినుంచి ఉంటూన్న ఇంట్లో, భార్య మరణించినచోటనే ఉద్దేశపూర్వకంగా చాపపరుచుకొని, పడుకొని మృతిచెందారు.

... శ్రీమాన్ ... గారు ప్రాసూన్న రామాయణ కావ్యంలో తప్పులుంటే దిద్దడానికి రాత్రికిరమ్మని ఆయనకు మధ్యాహ్నం మూడు గంటలకు టెలిఫోన్ చేశారు. పత్యసాహితీసమితి నిర్వహించనున్న అఖిలభారత తెలుగు రచయితల సమావేశపు ఏర్పాట్లనుగురించి వారితో చర్చించడానికి సమితి కార్యదర్శులు బోయిభీమన్న, పాండురంగ రావు, తల్లాప్రగడ ప్రకాశరాయ, తదితరులు గం 6-45 లకి వారింటికి చేరుకున్నారు.

"సీతారామయ్యగారున్నారా?" అన్నారు వీరు. "పోయారు" అన్నారెవరో. "మళ్ళీ ఎప్పుడొస్తారు?" అన్నారు వీరు. "చనిపోయారు" అన్నారు వారు.

ఆవిధంగా సీతారామయ్యగారి తుది దర్శనానికి సాహితీబంధువుల యాత్ర ప్రారంభమైంది.

* * *

'సీతారామయ్యగారిమృతి తెలుగు సాహిత్యానికి తీరనిలోటు' అన్నారు సాహితీపరులందరూ ముక్తకంఠంతో. ఆంధ్రాంగ్ల సంస్కృతభాషలలో పండితులు వారు. వారుసాహిత్యానికి చేసిన సేవనువిలువ కట్టడానికి నాకు అర్హతలేదు. కనక—డా॥ బి. రామరాజు సేకరించిన వివరాలను, నా

## సిక్కిం లాటరీలో—క్రిస్టమస్ ప్రయిజులు

రూ. 1,65,000 లు పైగా ప్రయిజులు.
ముగింపు తేదీ 12-12-59 డ్రా తేదీ 21-12-59
ప్రయిజుల వివరము,
మొదటి ప్రయిజు రు. 80,000 లు. రెండవ ప్రయిజు రు. 22,000 లు.
మూడవ ప్రయిజు రు. 12,000 లు. యింకా 784 యితర ప్రయిజులు.
1. టిక్కట్టు వెల రు. 1.15 న.పై; 8 టిక్కట్లు రు. 2.65 న.పై.
5. టిక్కట్లు రు. 6.25 న.పై; 12 టిక్కట్లు రు 8.75 న.పై.
20 టిక్కట్లు రు. 13.50 న.పై; 100 టిక్కట్లు రు. 60 లు.
టిక్కట్లు కావలసినవారు అధికారము పొందిన ఈ క్రింది డిస్ట్రిబ్యూటరుకు M. O. లు పంపండి.

పాలెం కామరాజు, కాశేశ్వరరావు మార్కెట్టు—విజయవాడ-1.



షాలిమార్ సూపర్‌లాక్

నిగనిగలాడు పెయింటు ఫినిష్ గృహ, పారిశ్రామిక అవసరాలకు








**షాలిమార్ సూపర్‌లాక్ సింథెటిక్ ఎనామెల్**

స్వంత వాడకానికి, పారిశ్రామిక అవసరాలకు అనేక విధాలుగా వాడవచ్చును. అన్నిరకాల మెషిన్లకు, సామగ్రికి, బండ్లకు, హోర్డింగులకు (అడ్వర్‌టైజ్‌మెంట్ సైన్‌బోర్డులు), కర్ర మరియు ఇనుప వస్తువులకు, ఫర్నిచరుకు, ఆటవస్తువులకు ఇంటిలోని ఇతర వస్తువులకు తగిన ఫినిష్.

షాలిమార్ సూపర్‌లాక్ త్వరగా ఆరి గట్టిగా పట్టివుండే ఉత్తమ నిగారింపు దీర్ఘకాలం వుండే ఫినిష్. లోపల బయట వాడవచ్చును. ఎటువంటి ప్రదేశానికైనా బ్రష్‌తోను, స్ప్రేతోను లేక వస్తువును ముంచి వేయవచ్చును. రంగులను ఒకదానితో ఒకటి కలుపవచ్చును.






SHALIMAR PAINT, COLOUR & VARNISH CO., PRIVATE LTD.
Calcutta • Bombay • Madras • New Delhi • Kanpur

SPW 589 TEL


# రాజధాని కబుర్లు

సౌజన్యంతో 'సచిత్ర వారపత్రిక' పాఠకులకు అందచేస్తున్నాను.

జీవిత విశేషాలు : జననం : 1890 వ సంవత్సరం డిసెంబరు 15. విరోధినామ సంవత్సర కార్తీక బహుళ త్రయోదశి, గురువారం. తెనాలి తాలూకా పేమూరు గ్రామంలో. వేదాధ్యయనం, శాస్త్రాధ్యయనం తండ్రిగారివద్ద. ఐదు సంవత్సరాలు మదరాసులో ప్రెసిడెన్సీ కళాశాలలో చదివి 1917 బి. ఏ (ఆనర్సు) పరీక్షలో సంస్కృతం ఐచ్ఛికభాషగా ఫస్టుక్లాస్ ఫస్ట్' తెచ్చుకున్నారు. సువర్ణ పతకం లభించింది. దేశాంతరాలకుపోయి విద్యాభ్యసనం చేయడానికి అవకాశం లభించింది. కాని సనాతనాచారపరాయణుల కుటుంబంవారు కావడంవల్ల అవకాశం వినియోగించుకోలేకపోయారు. మహామహోపాధ్యాయ కుప్పుస్వామి శాస్త్రివద్ద సంస్కృత భాష నభ్యసించారు. 1918లో గైక్వాడ్ బరోడాలో డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా నియమింపబడి, 1920 వరకు పదవి నిర్వహించి, '21 లో కాంగ్రెసు పిలుపు ననుసరించి, రాజీనామా ఇచ్చారు. అధికారులు పునరాలోచనకు అవకాశం ఇచ్చినా, వినియోగించుకోలేదు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం నియమించిన జాతీయ విద్యావిధాన సంఘంలో సభ్యులయ్యారు. విజయవాడలోను, కొవ్వూరులోను జాతీయ విద్యాసంస్థకు ప్రధానాచార్యులుగా వ్యవహరించారు. తెనాలిలో కొంతకాలం న్యాయవాదవృత్తి నవలంబించారు. 1931 వ సంవత్సరం జనవరి 17 వ తేదీన, అప్పట్లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఉన్న సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆజ్ఞననుసరించి తంజావూర్ సరస్వతి మహల్ లైబ్రరీలో సూపరింటెండెంటుగా చేరారు. 1932లో నిజాం కళాశాల (హైదరాబాదు)లో సంస్కృతోపన్యాసకు లయ్యారు. పదిహేను సంవత్సరాలు పనిచేశారు. తరువాత హైదరాబాదు సమాచార శాఖలోను, దక్కన్ రేడియోలోను పనిచేశారు. 1950 సెప్టెంబర్ నుండి 1954 వరకు లైబ్రరీలోను, 1954 నుండి చనిపోయేవరకు సంస్కృతాకాడమీలోను, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పనిచేశారు. పారిభాషిక పదకోశ సంఘ సభ్యులు. నాంపల్లి వేమనాంధ్రభాషా నిలయానికి ఉపాధ్యక్షులు. రామభక్త సమాజానికి కార్యదర్శి. నవ్యసాహితీ సమితికి మూడు సంవత్సరాలు అధ్యక్షులు.

రచనలు : ముద్రితాలు, అముద్రితాలు, అలంకార తత్త్వవిచారం (రామలింగారెడ్డి గారి విమర్శకు సమాధానం); లకంగి (నవల); **[illegible]**

కొందరు తంజావూరు కవులు—పండితులు; కథాత్రయి, ఆదర్శప్రభువు (నిజాం-1941); సవ్యాంధ్రసాహిత్య వీధులు (1942-ద్వితీయ సంపుటం 1949); పతీస్మృతి; ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర; షడ్దర్శనములు; దాక్షిణాత్య దార్శనికులు; వ్యాసలహరి; శాతకర్ణి; కమ్మతెమ్మెరలు(గుంటూరునుండి శ్రీ పిల్లలమర్రి హనుమంతరావు ప్రచురించిన 'ఆంధ్ర రిపబ్లిక్' లో వ్యాసాలు); తోచినట్లు ('దివ్యవాణి' పత్రికలో వ్యాసాలు); శాంతిత్రయము—పోతన అనువాద విధానము (1957-ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురించిన భారత భాగవతోపన్యాస గ్రంథాల్లో వ్యాసాలు); ఆంధ్రుల విస్తరణము (1950-డా. మారేమండ సంపాదకత్వాన వెలువడ్డ 'శాతవాహన సంచిక' లో వ్యాసం); అయ్యలరాజు రామభద్రుడు (1958-ప్రసంగవ్యాసం); A. Hand book of Telugu Literature; The Satavahanas; Sanskritic Studies; Saivism in Andhra Country (1955-దీని తెలుగు అనువాదం ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది); Narayanatirthulu (1959-భవాన్స్ జర్నల్ లో ప్రచురితం.)

* * *

ఈ రచనల్లో కొన్ని అముద్రితంగానే ఉండిపోయాయి. సీతారామయ్యగారి మృతికి సంతాపాన్ని వ్యక్తం చేయడంకోసం నవంబరు 6 వ తేదీ సాయంత్రం 'దివ్యవాణి' పత్రికా సంపాదకులు శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి అధ్యక్షతన వేమనాంధ్ర భాషా నిలయంలో సభ జరిగింది. శ్రీ ముని మాణిక్యం నరసింహారావు అధ్యక్షతన శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయంలో 11 వ తేదీ మరో సంతాపసభ జరిగింది. శ్రీయుతులు (డా.) బి. రామరాజు, బోయి భీమన్న, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఆత్మకూరి గోవింద రాజాచారి, యశ్వంతసన్హా, (డా.) పుట్టపర్తి శ్రీనివాసాచారి పాల్గొన్నారు. కీర్తిశేషుని సంపూర్ణ గ్రంథావళి ప్రచురించాలని, ఈ కార్యక్రమానికి ప్రజలు, ప్రజాప్రభుత్వం పూనుకోవాలని వక్తలు ఈ సభల్లో సూచించారు.

* * *

## శ్రీ కృ. జ. స్వా. (కొంచెం భయంతగ్గి) చెప్పినకథ

"టాయిలెట్ సామానులు అమ్ముతానని నగలు కాజేసిన జోషికథ చెప్పు" అంది సృ. జ. స్వా. "క్రిందటి వారం కల్లో కనపడి చెప్పేశాగా?" అంది శ్రీ క. జ. స్వా. ముక్కుందనుకుని వేలేసుకోపోయింది ముక్కుమీద సృ. జ. స్వా. గర్వంగా అప్పుడు లాబ్‌చంద్ కథ చెప్పింది పెద్దావిడ.

"మణిలాల్ చిమన్‌లాల్ అండ్ కంపెనీ పేరు విన్నావా? నువ్వు వినుండవులే. నాలుగుసబ్బులు చేతులోదొర్లుతూ ఎప్పుడూ, ఏదో బంగారం దగ్గరుంటే ఏ ప్రమాదం వచ్చినా ఫరవాలేదనుకునేవాళ్ళు వినుంటారు. ఈ కంపెనీ నవరసులు తయారు చేస్తుంటుంది. ఒకపక్కన నక్షత్రం గుర్తుంటుంది. ఇంకోపక్కన కంపెనీ సీలుంటుంది. భూతద్దాలతో చూస్తేగాని కనపడకుండా చిన్నచిన్న అక్షరాల్లో కంపెనీ పొడి అక్షరాలుంటాయ్. తులం బరువుంటుంది నవరసు. ఆ కంపెనీ సీలుంటే, మళ్ళీ మాట లేకుండా కొనేస్తూంటారు ప్రజలు."

"ఇది ఇలా ఉండగా లాభచంద్రుడనదగిన నవ్యజాతికుడొకడు సిద్దియంబర్ బజార్ లో లాబ్‌చంద్ పేర షరాబ్‌గా ఉంటున్నాడు. అతడు రెండుచేతుల్తో అమ్మేస్తున్నా ఈ నాణేలు. నువ్వు కొందర్ని అంతకా అందర్నీ కొంతకాలం మోసం చేయ కాని అందర్నీ అంతకాలం మోసం చే లేవు చూడు..."

"హాయ్!" అని మళ్ళీ ఉండనుకు ముక్కుమీద వేలేసుకోబోయింది. జ. స్వా.

"మిశ్రిలాల్ అనే అతను ఒకసవ రు. 118 కి కొన్నాడు. దానసలు ఖ రు. 130. అర్థతులం అవసరంవచ్చి, మన్న విరక్కొట్టాడు. ఏముంది? మధ్యలో అం వెండి. బంగారం అంతాకలిసి ఒక అర రూపాయల వంతుంది. కబురొచ్చిం విచారణ ప్రారంభించారు అసిస్టెంట్ కమి నర్ శ్రీ హనుమంత నాయుడు. లా చంద్ నేరం అంగీకరించాడు. సికింద బాదు మార్కెట్ వీధిలో ఉన్న కంప

(63-వ పేజీ చూడండి)

## 'కాళిదాసూ, హిమాలయాలూ— మనహృదయాలకు హృదయాలు'

'కాళిదాస మహాకవి భారత ప్రజాహృదయానికి హృదయం. హిమాలయాలూ అటువంటివే—నిజమైన కవి ప్రజాహృదయంలో చిరంజీవి' అని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ నవం 11 వ తేదీని ఉజ్జయినిలో ద్వితీయ అఖిల భారత కాళిదాస జయంతి ఉత్సవాలకు ప్రారంభోత్సవం చేస్తూ కవికుల గురువుకు జోహార్లు అర్పించారు.

'కాళిదాసు రచనలు ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే దర్పణాలు. నిత్యనూతనమూ, సజీవమూ అయిన ఆ రచనలు ప్రపంచ సాహితీ వ్యోమంలో ధ్రువతారలై ప్రకాశిస్తాయి' అన్నారు శ్రీ నెహ్రూ.

సంస్కృత సాహితి ఉచ్ఛదశలో ఉన్న కాలంలో కాళిదాస మహాకవి కృతులు వెలసినవని, దాస్యశృంఖలాలు తొలగిపోయిన నేటి స్వేచ్ఛాకాలంలో కాళిదాసును భారతీయులు ఇతోధికంగా చదివి అర్థం చేసుకోవలసి ఉన్నదనీ కూడా ప్రధానమంత్రి వక్కాణించారు.

ఉజ్జయిని పరిసరాలలో శిప్రానదీ తీరాన మహాకాళీ ఆలయం చేరువలో కవికుల గురువు స్మారక చిహ్నంగా ఒక భవనం నిర్మించనున్నారు. ఇందులో మూడు విభాగాలుంటాయి. ప్రాచ్య పరిశోధనాగారం, లలితకళా విభాగం, రంగస్థల విభాగం—ఈ మూడూను. కాళిదాస మహాకవి వర్ణించిన పరిసరాలు, ప్రకృతి, ఈ భవనానికి అనుబంధంగా ఉండే ఉద్యానంలో సాక్షాత్కరిస్తాయి.

దేశదేశాలనుండి వచ్చే పండితులకూ, పరిశోధకులకూ నివాస గృహాలు ఈ సుందరారామంలో విడిగా ఏర్పాటవుతాయి. సంప్రదాయసిద్ధమైన భారతీయ వాస్తుపద్ధతిలోనే ఈ భవననిర్మాణం జరుగుతుంది. ముఖద్వారం గోపురం ఆకారంలో ఉంటుంది. ముందు నడవలలో కాళిదాసు నాటక శిల్ప కళాఖండాలు ఉంచుతారు. ఇదికాక 20000 గ్రంథాలకు తావుండే ప్రాచ్య పుస్తక భాండాగారం, పరిశోధనాలయం ఏర్పాటు చేయడం గమనార్హం. నిరాడంబరంగా భారతీయసంస్కృతికి చిహ్నంగా ఈ భవన నిర్మాణం సాగుతుంది.

కాళిదాసు స్మారక చిహ్నం కళాత్మకంగా, సుకుమారంగా, అఖిలభారత సంస్కృతిని ప్రతిబింబించేదిగా వుండాలని ప్రధాని నెహ్రూ సూచించారుకూడా. అయితే ఆ మహానిర్మాణం హిమాలయంవలె 'దేవతాత్మ' కావాలని ఆయన అభిప్రాయమేమో! ★

# హిమాలయాలలో చైనా గూఢపుఠాణి

**మంచి చేస్తే మంది చెప్పుకుంటారు. చెడుజరిగితే పదింతలుగా చెప్పుకుంటారు. చెడుకు మంచిదికాదని నొక్కి వక్కాణిస్తారు. చెడు చేసిన వర్గాన్ని గర్హిస్తారు. ఇదంతా అది చెడుగని మనస్ఫూర్తిగా నమ్మినప్పుడే జరుగుతుంది.**

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

(ఢి)ల్లీ రాజకీయ వ్యవహార రంగస్థలం మీద చైనా దుష్టపాత్రపై సంభాషణలు ఇంకా (జరు)పుతూనే ఉన్నాయి.

ప్రధానమంత్రి పత్రికావిలేఖరుల సమా(వే)శం, మంగళవారంనాడు ఆగ్రాలో ఆయన ఉపన్యాసం, చౌ-ఎన్-లై రాజీపడా(లని అనుకుంటున్న)ట్లు వ్రాసినలేఖ, భారతీయ పత్రికా (ప్ర)తినిధికి కృశ్చేవ్ యిచ్చిన హామీ— (ఇవ)న్నీ ముఖ్యంగా అంతా చర్చిస్తున్నారు. (మొ)న్న(?) కొలువు(?) జరిగే పత్రికా విలేఖ(రు)ల సమావేశంలో శ్రీ నెహ్రూ పత్రికలను (ఎ)త్తి పొడిచారు. సున్నితంగా లౌక్యంగా (మందలిం)చారు.

ఇండియా - చైనా సరిహద్దు తగాదాల (వి)షయం పేర్కొంటూ 'సర్వం చేయ(గలం అ)ంటారు. పత్రికలవింటారా(?) (ఉద్రే)కపూరితమైన వ్యాసాలు (వ్రా)యమంటారా యేమిటి?' (అ)ని ప్రశ్నించారు. (అ)లాగా యితర దేశాలవారి(?) (మ)ధ్యవర్తులు కోరాలనడం 'పొరుగింటి (వా)ళ్లను పెండ్లి కాచుకుని కూర్చున్నట్లే' (అ)నలదన్నారు(?) ఆయన.

(నే)నాడో కన్నుమూసిన మహాత్మాగాంధి (ఉప)దేశాలు పునరుచ్ఛరిస్తూ ప్రధానమంత్రి (నె)హ్రూ గాంధేతరం వాడిని ఆయన ఉప(దే)శాలు పొందిన వాడిని. బల్లో(?) రెచ్చే(?) (మా)ల్లు అరచినట్లు ప్రకల్పాలు—నినాదాలు (చే)యడంవల్ల కాదు. ఢిల్లీ వీధులలో అనవసరంగా (గో)ల నినాదాలు చేస్తూ తిరగలేను. రాజ(కీ)య అంతేబట్టయితే(?) చౌ-ఎన్-లైతో (ప్ర)తిదింపులు జరపడం ఆలోచిస్తాను. ప్రక(ట)నలు, నిరసనలు మానడం—అక్కరవచ్చే(?) (క)ర్తవ్యమేదైనా చేయగలిగిందిచేయడం, (ఇ)దే మహాత్మాగాంధీ బోధించిన పాఠం. (అ)ప్రదేశాలు, భయసంభ్రమాలు మరీ ఎక్కువై(పో)తున్నాయి. నా విధానం—అంటే సా(ధా)రణ వైఖరి మహాత్ముని ఉపదేశమే. (శా)ంతియుత సంభాషణలకు, చర్చలకు నే(నె)ప్పుడూ సిద్ధం' అన్నారు!

శాంతియుతంగా చర్చలు జరపడం అంటే (ఒ)క సంఘటన జ్ఞాపకం వస్తున్నది. ముస్లిం(లీ)గు సజీవంగావున్న కాలంలో జరిగిన (సం)గతి. క్రమంగా అప్పటికి ముస్లింలీగు శక్తి పెరుగుతున్నది. ఎం. ఎ. జిన్నా పలుకుబడి, అనుచరవర్గమూ పూర్తిగా పోయింది. శాంతియుతంగా జిన్నాతో చర్చలుజరిపి, ముస్లింలీగు కాంగ్రెసులో కలిసేటట్లు చేయాలని మహాత్మాగాంధి భావించారు. ఆవిధంగా వారుభయులు కలుసుకున్నారు. సంప్రతింపులు జరిపారు. సుదీర్ఘంగా చర్చలు జరిపారు. అయితే చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. "ఎవరిదారిన వారు పోవడం" ఆ నిర్ణయం!

ఈ సంఘటన అనేకవిధాల గుణపాఠం నేర్పుతుంది. దానితో తిరిగి జిన్నా పలుకుబడి పెరిగిపోయింది. ముస్లింలీగు పునర్నిర్మాణం జరిగి బలపడింది.

ఇది ఇలావుండగా ప్రకల్పాలు, నినాదాలు అసహ్యకరమన్నారు శ్రీ నెహ్రూ. పిడిపిల్లలాగా అరవడం తనచేతకాదన్నారు. అయితే 1957 లో ఆంగ్లో - ఫ్రెంచిదళాలు ఈజిప్టుపై పడినప్పుడు సూయజ్ కటూ ఇటూ కూడ అరుపులు అరచిందీ నినాదాలు చేసిందీ ఎవరు? శ్రీ నెహ్రూకు ఆ విషయంలో అంత ఆవేశం అప్పట్లో ఎందుకురావలసి వచ్చింది?

1958 లో అప్పటి మద్రాసు విశ్వవిద్యాలయం న్యాయ శాస్త్రాచార్యుడు శ్రీ సి. హెచ్. అలెగ్జాండ్రోవ్ భారతదేశానికి చైనీస్ దురాక్రమణ ప్రమాదం తప్పక ఉండగలదని హెచ్చరించారు. రష్యా, చైనాల సామ్రాజ్యతత్వం మితిమీరి నూరు రూపాలలో బయల్పడుతున్న ఈ సమయంలో ఈ రెండుదేశాలకూ భారత్ భయపడవలసిన అవసరం ఎంతో ఉన్నదికూడా. గోముఖవ్యాఘ్రాలు సాధువులని ఎంతవరకు భావించగలం? టిబెట్ పై దండయాత్ర జరుపుతూ టిబెటియనుల స్వాతంత్ర్యం కోసమనడం చైనాకే చెల్లింది. మావోకు ముందు మంచూరాజుల పరిపాలనలో చైనా రాజ్యవిస్తరణ కార్యక్రమానికి నాంది జరిగింది. టిబెట్ చైనాలో ఒక రాష్ట్రమని మావ్-సే-టుంగ్ భావన. చైనాకుచెందిన ప్రాంతాలు చాలా భారత్, నేపాల్ దేశాలలో కలసిపోయాయని వాటిని తిరిగి తమవశం చేసుకోవాలని మావో కోరుతున్నాడు. నలభైవిళ్ల(?) క్రితమే నేపాల్ చైనాతో సామ్రాజ్యసంబంధాలు వదలుకొన్నది. ఇక సిక్కిం పూర్వం డార్జిలింగ్, సిలిగురి ప్రాంతాలవరకు వ్యాపించి ఉంది. కాని నేడు తిరిగి తనకు కావాలని సిక్కిం దురాక్రమణ జరపలేదు(?). 'టిబెట్-పాస్ట్ అండ్ ప్రెజెంట్' అనే పుస్తకం వ్రాసిన సర్ ఛార్లెస్ బెల్ టిబెట్ లో చైనా జోక్యం చేసుకోవడం, సిమ్లా సమావేశ నిర్ణయాలు పాటించకపోవడం జరుగుతే భారత్, నేపాల్—ఈ రెంటికీ ముప్పు తప్పదని పేర్కొన్నారు. అయితే ప్రతిమించి(?) రాగాన(?) పడకముందే భారత్ ఎంతో అప్రమత్తత వహించవలసి ఉన్నది. ఈనాడు టిబెట్ ఇనుపతెర మరుగున పడిపోయింది. హిమాలయాల కవతల ఏమేమి నాటకాలు జరుగుతున్నాయో తెలియని పరిస్థితులు వచ్చాయి. ఇండియా, సిక్కిం సరిహద్దులదాకా లాసానుంచి భారీగోడ నిర్మాణం జరుగుతున్నట్లు, టిబెట్ లో చైనా కొత్తకోటలు కట్టి సైనిక స్థావరాలు ఏర్పాటు చేస్తున్నట్లు, రష్యా సహాయంతో చాలా విమానాశ్రయాలు కూడా టిబెట్ లో నిర్మిస్తున్నట్లు తెలుస్తున్నది. లాసాలో ఒకటి రూకాస్(?) మానససరోవరాలకు మధ్య మైదానంలో ఒకటి విమానాశ్రయాలు నిర్మిస్తున్నారట. ఈ ప్రాంతం ఢిల్లీకి 300 మైళ్ళదూరం మాత్రమే ఉన్నది. భారత సరిహద్దు పొడవునా చైనాసేనలు అంటిపట్టుకుని పోరాడున్నట్లు మన రాజకీయ నేతలంతా ఒప్పుకుంటున్న విషయమే. దక్షిణ టిబెట్ యురేనియమ్ గనులలో అణు శాస్త్రజ్ఞులు ఏవో పరిశోధనలు జరుపుతున్నట్లు వదంతులు బయలుదేరాయి. సిక్కిం భూటాన్ ప్రాంతాలు చైనా అంతర్భాగాలుగా చేర్చిన మ్యాపును చైనా ప్రభుత్వం ప్రకటించిందట! ఇది చాలా ఆందోళన కలిగించే విషయం.

టిబెట్-ఇండియాలమధ్య ఉంటూ వచ్చిన సంబంధ బాంధవ్యాలకు నేటి చైనా ఇనుపతెర అడ్డం వచ్చింది మనం సైన్యాలను నిద్ర లేపకుండ ఊగుడు నేపథ్యంలో(?) తూర్పు, ఉత్తర సరిహద్దులనుంచి దండయాత్ర పెద్దపెట్టున గనుక ప్రారంభమైతే దేశభద్రత ఏమౌతుందో ప్రధానమంత్రి

ఆలోచించాలి.

టిబెట్‌ను చైనా జయించి తనలో కలుపుకోవడంతో హిమాలయ ప్రాంతంలో బలాబలాల నిష్పత్తి తల్లక్రిందులై భారత్ బలహీనమై పోయింది. చైనా దురాక్రమణకు భారత్ ఎదురొడ్డి నిలువకపోతే సిక్కిం, భూటాన్‌లు కూడా త్వరలో చైనా పాలు గాక తప్పదు. ఇది తథ్యం!

మహాత్మాగాంధీ శిష్యులమనీ, ఆయన ఉపదేశం ప్రకారం నడుస్తున్న అనుయాయులమని కబుర్లు చెబుతున్న మన నాయకులకు ఒక్కటే ప్రశ్న-మహాత్ముడు ఆయన చేసిన తప్పిదాలు ఒప్పుకొనేవారు. చింతించేవారు. అంతేకాని రంగులుపూసి సమర్థించుకునేవారు కాదు. ఆయనలో ఆ మహత్తర గుణం ఉంది—ఆ ప్రకారం వీరు తప్పులు ఒప్పుకుంటున్నారా? తప్పుడువిధానాలు సవరించుకుంటున్నారా? నిజానికి వీరంతా తమ మాటే రైటని వాదిస్తూ కాదన్నవాళ్లపై ఆగ్రహం ప్రకటిస్తున్నారు కూడా.

ఆగ్రాలో ప్రసంగిస్తూ శ్రీ నెహ్రూ భారతీయులకు యాచన ఒక దురలవాటు అయిపోయిందన్నారు. ఆయన చెప్పింది నిజమే-కాని ఈ యాచనకు దారితీస్తున్న పరిస్థితులేమిటో కూడా ఆయన వివరించాల్సింది-

నాకు తోచినంతవరకు ఆ పరిస్థితులు మనవి చేస్తాను.

నాలుగు సంవత్సరాల క్రితం ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రూపొందించబడింది. ప్రపంచ బ్యాంకుతో సహా మన హితైషులందరూ దానిని ఆచరణ సాధ్యం కానిది ఊహాగానంగా వర్ణించారు. దాని అమలు ఆవిధంగా తగదన్న వారిని అభిశంసిస్తూ, బల్లలు 'గుద్ది అది అమలుజరిపి తీరాలి'—అని ఉద్ఘాటించారు శ్రీ నెహ్రూ. తర్వాత ఈ ప్రణాళిక అమలులో జరిగిన సంఘటనలందరికీ తెలిసినవే. ఇక భారతీయులు యాచనకు అలవాటు పడ్డారంటే మరి ఏమిటి కారణం. ఉన్న వసతులకు, అవకాశాలకుమించి ఖర్చుచేసేవాళ్లు యాచించకుండా ఉండడం సాధ్యమా? కాగా ఈ విమర్శలు దేనికి? ఈయాచకులే మరిలండన్‌కూ వాషింగ్టన్‌కూ ఎగబడుతున్నది!

* * *

శ్రీ జగ్జీవన్‌రామ్, రైల్వే ఉద్యోగ వ్యవహారాలలో కులమతతత్వాలు రేకెత్తిస్తున్న అమాత్యశేఖరుడు. ఈ పని పూర్వం మచ్చుకైనా ఆంగ్ల ప్రభుత్వం చేసింది కాదు. ముఖ్యంగా రైల్వేల విషయంలో. ఉద్యోగాలలో ప్రమోషన్‌లు ఇవ్వడానికి అధికారులు శ్రీ జగ్జీవన్ రామ్ ఆధ్వర్యంలో కులమత విభక్తులు ఆధారంగా వర్తించడం అన్యాయం. సర్వీసులోనికి వచ్చిన ప్రతివ్యక్తి-ఇక ప్రమోషన్‌కోసం హోరాహోరీ పోరాటే తెడద వచ్చిపడింది దీనిమూలాన. సమర్థులు అసమర్థంగా పడివుండడం దీనిఫలితం. వెనుకబడిన తరగతుల అభ్యుదయానికి – ఇతోధిక ఉద్యోగావకాశాలు కల్పించడం దేశీయ వ్యవహారాలశాఖ విధానం. అది ప్రమోషన్‌లకు వర్తించడం శోచనీయం, సానుభూతి చూపడమనే పేరుతో కులమత ప్రాతిపదిక మీద ప్రమోషన్‌లు ఇవ్వడం కన్న దుర్గతి మరొకటిలేదు. అనర్హులకు ప్రమోషన్‌లు ఉదారంగా ఇవ్వడం శ్రీ జగ్జీవన్‌రా[మ్] ప్రస్తుతం చేస్తున్న పని.

ఎన్నికలలో ఇకముందు ద్విసభ్య నియో[జక] వర్గాలకు స్వస్తిచెప్పడం ద్వా[రా] శ్రీ జగ్జీవన్‌రామ్ ఈపని చేస్తున్న[ట్లు] తోస్తోంది. ఈ విషయంలో దేశీయ వ్యవ[హా]రాలమంత్రిత్వశాఖ తీసుకోనున్న చ[ర్య] ఏమిటో తెలియడంలేదు. రేపు సోమవా[రం] నాడు జరిగే పార్లమెంటు సమావేశాల[లో] ది చర్చకురావచ్చు





# అమృతాంజనము

నొప్పులతో కూడిన వ్యాధులు ముదరకముందే కుదురుతాయి




అమృతాంజనము బాధను నివారించడమే గాక బాధ కారణాన్ని కూడా నిర్మూలిస్తుంది. ఇది రక్త సంచయాన్ని శమింపజేసి రక్త ప్రవాహాన్ని క్రమపరచుటకు ఉపకరించును.
ప్రతిసారి దీనిని అతి కొంచెమే ఉపయోగించవలసి ఉండడంచేత ఒక బుడ్డి నెలలతరబడి వస్తుంది.




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4, బొంబాయి-1 కలకత్తా & న్యూ ఢిల్లీ

# పరిస్థితులు, పరిణామాలు

కలువకొలను సదానంద

దగ్గరలో వున్న గుట్టలోని ఎగుడు దిగుళ్లు స్పష్టంగా అవుపిస్తున్నాయి. కాని— ఆకాశాన్ని చుంబిస్తోన్న దూరపు కొండలలో అంతటి మనోహరం ఎక్కడిది? స్వర్గస్వప్నాలలాగా అది కేవలం భ్రమే నేమో! ఆ కొండ దగ్గరైతే కాని దాని మనః ప్రాంతంలోని నిజానిజాలు బయటపడవు. ఈ సత్యాసత్యాల అన్వేషణ కోసమే నేమో భాస్కరం బయలుదేరాడు.

ఇంట్లో తగువులాడిన భాస్కరం కోపంగా ఉక్రోషంతో తన అక్కయ్య ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ అక్కయ్యంటే స్వయానా అక్కయ్య కాదు. పెద్దమ్మ కూతురు. పదిమైళ్లలో వున్న ఒక పల్లెటూళ్లో కాపురముంటోంది. ఆమె భర్త బడిపంతులు.

ఆ మధ్య బడిపంతుళ్లకు జీతం కాస్తా కూస్తా హెచ్చించారట గా! దాని పాపమూ అని నరో పాపాయి కొసరుగా దిమతీ ఆచార్యుడు అతనికి. మొత్తం ఆరుగురు బిడ్డలు ఇప్పటికి. ఇంకో వింతదగ్గ విషయమేమిటంటే అందులో ఇద్దరు మాత్రమే అతని పిల్లలు కావటం.

చెరువుకట్టమీద నడుస్తూ వాళ్ళ పేర్లన్నీ గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు భాస్కరం. పెద్దమ్మాయి పేరు సుశీల. తర్వాత సురేంద్రబాబు. ఆ వెనుక ఇందిర, చంద్ర ప్రకాశం. కైలాసం. గణేశం ఇంకా తిప్పడుగ్గా వేయలేని చంటిబిడ్డ. ఆ మధ్య బిడ్డతో పాటు సినిమా చూడానికని కొనుక్కొచ్చే చూశాడు తను. అప్పుడు తనని పిలిచింది— "వెళ్ళొంరారా. ఓ నాలుగురోజులు పాటు వుండి వెళ్దువుగాని" అని. తనకు వెళ్లాలనిపించలేదప్పుడు. "ఇప్పుడేం కుదరదేం ఇంకెప్పుడైనా వస్తా" అన్నాడు.

అన్నయ్యతో దెబ్బలాడాడు తాను. వీధి వీధి తిరుగుతున్నాట్ట తను. ఇంట్లో ఒక్క నిమిషం వుండటం లేదట. ఒక్క పనికీ కొరగాకుండా తేరగా తింటున్నాడట. "ఇంట్లో లేకుండా ఎక్కడికెళ్ళావురా వెధవా?" అన్నాడు అన్న, చెంపమీద ఛెళ్ళుమని అంటించాడు. తనకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కోపమొచ్చింది. "నా ఇష్టం. నే నెక్కడికైనా వెళ్తాను" అంటూ తిరగబడ్డాడు తను అన్న దగ్గరి చనువును పురస్కరించుకొని. "ఏమన్నావురా పొగరుబోతా? ఈసారి అను ఈసారి అను..." అంటూ చితకబాది,



## బహుమతి (రూ. 12) పొందిన కార్టూన్



చిత్రం: కె. రామకృష్ణరావు, బందరు.

బయటికి గెంటి "యింట్లోకొస్తే తోలు ఒలిచేస్తాను వెధవా! వెళ్ళు. అవతలకెళ్ళు..." అంటూ దభేలు తలుపు వేసుకొన్నాడు.

భోరున ఏడ్చాడు భాస్కరం. ఏడ్చి ఏడ్చి, కన్నీళ్ళన్నీ కారిపోయాక "ఛా! ఎందుకేడ్వాలి నా అవమానిలాగా?" అనుకున్నాడు. తాటియాకెత్తు రోషం వచ్చేసింది. కళ్ళొత్తుకుంటూ లేచి నిలబడి, నిబ్బరంగా చేతులు చరుచుకున్నాడు.

విసురుగా తలుపుదగ్గరికెళ్ళి రెండు మూడు పొట్లు తట్టి, "ఒరేయ్ కింకరంగా ఇదో వెళ్ళిపోతున్నాను. మళ్ళీ ఈ ఇంట్లో కాలు పెట్టను. మళ్ళీ నీ మొహంగనక చూస్తే గోవిందయ్య కన్నకొడుకు భాస్కరమే కాను. హు! ఏమనుకున్నావో నన్ను!" అనేసి వీధులోకి అలా అలా వెళ్ళిపోయాడు.

"వాడు కొడుతుంటే కిక్కురుమనకుండా కుక్కలా పడివుండగలిగిన అల్పుణ్ణా నేను?...నాకూ సిగ్గులున్నాయి చీమూ నెత్తురూ వున్నాయి. నాకు రోషం లేదనుకున్నాడు గాబోలు." అనుకున్నాడు.

ఉద్రేకమంతా చల్లారిపోయాక మనసంతా ఏదో దిగులుతో నిండిపోయింది. పైకి అనేశాడుగాని ఎక్కడికెళ్తాడు తానిప్పుడు? ఎక్కడుంటాడు? ఎలా గడుపుతాడు? ప్రొద్దుపోయాక చిన్నగా యింటికి వెళ్ళిపోతే?...మళ్లీ అభిమానంతో చిర్రచిరుసుకు పోయాడు. ఛా! ఇంటికి వెళ్ళడమా? అది యింక ఈ జన్మంలో లేదు. అయితే మరెక్కడికి వెళ్లాలి?...అంతా అయోమయంగా వుంది. అమ్మమీద చెడ్డకోపం పుట్టుకొచ్చింది. వాడు తనను అలా కొడుతుంటే చూస్తూ వూరుకుందేగాని—మనిషేమైనా కాస్త కదిలిందా, కలుగజేసుకొందా? "అంతా నా మీద పగబట్టారు." అనుకున్నాడు. కళ్ళు నీళ్లతో మూసుకుపోయాయి.

ఇటువంటి విపత్సమయంలో వున్నట్లుండి జ్ఞాపకం వచ్చింది రాజక్క. రాజక్క తనను రమ్మంది. ఇప్పుడు తాను వెళ్తేనేం? ...ఔను! తప్పకుండా వెళ్లాలి. ఈ కింకరంగాడితో తనకేం పని? "మాటంటే మాట! ఏమనుకున్నాడో యీ భాస్కరంగాణ్ణి?" అనుకున్నాడు.

చేతిలో రాగికానీ లేదు. అరణాలైనా వుంటే బస్సులో వెళ్ళిపోవచ్చు. కట్టుగుడ్డలతోనే, నడచే, బయలుదేరాడు.

చెరువుకట్ట దిగుతుంటే అతని గుండెలు కొట్టుకున్నాయి. తను ఎక్కడికి వెళ్తున్నాడు? ఎవరిదగ్గరికి వెళ్తున్నాడు? రాజక్కయింటికి. ఎవరీ రాజక్క? తన సొంత అక్కా? కాదే? మరి ఎందుకు వెళ్తున్నాడు తను? ఈ రాజక్క తనను సత్కరిస్తుందా?...ఆదరిస్తుందా?

వెళ్ళగానే ఏం మాట్లాడాలి? వాళ్లను ఎలా పలకరించాలి? వాళ్ళ ప్రశ్నలకు ఎలా సమాధానమివ్వాలి? మరొకప్పుడైతే అతని కిన్ని సంశయాలు కలక్కపోను. కాని యిప్పుడు యింటినుండి పారిపోయివచ్చాడు. తాను ఏకాకి నేమో అనిపిస్తోంది. దిక్కులేని వాడిలా, దేశదిమ్మరిలా వెళ్తున్నాడు మరొకరింటికి. తనను చూసి అసలు సంగతి పసిగట్టేస్తారేమో! దిక్కూ దివాణంలేక యిలా వచ్చిపడ్డాడనుకుంటారో, ఏమో, తనని నిరసనగా చూసి, చులకన చేస్తారేమో!

పిల్లలు జ్ఞాపకం వచ్చారు. ఒకమంద! వీళ్ళందరికీ తినుబండాలు ఏవీ తీసుకుపోవడంలేదు తను. తాను వెళ్ళగానే మీదబడతారు, పిప్పరమెంట్లకోసమో, పకోడీలకోసమో, పప్పులకోసమో! ఆత్రుతతో తనని క్రిందనుండి పైదాకా చూస్తారు. ఆ చూపులకు ఏమని జవాబు చెప్పాలి? 'ఏమీ తేలేదు' అంటే తనకెంత చిన్నతనం!... మరలిపోదామనుకున్నాడు, వెంటనే ఆ నిశ్చయాన్ని చంపుకున్నాడు. "ఇంత దూరమూ వచ్చేశాక వెనక్కు వెళిపోవడమేమిటి?...ఏం జరుగుతుందో అదే జరగనీ." అంటూ వూళ్లోకి నడిచాడు.

బిక్కు బిక్కుమంటూ యింట్లో కాలుబెట్టాడు.

"రా భాస్కరం! ఎప్పుడొచ్చావు?" అంది రాజీ.

"ఇప్పుడే!" అన్నాడు.

బెంచీమీద పరుపు సుదుతోన్న శ్రీహరి బావ అతనివేపు చిరునవ్వుతో చూసి నిద్రకళ్ళతో పెరట్లోకి వెళ్ళాడు.

పిల్లలంతా భాస్కరాన్ని చుట్టుముట్టేశారు. నిక్కినిక్కి దోసిళ్లు చాపుతున్నారు. జేబుల్లో చేతులు వేస్తున్నారు. ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ ప్రాకుతూన్నట్లుంది.

అక్కయ్య మంచినీళ్ళు తేవడానికి లేచి వెళింది.

"కానీ, కానియివ్వు" అన్నాడు ప్రకాశం.

"నాకూ ఒక కానీయివ్వు." అన్నాడు చంద్రం.

దీనికన్నా ఏ రైలుకిందో పడిచచ్చి వుంటే బావుండేదనుకున్నాడు "చిల్లర లేదురా!' అన్నాడు చివరగా.

అక్కయ్య మంచినీళ్ళందిస్తూ "అంతా బాగున్నారా?" అడిగింది.

"బాగున్నారు." అన్నాడు.

"బస్సులోనేనా వచ్చావూ?" అంది.

"ఊఁ!" పరువుకోసం అబద్ధమాడుతూంటే అతని మనస్సంతో బాధపడింది. పదిమైళ్ళు నడిచినందుచేత కాళ్లు నొప్పితో జివ్వుమంటున్నాయి.

మాటలు అంతటితో ఆగిపోయాయి. తిరాతి పలకరించే వాళ్ళెవరూ లేకపోవడంతో—మనసు చాలా కించపడింది. పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి పెరట్లో కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు.

బావ ఎక్కడో కనిపించడం లేదు. [illegible]బాబు భాస్కరం బావ వచ్చాడని వినగానే పరుగెత్తుకొచ్చాడు. వాడికి భాస్కరంపట్ల ప్రత్యేకమైన గౌరవం వుందని కాదు. తనిదగ్గర ఒక స్నేహితుడితో వుండవలసినంత సన్నిహితంగా వుంటాడు.

# మీరు తెలుసుకోవటం మంచిది




దాంపత్య సుఖాలు అనుభవించుచు కూడ, అపకారము మందులు లేకుండా పిల్లలు పుట్టకుండా చేసుకొనడానికి, ప్రపంచంలో పెద్ద డాక్టర్లు, కనిపెట్టిన, రహస్యమైన 21 మార్గాలు 'సంతానము' అనే తెలుగుపుస్తకంలో వున్నాయి. అవసరం లేనపుడు గర్భం రాకుండాచేసే మార్గాలు, సుఖప్రసవానికి గర్భిణీ స్త్రీలు ముందుగా తీసుకోవలసిన జాగ్రత్తలు, పసిపిల్లలను పుష్టిగా, ఆరోగ్యంగా, ఎక్కువ ఖర్చులేకుండా పెంచే మార్గాలు. అవసరమైనచోట్ల బొమ్మలతో సహా ఎ. ఎస్. మూర్తి, యం. ఏ. వారు 'సంతానం' అనే తెలుగు పుస్తకంలో వ్రాశారు. అనేక సంసార సమస్యలను తీర్చగల అపూర్వ గ్రంథం మీరు చదివి తీరవలసిన పుస్తకం. వెల రు. 3.50. పోస్టుఖర్చులు ఉచితం. మూర్తి & వినాయకం, 33, పీటర్సురోడ్డు, మద్రాసు-14 కు ఉత్తరం వ్రాస్తే మీకు కూడ ఒక పుస్తకం వెంటనే వి. పీ. పోస్టుద్వారా పంపబడును.


# పరిస్థితులు...

స్వరంగా వుంటాయి ఆమె మాటలు.

ఆసంబోధన తనకు దుస్సహంగా వుంటుంది. పరోక్షంగానైనా 'బావా'—అంటుందా అంటే అదీలేదు. "ఒరే బాబూ! భాస్కరాన్ని యిలా పిలు. కొంపోజిషన్ వ్రాయించుకోవాలి" అంటుంది. "ఎవరూ లేక పోతే నేం, భాస్కరాన్ని పంపించవమ్మా అంగడికి" అంటుంది. "ఒరేయ్ తమ్ముళ్లూ! కాను లు భాస్కరం కంట బడేసేరూ, లాక్కుంటాడు" అంటుంది. ఎందుకు దానికి తన మీద అంత అక్కసు? తనేమైనా బానిసవాడా?...పిల్లతనమూ అంటే పసమూ తెండ్లదానికి కుర్రతన మేమిటి యింకా? తనను ఏదో వింత జంతువును చూచినట్లు చూస్తుంది. అది అలా చూసినప్పుడు మనస్సు కలుక్కుమంటుంది. "దీన్ని పెళ్ళిచేసుకొని బ్రతక లేమురాబాబూ! ఇది అపరచండికగా వుంది. అంటూ ఆ పులిస్తాయి గుండెలు. ఒక్కోసారి చెడ్డకోపం వస్తుంది. దీన్ని పట్టుబట్టి పెళ్ళాడాలి ఆ తర్వాత చిత్రహింస చేయాలి, తన అధికార హస్తాల క్రింద చీమపురుగును నలిపినట్లు నలిపేయాలి—" అనుకుంటాడు.

ప్రతి ఆడపిల్లకు తల్లి దండ్రుల మీద, తోబుట్టువుల మీద ప్రేమ, మమకారం వుండడం సహజమే! అయినా దీన్నేమనాలి? తానేమైనా పరాయివాడా? తన పట్ల దీని కెందు కింత విముఖభావం? నోరు విప్పి 'బావా' అంటేనేం?...అలా పూర్వ ణఖలా చూడకపోతే, చిరునవ్వుతో ప్రసన్నంగా చూస్తేనేం? ఆనతిస్తూన్నట్లు మాట్లాడకపోతే, బ్రతిమాలుతున్నట్లు అడిగితేనేం?... తన మనస్సెంత సంతోషిస్తుంది! ఆమెపైన తనకేమైనా పగనా?...

మొన్నొకరోజు 'వాడు చూడమ్మా ఆ భాస్కరంగాడు గాడిదలా వున్నాడు, చిన్నపిల్లలతో చేరి ఎలా మిడిసిపడుతున్నాడో!"అంది. వంటింట్లో కెళ్ళి వాడు! తనను 'వాడు' అంది. మీదికి దూకి అలాగే గొంతు నులిమి చంపేద్దామా అన్నంత కోపం వచ్చింది. తాను అశక్తుడు. ఏమీ చేయలేడు. పెరట్లోకి వెళ్ళి కన్నీరు కార్చివచ్చాడు.

అతనికి నానాటికీ శాంతి దూరమైపోతోంది. పిల్లలమీద, విసుగూ, చిరాకూ పుట్టుకొస్తోంది. వాళ్ళను ఛీదరించుకుంటున్నాడు. వాళ్ళూ చాడీలు చెప్పడం నేర్చుకుంటున్నారు. ఇది పూర్తిగా పరాయికొంప! ఈ యింట్లో తాను పరాయివాడు. మాట్లాడాలంటే బిడియం, తినాలంటే బిడియం. ఇక్కడికి వచ్చిన పెుంలరోజుల్లోనూ యూడుసార్లు స్నానం చేశాడు. అంతే. అతనిమీద శ్రద్ధ తీసుకొని పరామర్శించే వాళ్ళే లేరు. రాను




లైటు
విషయం
లోభత్వం కూడదు...

# ఫిలిప్స్ అర్జెంటా

వాడి విరేక
వంతులు కొండి

మసక వెల్తురులో
కుట్టుపని చేసి కండ్లకు శ్రమ
కల్గించకండి
మిరుమిట్లు గొల్పని
ప్రకాశవంతమైన ఫిలిప్స్
'అర్జెంటా' లాంపు
150



ఫిలిప్స్ అర్జెంటా
మిరుమిట్లు గొల్పని
ప్రకాశవంతమగు
కాంతినిచ్చు లాంపులు
PHILIPS
ఫిలిప్స్ ఇండియా లిమిటెడ్
P 3628

రానూ—అందరూ తనను చులకన చేస్తున్నారు. గోతం పంచి చేతికిచ్చి, పోదుగాలు, మంత్రాలు కొసుకురమ్మంటారు; గేదెను తోలుకుపోయి మేపుకు రమ్మంటారు; తన ప్రతిష్ఠ అంతా మంట గలసిపోతోంది. ఒక్క గంట గడవడం ఒక్క యుగం గడిచినట్లుంది. బుద్ధి వుంటే యికమీదట బంధువులయిళ్ళకు వచ్చినా పోకూడదనుకున్నాడు. అక్కడి నుండి త్వరగా వెళ్ళిపోవాలి. ఇక జన్మలో మళ్ళీ ఆ గడప తొక్కకూడదు.

సొంతవూరిలో వుంటే తనకిటువంటి మనః క్లేశాలు వుండేవా? ఎంత ఖులాసాగా గడిచిపోయేవి రోజులు! తన పోషణమీద శ్రద్ధ వహించే తల్లి, తననుగురించి మంచీ చెడ్డా అడిగి తెలుసుకునే సోదరుడు, తన చుట్టూ సంతోషంతో మూగే స్నేహితులు! ఇన్నాళ్ళూ సొంతవూరిలో నేవుండి, సొంత వూళ్ళోనే స్కూల్ ఫైనలుదాకా చదివిన తనకు యిప్పుడు ఎవరింటిలోనో పడివుండా లన్న పాడు బుద్ధి ఎందుకు కలగాలి?... చిక్కిపోయావేమో అనిపిస్తోంది. ఆరోగ్యం చెడుతోంది. ఒక చొక్కా, ఒక పంట్లాం వీటినే ఉతికిఉతికి తొడుక్కుంటున్నాడు.

ఇః ఏమైనాకానీ, రేపోమాపో వెళ్ళి పోవాలి. తనయింటికి తానుపోవాలి. అమ్మను చూడాలనిపిస్తోంది. అమ్మ తనకోసం బెంగ పెట్టుకుని వుంటుంది. అన్నయ్యకూడా బాధపడుతూ వుంటాడు. వెళ్ళి, చూడాలి. ఈ నిమిషంలో నే వెళ్ళిపోయినా బావుండు ను. సుశీల తనను 'వాడు' అన్నప్పటి నుండి యీ కోరిక ప్రబలమై పోయిందతనిలో. ఇదే నిశ్చయం వేళ్ళు పాతుకు పోయింది.

ఒకరోజు ప్రాతఃకాలాన అనుకోని విధంగా శంకరం వూడిపడ్డాడు. ముసి ముసి నవ్వులు నవ్వుతూ భాస్కరాన్ని చూశాడు. భాస్కరం అతని మొహంలోకి చూడలేక, మొహం చాటుచేసుకుని, కనుకొలకుల్లో నిలిచిన బాష్పపూరాలను ముంజేతులతో తుడుచుకొన్నాడు.

ఆ సాయంకాలం—తనను, అన్నయ్యను మోసుకొని బస్సు తన వూరివైపు దూసుకుపోతూంటే, తేలిగ్గా నిట్టూర్చాడు భాస్కరం.

*　　　*　　　*

మూడేళ్ల తర్వాత ఒకనాటి మిట్టమధ్యాహ్నాం బస్సుదిగి, హాండ్ బ్యాగ్‌తో చెరువు కట్టమీద నడిచి పోతున్నాడు భాస్కరం. ఆ నడకలో హుందాతనం! ఆ ముఖంలో గాంభీర్యం! అప్పటి భాస్కరం కాదు యితను. ఆ కారంలో ఒడ్డూ, పొడుగూ ఏర్పడింది. శరీరం రంగుమారింది. బిగువైన కండరాలు, బిరుసెక్కిన ముఖం, ఆముఖానికి అందాలు తీరుస్తోన్న సన్నటి కోరమీసం,

(58-వ పేజీ చూడండి)

మా అనుభవం—మీ లాభం....

పిల్లల లివర్, స్ప్లీన్ వ్యాధులకు చికిత్స చేయడంలో దాదాపు 60 సంవత్సరాలుగా పొందిన అనుభవంతో జమ్మివారు సరిగా వ్యాధిని నిర్ధారణచేసి వెంటనే వ్యాధిని నిర్మూలించడానికి సరియైన సలహా నివ్వగలరు. మీ పిల్లల లివర్ పరీక్ష చేయించండి. జమ్మివారి డాక్టర్ మీ సమీపంలో గల పట్టణానికి ప్రతినెలా వస్తారు. ఆయన పర్యటన కార్యక్రమం కోసం వ్రాయండి.






జమ్మివారి
లివర్‌క్యూర్

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్

బ్రాంచీలు:
17/283 హిందివీధి, గాంధీనగర్, బకింగ్‌హాంపేట పోస్టు, విజయవాడ. | పొరుగంటివారి వీధి, విజయనగరం సిటీ




సర్వీసులో శ్రేష్ఠమైనదిగ నిరూపింప బడినది

సిల్వర్
ఎక్సైడ్

క్లోరైడ్ & ఎక్సైడ్ బ్యాటరీస్ (ఈస్టరన్) ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు, ఆంధ్ర, కేరళ, మైసూరు స్టేట్స్‌కు ప్రధాన ఏజెంట్లు
జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ ఆవ్ ఇండియా
ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-1.
బ్రాంచీలు: కోయంబత్తూరు, బెంగుళూరు, సికింద్రాబాద్.

లంకెబిందెలు
బాపు బొమ్మల కథ 4
అవధానీ, రెడ్డీ, ఊరుచివరున్న ఆ పాడింటికి బయల్దేరారు
దీపం వెలిగించకండి- జాగ్రత్త- ముందర ఆ కాపలావాడి సంగతి చూడాలి
మీరిక్కడే వుండండి నేను సంగతి చూస్తా మీరైతే గుర్తుపట్టొచ్చు
ఎవర...
చన్నుకుండా కాస్త....
చెయి చేసు కోనీయండి
మర్యాదస్తుడు-పాపం అరవకుండా పడున్నాడు
లోపలకి పదండి చూదాం
అడుగో రాజు- రాజూ రాజూ లే-లే-నేనూ రెడ్డిని-లే
అబ్బే లాభం లేదు అతను మన లోకంలో లేడు--
కళ్ళు తెరుస్తు న్నాడు...
ఏవిటండీ-అలా వెర్రి చూపులు చూస్తున్నాడు?
ఎవరో చేతబడి చేసి-మాట కట్టేశారు-
ఎలాగా మరి! హిప్నటైజ్....
ఇంగ్లీషు మంత్రాలేం జేస్తాయి- వుండండి కాస్త విభూది మంత్రించి ఇస్తా-
హఠాత్తుగా-ఏదో చప్పుడయింది-
తలుపవతల గాల్ళెం పెట్టారెవరో-ఇప్పు డెలాగ-?

# మీగడ తరకలు

ఆంధ్ర సాహిత్య క్షీరపారావారంలో మీగడ తరకల్లా తేటుగట్టిన మధుర ఘట్టాలెన్నో నాటికీ నేటికీ ఉత్తేజం కలిగిస్తూనే ఉన్నాయి. ఆయాఘట్టాలు హృదయం కదలించేవై 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనే సూక్తికి నిదర్శనాలుగా కూడా నిలుస్తున్నాయి.

శ్రీనాథుని 'పలనాటి వీరచరిత్ర'లో తల్లి రేఖాంబ మనుమ మాంచాలకు చేసిన కర్తవ్య బోధ ఆంధ్రుల చరిత్రనే మార్చిన అసమాన ఘట్టం. బాలచంద్రునితోడి భోగము లొకప్రక్క చిరయశస్సునకూర్చు త్యాగమొకప్రక్క మాంచాలను నలిగులి చేసే ఘట్టంలో ఆమె ఉపదేశం చదువుతుంటే అశ్రుధారలు రాచ్చని ఆంధ్రుడుండడు.

ముద్దుల మాంచాల ముదమున వినుము
జన్మ వృక్షమునకు జనిగలయట్టి
పటుతరకమనీయ ఫలములు రెండు
కీరలు భోగములొండు కీర్తి రెండవది
తొలుపండు చవిచూచి తొలగునొకండు
మలుపండు చవిచూచి మలగునొకండు
మీరలిద్దరికిని శేషంబు హెచ్చు
మొదటి ఫలంబున మొనపెదురసము
తుఱభం గురంబది పమసిపోగలదు
రెండవ ఫలమున రెక్కను రసము
శాశ్వతించౌను దిశల్ గలదాక
నీవు భోగములపై విరతి ద్యజించి
బాలచంద్రుని భద్రభావం బెరింగి
భావి మానవుల హృద్భవనంబులందు
దాకీన యశోలత వివర్ధనము
సేయంగ గోరుము చెలువరో! యిప్రుడు
బాలచంద్రుని నాగబట్టంగ వలదు

మాంచాల హృదయమున సాగరమథనమే జరిగినది. సురలోక భోగాలంగు కోనాలని కలలుగన్న ఆమెలో తుదకు భోగవాంఛలపొంగడగారి కార్య ముద్దీపించినది—మగనితో ప్రణయవీణలను రాగాలు పల్కే సమయంలో.

నాతో చెనంగిన నయ మేమిలేదు
కదువ సేగలనికి గదలుడిమీరు
కులవైరముందీర్చు గురుసాహసుండు
పరికించిమాడ నెవ్వరు మీరుదక్క

అని 'సత్కార్యౌచన కుత్సాహశక్తియై' అతనిని కదనరంగానికి కదలించినది.

మాంచాల విజయలక్ష్మి లాగున ...

బాలచంద్రుని కందిస్తూ ఆశీర్వదించింది.

'రతిరాజ సుందరా రణరంగధీర
కమల బాంధవ తేజ కరుణాలవాల
వినతాత్మజానిలావు వెసనీకు గలుగు
సామీరికుండిన సాహసం బబ్బు
కృష్ణుని కీడుగా కీర్తి ఘటిల్లు
రవి కౌంతేయుతుడవై రంజిల్లుచుండి
అలరాజు పగదీర్చు మనుజాలతోడ.
ఇటుతర విక్రమ వైభవంబలర
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుడు
వరము లొసంగంగ వర్తిల్ల గలరు.
క్షాత్రిక విజయంబు సమకూరుమీకు
నీయాయువును వడినిచ్చును జయము
కలియుగంబున మీకు ఘనపూజలమీగు'

పలనాటి వీరచరిత్రలో నేగాక ఆం...
వాఙ్మయ ప్రపంచంలోనే ఈఘట్టం ...
కరుణ శృంగారముల సంగమించిన త్రివే...
సంగమము. శ్రీనాథుని పలనాటి వీరచరి...
ఆంధ్ర యువకులకు కర్తవ్యోన్ము...
గావించు గీతోపదేశము కాగా

—పు(...






## జైరాడ్ రేడియో

ఎక్కడైనా—ఎప్పుడైనా
ఆనందమిచ్చును.
మాడల్ ఏ 96

6 వాల్వులు AC ఆల్ వేవ్, 3 బ్యాండ్సు, మాజిక్ కన్ను, టోన్ కంట్రోల్, & హెవీ మాగ్నెట్ స్పీకర్ గలిగి, చక్కని చెక్కపెట్టెలో అమర్చబడియున్నది.

ధర రు. 295. నికరం. (స్థానిక పన్నులు అదనం)

తయారుచేయువారు:

**జైరాడ్ ఎలెక్ట్రానిక్ ఇండస్ట్రీస్**

88, మింట్ స్ట్రీట్, మద్రాసు—8

అనుమతిగల డీలర్లు: ఎం. వి. భద్రయ్య & కంపెనీ, బెసెంట్ రోడ్, విజయవాడ, సాంబయ్య రేడియో & ఎలెక్ట్రికల్ సర్వీసెస్, విజయవాడ; గోలి భీమారావు, మెయిన్ రోడ్, తెనాలి.

# తెలుగు వెలుగులు-11



...ట్రిటు చేసినవాడు పండు తినేవరకూ ఉండడంఅరుదు; పండుతినేవాడు అంటు కట్టినవాణ్ణి గుర్తుకు తెచ్చుకొని కృతజ్ఞత తెలపడం కూడా అరుదే.

ఆంధ్ర పితామహుడు శ్రీ మాడపాటి హనుమంతరావు గారిని ఇప్పుడు మొదటి సారిగా చూసినవాళ్ళు—1948 సెప్టెంబరుకు పూర్వం ఆయన వహించిన పాత్రను ఊహించలేరు.

"నాయకత్వం నాకు రాజకానికి తగినదని నేనేనాడూ చెప్పుకోలేదు. నేనేనాడూ త్యాగాలు చేయలేదు. నేను అనవసరపు ఖర్చు దేనికి" అంటారు మాడపాటివారు వేదికపైనుంచి ప్రసంగిస్తూ, నవ్వుతూ. కాని సమావేశమైన వారికి, తెలంగాణాలో ఆంధ్రోద్యమ జ్యోతిని తొలుత వెలిగించినది ఆయన అని తెలుసు. ఆ జీవితమే నానాటికీ పెరిగి పెద్దదై నేడు ఎంతో వెలుగును ప్రసరింప చేస్తున్నది.

పోలీసు చర్య అనంతరం హైదరాబాదు నగరపాలక సంస్థకు మేయరుగా ఎన్నికైన శ్రీ హనుమంతరావు గారికి శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు ఒక విందు చేశారు. అప్పుడు మేయరు పదవి వారికి మొదటి గురు కట్నం అన్నారు శ్రీ రంగారెడ్డిగారు. ఎందరో తెలుగువారిని రాజకీయాల్లో ఆనాడు ప్రవేశపెట్టింది మాడపాటివారు. అందులో ప్రధానులు శ్రీ రంగారెడ్డిగారు.

మూడు నాలుగు దశాబ్దాల క్రితం వివేక వర్ధినీ సంస్థ యాజమాన్యంలో వున్న నిషాత్ టాకీసులో ఒక బహిరంగ సభ జరిగింది. వామన్ నాయక్ ప్రభృతులు ప్రసంగించారు. ఉర్దూలో, ఇంగ్లీషులో ఒకరిద్దరు మాట్లాడారు. శ్రీ హనుమంతరావుగారు లేచి తెలుగులో ప్రారంభించారు. ఉర్దూ ఆయనకి రాక కాదు. ఇప్పటికీ ఆయన అప్పుడప్పుడూ ఉర్దూలో చేసే ప్రసంగాలు చాలా చక్కగా వినసొంపుగా ఉంటాయి. తెలుగులో మాట్లాడడం ఆంధ్రుల భావిరాజధానిలో అవిధంగా ఆనాడు ఆయన ప్రారంభించగానే, శ్రోతలు అల్లరి ప్రారంభించారు. తెలుగులో మాట్లాడ్డం భరించరానిదైంది ఆనాటి శ్రోతలకి.

తెలంగాణాలో ఆంధ్రోద్యమ ప్రారంభానికి అంకురార్పణ ఆ తరుణంలోనే జరిగింది. అనతికాలంలో ఆంధ్ర మహాసభ వెలసింది.

సంస్థానాధిపుల క్రింద బాధ్యతాయుత పరిపాలన—ఇది ఆనాటి దేశంలో సంస్థాన ప్రజలందరి ధ్యేయం. ఇదే ధ్యేయంగా ప్రకటించాలని ఒకవర్గం ఆంధ్ర మహాసభలో మొదటే వాదన ప్రారంభించింది. మితవాదుల వర్గం దీనికి అంగీకరించలేదు. ఏది వారికి దానికి 'ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి' అనే పేరుతో లక్ష్యంగా ప్రకటించమన్నారు శ్రీ మాడపాటివారు.

అప్పటి పరిస్థితుల దృష్ట్యా ఇది చాలా వివేకంతో కూడిన సలహా. ఆ విధంగా గ్రంథాలయోద్యమంగా ప్రారంభమై, రాజకీయోద్యమంగా వికసించింది తెలంగాణాలో ఆంధ్రోద్యమం.

మొదటి కట్నంగా మేయరు పదవిని సూచించినా శ్రీ రంగారెడ్డి—తరువాతది ఏదో సూచించలేదు అప్పుడు. కాని ఆ రెండో కట్నం [ప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్ష పదవి] 1958 లో అందింది.

నారాయణగూడా బాలికల పాఠశాల, వెంకట్రామరెడ్డి మహిళా కళాశాల, ఆంధ్ర విద్యాలయం, శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం — ఇవి శ్రీమాడపాటివారి కృషికి, దీక్షకి చిహ్నాలు. అక్కడ ఏ రాయిని తట్టినా, మాడపాటివారి ప్రతిభ పాటని వినిపిస్తుంది. ★



# హరివంశము

అవతార పర్వము - 2

ఇందిర తొడలపై నింపార జాచిన
యడుగులు మణిపీఠియం దమర్చి
యొక్కింత సడలిన యుత్తంసదామకం
బభినవంబుగ మౌళి నలవరించి
కౌస్తుభోజ్వల పదకంబున బెనగొన్న
చారుహారావళి చక్కజేసి

కటిమీద జారిన కనకసూత్రంబుతో
పీతాంబరము దిండు బిగియ దిగిచి
శంఖచక్రగదాభయస్ఫారచిహ్న
ములు క్రమంబున శ్రీ హస్తముల వహించి
యోగనిద్రాంతవేళ నిట్లొప్ప నిలిచె
దేవదేవుడు దివిజుల దృష్టి యలర.

హరివంశ కథాకాలమునాటికి సప్తమ మనువు వైవస్వతుని మన్వంతరంలో రెండు యుగాలు అప్పుడే గడిచిపోయి వాయి. ద్వాపరయుగం కూడా చాలభాగం నడిచిపోయింది. ఈ మన్వంతరంలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, విశ్వులు, సాధ్యులు, అశ్వినులు అనిమిషు లయినారు. ఊర్జస్వి అనువాడు ఇంద్రుడై నాడు. కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, భరద్వాజుడు, జమదగ్ని, వశిష్ఠుడు సప్తఋషులు, మనుజాతులై ఇక్ష్వాకు ప్రముఖ మహీశాసకులను శాసిస్తు ధర్మం అవ్యాహతంగా సాగుతుండా కాలాని పట్టుకు వస్తున్నారు. వీరి యాజ్ఞలను లో బరచినిశాసిస్తున్న రాజులవలన బహువంశా

#  హరివంశం 

డి, భూమిని పంచుకొని, నగరాలను
పంచుకొని, ఏలుబడ్కు సాగిస్తున్నారు.
రాజులలో అప్పటికి ఇంకా అన్యోన్య
రాలు పుట్టలేదు. పాడిని, పత్యాన్ని వారు
డంలేదు. ఆరవ పాలు కప్పంగా తీసు
టూ, ప్రజలను మనస్తూ, అర్ధాన్ని
యుగా సమార్జిస్తూ, బంధుమిత్రామాత్య
త్యజనాభివృద్ధిగా, దేవ భూదేవ పితృ
తి జరిపిస్తూ ధర్మాన్ని సంరక్షిస్తున్నారు.
నగరంలో చూచినా రాజాంకు ఏనుగులు,
శ్వాలు బహు శతకోటిసంఖ్యాకంగా
ంటున్నాయి. ప్రజలకు తామరతంపరగా
తానాభివృద్ధి అవుతోంది. జనపదాలు
దానికంటె ఒకటి అభివృద్ధి చెందుతూ,
ష్మగా అమరి, ఆదియుగం లాగా భోగ
గ్యాలతో తులతూగుతున్నాయి. అంతా
ర్ఘాయుష్మంతులై ఉంటున్నందువల్ల,
మి ఆ భారాన్ని భరించలేని స్థితి ఏర్ప
గా, బ్రహ్మదేవునకు ఇదే ఆలోచన అయి
యింది. ఈ భూమి భారాన్ని తగ్గించేది
ట్లా? అచలం అయివుండికూడా ఈభూమి
ప్పుడు ఈ భారాన్ని మోయలేక చలనం
ందినదై, ఆర్తయై ఆక్రందిస్తోంది.
ప్పుడు పార్థివకులాన్ని కొంత కాకపోతే
ంతగానైనా ఉపసంహరిస్తేనే గాని ఈ
రం తగ్గదు. అయితే ధర్మలోపం జర
గకుండా ఈపని జరగడం ఎట్లా? ఈమన్వం
తరంలో కృతత్రేతలు గడచిపోయినాయి.
ద్వాపరం కూడా అవసానస్థితిలో పడు
తోంది. అట్లా అది అవసానం చెందుతున్న
కొద్దీ ప్రజాభారపీడితయై పృథ్వి ఆక్రోశిస్తోంది.
దేవతలు ఆ ఆక్రోశం విని అనుక్రోశం చెంది
తనదగ్గరకు వచ్చారు. మునులు జాలిచెంది
తన్ను సమీపించారు. విన్నవించుకున్నారు.
ఇప్పుడు ఏమి చెయ్యాలి?

బ్రహ్మకు ఒక్కటే ఆలోచన తట్టింది.
భగవంతుడైన విష్ణువు పాలసముద్రములో
ముగ్ధయోగనిద్రాళుడై, కృతత్రేతలు
గడపివేశాడు. ఆయన దగ్గరకు వెళ్లి ఈ విష
యం మొరపెట్టుకుంటే ఏదో చేస్తాడు. ఈ
ఆలోచనతో శతాంగుడు సర్వ బృందా
రకులను, సర్వఋషులను వెంటబెట్టు
కొని, పాలకడలికి వెళ్ళి, విష్ణు
వును, సుధీభావనీయుని, అనంతుని వే
వేలుపడగలపాము ప్రక్కగా యోగనిద్రలో
వున్నవానిని, ఆదిదేవుణ్ణి, మధురవాక్యాల
చేత ప్రస్తుతించాడు. ఆమాటలు భగవంతుని
చెవులకు సోకి ఆయన మేల్కొన్నాడు.
విచ్చిన ఆయన కన్నులు తెల్లని తమ్మిరేకు
లాగా వున్నాయి. ఆయనచూచిన చూపులు
చల్లగా వున్నాయి. వచ్చిన బ్రహ్మను,
దేవతానీకాన్ని చూచి "మీరు ఇప్పుడు
ఇక్కడికి ఎందుకువచ్చారు? ఎల్లలోకాలు
సుఖంగావున్నాయా? దితిసంతానం జగత్తుకు
ఏమీ పీడకల్గించడంలేదుగదా! అసురాధములు
తిరిగి అపరాధములు చేస్తున్నారా?" అని
ప్రశ్నించాడు. అప్పుడు బ్రహ్మ భూదేవి
పాట్లు ఆయనకు వినిపించి "నీవు వచ్చి మేరు
శిఖరంమీద కొలువుతీర్చి మాకు ఒక కర్త
వ్యాన్ని బోధించాలి. మా అందరికి తగిన
పనులు కల్పించి నియోగించాలి" అని అభ్య
ర్థించాడు. "సరే" నన్నాడు విష్ణువు. రెండు
యుగాలకుపైగా తాను శయనించివున్న
అనంతునిమీదనుండిలేచి గరుడుణ్ణి చేరదీశాడు.
ఆ గరుడుడు సుపర్ణుడు. వచ్చి వినమితు
డైనాడు. భగవంతుడు బంధురమైనఉత్సా
హంతో అతనిస్కంధాన్ని అధిరోహించాడు.
విష్వక్సేనుడు మొదలైన దేవసేనానులు
కోలాహలంచేశారు. మునులు ఆశీర్వాదాలు
పల్కారు; దేవతలు జయజయనినాదాలు
చేశారు. వారు తనవెంటరాగా భగవంతుడు
మేరుశిఖరానికి బయలుదేరాడు. వైనతేయుడు
రెక్కలువిదిర్చి, ఆకాశంలోకి ఎగరగా,
సర్వదేవతలు విమానాలలో ఆయన్ను అనుస
రించారు. దారిఅంతా నక్షత్ర గ్రహసంచార
పూరితమైవుంది. అయితే అదే సనాతనమైన
మార్గం. ఆమార్గాన్ని నిజగమనాగ్రహంచేత
అతిమాత్రపవిత్రం కావిస్తూ ముహూర్త
మాత్రంలో విష్ణువు మేరుశిఖరంమీద
వ్రాలాడు.

మేరువు బంగారుపర్వతం. బ్రహ్మాండా
నికి కేంద్రం. అప్సరసలు దానిమీద ఆడు


మిల్క్ ఆఫ్ మెగ్నీసియా
మెగ్నీషియా మాగ్మా యూ.ఎస్.పి.
పైత్యనాశిని విరోచనకారి
ప్రత్యేకమగు ప్యాకింగుకొరకు చూడుడు
ఎల్లప్పుడును అడగవలసినది.
MARTIN & HARRIS (PRIVATE) LTD. INDIA & BURMA
ఎమ్. అండ్ ఎచ్. బ్రాండ్
MILK OF MAGNESIA
MAGNESIA MAGMA USP
MANUFACTURED IN INDIA BY
MARTIN & HARRIS (PRIVATE) LTD.
18, ASHUTOSH MUKHERJEE ROAD, CALCUTTA 20
"టున్నాల్" వారి వస్తువు

కుంటూవుంటారు. సిద్ధులు, సిద్ధతరుణులు పాడే పాటలు ఆ పర్వతంయొక్క గుహల్లో ప్రతిధ్వనిస్తూ వుంటాయి. అక్కడ మందార వనాలు వున్నాయి. కొలంకులు వున్నాయి. ఆ కొలంకుల్లో బంగారపు తామరపూలు పూస్తాయి. తుమ్మెదలు ఆ పువ్వులమీదవాలి, మధువును సేకరిస్తూ. సిద్ధసాధ్యాదిదేవతానీకం గానాన్ని వల్లిస్తూవుంటే శ్రుతి వేస్తూ వుంటాయి. ఆ మేరువుమీద ఎన్నో దివ్య ధామాలు వున్నాయి. విష్ణువు తన యీ పరివారంతో ఆదివ్యధామాలలో విడిదిచేశాడు. ఆ భవనాలలో విశ్వకర్మనిర్మించిన సభాభవనం, విచిత్రరచనానిర్మాణనిరూఢం అయింది, ఒకటివుంది. దానిపేరు కామగామిని. కామదాయిని కామరూపిణి అని కూడా అంటారు. విష్ణువు అందులో కొలువు తీరాడు. అందులో ఆసనాలు అమర్చబడి వున్నాయి. ఉన్నతాసనాన్ని ఆయన అలంకరించాడు. బ్రహ్మ మొదలుగాగల దేవతలను ఆనుపూర్విగా కూర్చుండ నియమించాడు యతులు, గంధర్వులు, సిద్ధులు విద్యాధరులు, ఉరగులు వచ్చి తమకు, తమకు నియమితమైన ఆసనాలమీద కూర్చున్నారు.

ఇంతలో భూదేవియే అక్కడికి వచ్చింది. అతీయమైన దివ్యరూపం తాల్చి వచ్చింది. ఆ వచ్చిన ఆమెలో పరమమైన ఆర్తి కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. దేవతలంతా ఆమె వంక చూచారు. ఆమె తీరునిచూచి విక్కలిగా వెక్కసపడ్డారు. ఎంత కష్టం, ఎంత కష్టం—అని వాళ్ళు అన్న మాటలతో దిక్కువారాలు ప్రతిధ్వనించాయి. భగవంతునికి వారి యీ ఆక్రోశం అక్కజమై కన్పించింది. తనకు తన కష్టం చెప్పుకుందామని రాగా, ఆ కష్టాన్ని ఆమెలో దర్శించి, ఉద్విగ్నులై సభ్యులు చేస్తున్న విచారసూచి కలకలాన్ని. వాయుదేవుడు చెయ్యెత్తి వారించి. భూదేవిని చూచి సమర్యాదంగా—"తల్లీ! నువ్వు ఎందుకు వచ్చావు? ఆ కార్యం అంతా విన్నవించుకో" అని సంబోధించాడు. అప్పుడు భూదేవి కృతాంజలియై తన మనఃక్లేశాన్ని ఆ సభలో ఇట్లా విన్నవించుకుంది.

"ఈ పురుషోత్తముడు, ఈ పరమేష్ఠి, ఇంతమంది వేల్పులు వున్న ఈ సభలో నా పడేపాట్లనుగూర్చి విజ్ఞాపనం చేసుకుంటాను. దయతో సభ్యులు నా విజ్ఞాపనాన్ని ఆలకించాలి. చరాచరభూతధారణం అధికారంగా నిర్ణయించి పరమేష్ఠి నన్ను సృష్టించాడు. ఇట్లా వుండగా ఏకార్ణవకాలం వచ్చింది. అప్పుడు ఇద్దరు దైత్యులు ఘోరమైన తపస్సుచేస్తూ, ఆ తపస్సులో కాష్ఠకుడ్య సదృశం అయినటువంటి నిశ్చలత్వంతో పెద్దకాలం వున్నారు. వాయువు వారి శరీరాలలో నవద్వారాల గుండా ప్రవేశించి. నాడీపూరణంచేయగా,




పోలికలు : చిత్రం : శంకరం.

వారి అఖిలాంగాలు పూర్తిగా పెరిగిపోయినాయి. దిక్కులు, ఆకాశం అంతా వారి నిండిపోయారు. అప్పుడు బ్రహ్మ వారి దగ్గరకు వచ్చి, వారిని పరీక్ష చేశాడు. ఒకని శరీరం మృదువుగా వుంది. ఇతరుని శరీరం కఠినంగావుంది. అందుకే వారికి మధువు, కైటభుడు అని ఆయన నామకరణం చేశాడు. వాళ్ళు అట్లా ఆ శరీరాలతో ఎంతకాలం ఆ ఏకార్ణవంజలాల్లో నిద్రపోయి వున్నారో ఎవరూ చెప్పలేరు. అంతలో ఒక్క దినాన వారికి తెలివికల్గింది. భుజాదర్పం హెచ్చింది. తమతో పోరాటం సాగించే సత్త్వవంతుడెవడైనా వున్నాడా అని వాళ్ళిద్దరూ, ఆ ఏకార్ణవంలో మోత పెట్టారు. ఆ అర్ణవం అంతా కలయతిరిగారు. వారి ఆ తిరగడం చూచి బ్రహ్మ విష్ణుమూర్తి నాభిపద్మంలోకి దూరి దాక్కున్నాడు. ఆయనకు అంత భయంవేసింది. అప్పుడు విష్ణువు వారికి ఎదురు నడిచాడు. దితి సంతానమైన ఆ ఇద్దరూ చేతులు చాస్తూ, జబ్బలు ఆస్ఫాలించుకుంటూ, ఆయన్ను తాకారు. ఆయనకు, వారికి, కొన్ని దివ్యాబ్దసహస్రాల

కాలం యుద్ధం అద్భుతమై నడిచి
విష్ణువు తొక్కు చెదరడం లేదు. దస్సిపోం
లేదు. ఖేదం చెందడంలేదు. మధుకై
లకు అది పరమాశ్చర్యమైపోయింది. ఆ
అద్భుత భుజావిజృంభణాన్ని తప్పిం
కోవడం వారికి చేతకాలేదు. "నిన్ను నే
మెచ్చాము. నీచేత చచ్చినా, అది వ
మర్యాదగానే వుంటుంది. అయితే నే
నీళ్ళలో చావము. భగవండా! మమ్మ
చంపు. ఎందుకు ఇట్లా బాధ పెడతా
అని మధుకైటభులు విష్ణువుకు విజ్ఞప్తి
కున్నారు. అప్పుడు విష్ణువు వారిని రె
చంకల సందున ఇరికించుకొని బాహుబ
చేత నొక్కిపట్టి కూల్చి జలాల్లో ప
తరళతరంగ జాలాల తాకిడికి ఆ రెండు
రాలు ఇటు కదిలి అటు కదిలి ఆ రె
తల్లో వున్న మెదడు జారిపడి ఆ నీళ్ల
తెట్టుకట్టింది. అట్లా తెట్టుకట్టిన ఆ మె
నాపయిన పొదవిన కారణంచేత భగవంత
అప్పటినుంచి నన్ను - మేదినీ - అం

(47 వ పేజీ చూడండి)

# క్రాస్‌వర్డ్స్-కళ్యాణం

ఊళ్లోకల్లా కాస్త ఓపిక, శ్రద్ధా వున్న స్కూలు మాస్టర్లలో పరంధామయ్యానే ...దు చెప్పాలి, ఉదయాన్నే లేచి, ముఖ ప్రక్షాళనం తదనంతరం స్నానసంధ్యావాదులు, ...వించి, అటు తరువాత కాస్త ఫలహారం, ...తీపుచ్చుకొని తన క్రాస్ వర్డ్సు పజిల్స్‌తో ...పీగా ఎనిమిది గంటలకల్లా స్కూలు ...కకుంటాడు. మనిషిలో గడుసుదనం ...న్నదే కనపడదు. ఉత్త బోళామనిషి.

క్రాస్‌వర్డ్స్ అంటే పరంధామయ్యకి ...నిపిచ్చి. ఎప్పుడు చూసినా ఆ కాయి...ల్లో తలదూర్చి లోకాన్నే మరిచి...తాడు. ఇంట్లో వున్నపుడు, ఖాళీ పీరి...డ్స్‌లోను, ఈ కాయితాల్లో అతనికి ...గా ఊసుపోయేది. ఖాళీ పీరియడ్‌లో, కాయితాల్లో కూడుంటే అతనికి గంట ...డా వినపడేదికాదు సాధారణంగా ...లు వచ్చి క్లాసుకి పిల్చుకెళ్లేవారతన్ని. ఈ క్రాస్‌వర్డ్స్ మూలంగానే పెద్ద ...తురిపెళ్లి చెయ్యగలిగాడు. కాని అదేం ...మాచారమో చిన్న కూతురుపెళ్లి ఈ క్రాస్‌వర్డ్స్ మూలంగానే ఆగిపోయింది. ...రణం? పెద్దకూతురి పెళ్లి తలపెట్టే ...జుల్లో పరంధామయ్యకి క్రాస్‌వర్డ్స్‌లో ...గా లాభం వచ్చింది. అందుకే తమ పెద్ద ...కూతురి పెళ్లి ఘనంగా జరిపించాడు. అటు ...ర్వాత మిగిలిందంతా క్రాస్ వర్డ్స్‌కే ...యం చేసేడు. ఇంతలో చిన్న కూతురు ...ంత పెద్దమనిషై పెళ్లికి తయారైంది. ...ర డబ్బులేదు. ఇతరుల నెవ్వడూ ...యాచించని పరంధామయ్యకి దారి, తెన్నూ ...పట్లేదు. అంతవరకూ పుట్టెడాశతో ...మురుచూస్తున్న మేనరికం కాస్తా ఎదురు ...రిగింది. దాంతో, శాంత పరంధామయ్యకి ...ండెలమీది కుంపటిలాగా తయారయింది.

శాంత, అంత రూపసి కాకపోయినప్ప...కీ, అనాకారిమట్టుకు కాదు. ఆ ముఖంలో ...కో కనపడని ఆకర్షణమట్టుకు ఉంది. ఆమె ...మాయకపు చూపులు ఎవరినైనా ఇట్టే ...దరగొట్టేవి. ఆమె నిండైన విగ్రహం ఇతరు...ని ఆకర్షించేది.

"శాంత పెద్దమనిషై రెండేళ్లవుతోంది. ...సంబంధాలేనా చూడకూడదాండీ" అని ...రోజున అడిగింది పార్వతమ్మ.

"పైసంబంధాలకేనా ఎక్కడికని తిరిగేది. ...కొక్కళ్లకే దాహాలు పెరిగిపోతున్నా...యి. వాళ్లదాహాలు, కోరికలు తీర్చసరికి మనకి బొచ్చెలు చేతికొస్తాయి" అక్కసు వెళ్లబుచ్చేడు పరంధామయ్య.

"అవునెండి. ఏదట్లా వున్నా మీకేం కావాలి? మీరు మాత్రం మీలాంటి మానరు. దానిమూలంగానే ఇంతవరకూ వచ్చింది" అన్న పార్వతమ్మ మాటల్ని సగంలోనే అందుకొని,

"అవును దాని మూలంగానే పెద్దదానికి పెళ్లి చెయ్యగలిగేము. లేకపోతే అదిగూడా అలో లక్షణాఅంటూ ఇక్కడే పెట్టవలసిందిగా ఎదన్నా అంటే నామీద విరుచుకు

జి. వి. నరసింహం

పడ్డం చేతవ్వు. చేసేడుగా మీ అన్న నిర్వాకం. చేతిలో డబ్బున్నంతసేపు రోజుకి పది సార్లొచ్చేవాడు. ఇప్పుడేమయిందా ఆప్యాయత? తన కొడుకు కేదో తెనో ప్రేమించేట. దాన్ని తప్ప ఇంకెవత్తెని పెళ్లి చేసుకోనని ఈయన్తో చెప్పేట్ట అందుకే తనీ సంబంధం వదులుకోవలసి వచ్చిందట—ఇన్ని చెప్పే బదులు తనకే ఇష్టంలేదని చెప్పకూడదూ—వెధవ డొంకతిరుగుడు సమాధానాలూ తానూ నూ" పళ్లు కొరికేడు పరంధామయ్య.

దాంతో కిక్కురుమనకుండా పార్వతమ్మ ఇంట్లో కెళ్లిపోయింది. వీళ్ళ సంభాషణంతా విన్న శాంత దుఃఖం ఆపుకోలేకపోయింది. తల్లిని చూడగానే బావురుమంటూ వెళ్లి గట్టిగా పట్టుకొని

"నాకసలు పెళ్ళొద్దమ్మా. నామూలాన మీ రెందుకు విచారపడతారు. పెళ్లి లేకపోతే లేకపోయింది. ఇక్కడే వుండిపోతాను" అని తల్లి భుజాలమీద వాలిపోయింది.

"అవేం మాటలే పిచ్చితల్లీ! మీనాన్న మంచి సంబంధాలు చూస్తానన్నారుగా—అట్టా ఏడవకూడదు. లేమ్మా" అంటూ ఓదార్చసాగింది పార్వతమ్మ.

వీళ్ళ సంభాషణ విన్న పరంధామయ్య మనస్సు కళుక్కుమంది. తన అసహాయస్థితికి తనే నిందించుకుని పైమీద కండువా వేసుకొని వీధులో కెళ్ళేడు.

* * *

"ఏమండోయ్! ఏదో ఉత్తరం వచ్చిందండీ" అంటూ అప్పుడే ఇంట్లో అడుగిడుతున్న పరంధామయ్యకి ఓ వుత్తరం అందించింది పార్వతమ్మ. ఎక్కణ్ణించో అని ఆత్రుతగా విప్పి చదువుతూ మధ్యలో ఓ సారి సంతోషం వెళ్లబుచ్చేడు. అంతవరకు ఆత్రుతతో చూస్తున్న పార్వతమ్మ "ఏమిటండీ?—ఎక్కణ్ణించి వొచ్చిందండీ!?" అని గబగబా అడిగింది.

"ఉండూ—సాంతం చదవనీ చెప్తాను" అని చదివి కాయితమ్మడిచి జేబులో పెట్టి పార్వతమ్మవేపు చూసి "అల్లుడి దగ్గిర్నుంచొచ్చింది. అక్కడేదో ఓ మంచి సంబంధం వుందని రాసేడు మన శాంతికి ఈడూ జోడైనవాడేట. బి. ఏ. పాసయ్యాట్ట. ఎక్కడో వుద్యోగంకూడా చేస్తున్నాట్ట. అమ్మాయిని చూసింతర్వాత కట్నం సంగతి చెప్తారట. నన్నోసారివచ్చి వాళ్లని కల్సుకోమన్నాడు. శాంతని కూడా తీసుకురమ్మని రాసేడు" అని వుత్తరం తాలూకు సారాంశం చెప్పేశాడు. అప్పటికే పార్వతమ్మ పెద్ద కొండని దింపినంత సంబరపడింది.

మర్నాడే పరంధామయ్య శాంతతోబాటు గుంటూరు బయల్దేరేడు. బండి గుంటూరు చాలా ఆలస్యంగా చేరింది. అప్పటికే బాగా పొద్దెక్కింది. వెంటనే పరంధామయ్య సామాను జట్కాలో ఎక్కించి బ్రాడీపేట నాలోలైను పొమ్మన్నాడు. జట్కాయమా స్పీడులో పోతోంది. మరో పావు గంటకల్లా ఇంటికి చేరుకున్నారు.

అప్పుడో ఇంట్లో అడుగిడుతున్న శ్రీహరిరావు శకుంతలకి బదులు మరదల్ని, మామగారిని చూసి ఆశ్చర్యపోయేడు.

"నమస్కారం మామగారూ. నావు త్తరం అందిందా మీకు" అంటూ ప్రశ్నించేడు.

"మరే అందుకేగా మేంవస్త! ఇంతకీ

ఆమె: నేను పెళ్లాడాలంటే ఒకటే షరతు. నాలుగు అంకెలు జీతం సంపాదించేవాడు గాని నాకు పనికిరాడు.

అతను: అయితే మరింకేం— నాజీతం నాలుగంకెలే.

ఆమె: ఎంత మీ జీతం.

అతను: 0000.

ఆ అబ్బాయి ఏందులో పనన్నావు?"

"సేమనల్ టుబాకో కంపెనీ లేదూ — అందులోనే పనిచేస్తున్నాడు — అయితే వాళ్ళని రేపు రమ్మంటాను," అంటూ శకుంతలచేతిలో తువ్వాలు పైమీద వేసుకొని పెరట్లో కెళ్ళిపోయేడు.

మర్నాడుదయాన్నే శకుంతల పెందరాళే లేచి. చెల్లెల్ని పెళ్ళిచూపులకొచ్చే వాళ్ళకనీ ఇల్లంతా చక్కపెట్టింది. మరో పావుగంటకి వాళ్ళొస్తారనగా శాంతని అచ్చు పెళ్ళికూతురులా ముస్తాబు చేసింది. ఇంతలో వాళ్ళురానే వచ్చారు. జరగవలసిన మర్యాదలన్నీ జరిగేయి. పెళ్ళికొడుకు తండ్రి హనుమంతరావు శ్రీహరిరావుని పక్కకి పిల్చి ఏం లేదన్నా అయిదు వేలన్నా కట్నం కావాలని నిక్కచ్చిగా చెప్పాడు. అదే శ్రీహరిరావుకూడా మామగారితో చెప్పేడు.

"ఐదు వేలే!" అంటూ ఆశ్చర్యపోయేడు పరంధామయ్య. అంతకి మరి తగ్గలేనని ఖండితంగా చెప్పాడు హనుమంతరావు. పరంధామయ్య మరి మాట్లాడ్లేకపోయేడు. అంతే ఆ సంబంధానికి తిలోదకాలొదిలేశాడు పరంధామయ్య.

మర్నాడుదయాన్నే ప్రయాణంకట్టేడు పరంధామయ్య. రైలు గుంటూరు వదిలింది. తండ్రీ, కూతురూ దిగులుముఖాల్తో శూన్యంలోకి చూస్తున్నారు. బండి అప్పుడే మంగళగిరి స్టేషన్లో అడుగు పెట్టింది. రైలులోకి ఒక్కసారి యాత్రప్రజంతా ఎక్కేరు. అంత రద్దీలో కూడా అందర్నీ తోసుకుంటూ పెట్టెలో చేరిన ఓ యువకుడు పరంధామయ్యనిచూసి "నమస్కారం మాష్టారూ!" అన్నాడు. దాంతో పరంధామయ్యకి మెలకువ వచ్చినట్లయింది.

"ఎవరు నాయనా నువ్వు?" అనడిగేడు.

"తాసిలారు శంకరంగారబ్బాయినండి" అన్నాడు యువకుడు.

"ఎవరూ? రామనా?"

"అవునండి" అంటూ పరంధామయ్యకి దగ్గరగా వచ్చేడు రామారావు.

"హరి పిడుగా! అప్పుడే ఇంతవాడి వయ్యేవోయ్! గుర్తేపట్టలేక పోయేను" అన్నాడు పరంధామయ్య ఆశ్చర్యంతో రామారావు భుజంతడుతూ.

రామంది కాస్త పొడవైన విగ్రహమే. తెల్లగా పొడవుకుతగ్గ ఒడ్డుకూడా వుంటుంది. ఆ సంవత్సరమే బెజవాడలో బి. ఎ. పాసయ్యేడు. తన చిన్నతనంలో పరంధామయ్య దగ్గరే చదువుకున్నాడు. మనిషి కలుపుగోలుగా నలుగుర్లోనూ తిరుగుతాడు. కొంచెం మాటకారి. అందగాడు కూడాను. అతని విశాల వక్షస్థలం, విశాలమైన ఫాలభాగం ఇంకా అనోరకమైన ఆకర్షణ అతని ముఖంలో కనపడుతూంటుంది.




"నాకసలు పెళ్ళేవద్దమ్మా..." అని తల్లిభుజాలపై వాలిపోయింది.

## ★ క్రాస్‌వర్డ్స్-కల్యాణం ★

...్న చూసిన ఏ స్త్రీ అయినా మళ్ళీ ఒకసారి చూడాలని వెనుతిరక్కమానదు. ...ను రైలెక్కిందిమొదలు "మా సారిపక్క కూచున్న అమ్మాయి ఎవరూ?" అని మనసు ప్రశ్నిస్తూనేవుంది. తనుకూడా "ఎవరా!" అని కాంతవేపు చూస్తూనే వున్నాడు.

ఇంతలో

"ఏమ్మా కాంతా, నీకు జ్ఞాపకం వున్నాడామ్మా మన రామం?" అంటూ కాంతవేపు తిరిగేడు పరంధామయ్య.

అదివరకే వాళ్ళ సంభాషణలో రామాన్ని గమనించిన కాంత, ఎందుకో మరోసారి చూడాలనిపించి ముఖాన్ని రామంవేపు


# ఎంతో త్వరగా పెద్దవాడయేడు, ఔనా?

(... కాని వాని దుస్తులు యింకా) త్వరగా పొట్టి అయిపోతాయి. మీ దుస్తులను చాలకుండా క్రుంగేలా చేయుటకు ఒక రోజు, ఒకసారి ఉతుకుతే చాలును. కాని మీరు కొనే నూలు బట్ట ప్రతి గజముమీద మరియు బట్ట తయారుగానున్న దుస్తులమీద 'సాన్ఫొరైజ్‌డ్' లేబిలు చూస్తే బట్ట క్రుంగునని బాధ ఉండదు. ఎన్నో సార్లు ఉతికినా కూడ మీ దుస్తులు చాలనట్లుగా ఎన్నటికీ క్రుంగవని మీరు నమ్మవచ్చును.

లేబిలుమీద

**·SANFORIZED·**
REGD TO ME

గుర్తు ఉన్నదా అని గమనించండి! అలా ఉంటే మీ దుస్తులు చాలనట్లుగా ఎన్నటికి క్రుంగవు!

[illegible] 'సాన్ఫొరైజ్‌డ్' ట్రేడు మార్కు యొక్క అధికారులైన క్లూయట్ పీబొడీ అండ్ కంపెనీ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితము) వారిచే ప్రచురింపబడినది. ఈ కంపెనీ యొక్క కచ్చితమైన ప్రమాణములకు తగినట్లు క్రుంగకుండా ఉండే బట్టం మీదనే 'సాన్ఫొరైజ్‌డ్' ట్రేడు మార్కు వేయుటకు అంగీకారము యిస్తాము.

వివరములకు: 'సాన్ఫొరైజ్‌డ్' సర్వీస్, 95, మెరీన్ డ్రైవ్, బొంబాయి-2.

SAN 58-1 TE




తిప్పింది. అకస్మాత్తుగా రామం కూడా శాంతివేపు చూసేడు. అంతే—తన ప్రేమని తల దించేసింది శాంత. అక్కడితో ఊరుకోక తన తలతో బాటు రామం మనస్సులో ఓ భాగం కూడా దించేసింది. ఒక్కసారి రామం ఒళ్ళంతా పులకరించింది. "అయితే మూర్తారూ! మీరింకా క్రాస్‌వర్డ్సు కడుతున్నారా?" చిన్ననాటి చనువుతో అడిగేడు రామం పరంధామయ్యవేపు తిరిగి. కాని అతని ఆలోచనంతా శాంతిమీదే వుంది.

"రొంపిలో దిగకూడదు కాని, దిగిన తరువాత పైకి రావడం మనతరమా బాయనా? దానిమూలంగానే గా ఈ స్థితికి వచ్చింది", అంటూ తన గాథనంతా వ్యక్తపరిచాడు పరంధామయ్య. ఇంతలో రైలు కృష్ణాబ్రిడ్జి దాటి బెజవాడలో అడుగెట్టింది. దిగవలసిన జనం అంతా సామానుచూసుకొంటున్నారు. మిగిలినవాళ్లు తమ జాగాల్ని కొంచెం విశాలం చేసుకొంటున్నారు. రామం కూడా తన జాగాలోంచి లేచి నిలబడి "వస్తాను మేష్టారూ" అంటూ గబగబ దిగి వెళ్ళిపోయేడు. ఇప్పుడు శాంత ఆలోచనంతా రామంమీద వుంది. ఇంకా తనతో రామం ప్రయాణం చెయ్యాలనిపించింది శాంతకి. ఇంతలో రైలు ఒక్క కూతకూసి ముందుకి కదిలింది.

సాయంకాలానికల్లా పరంధామయ్య శాంత యింటికి చేరుకున్నారు. వీళ్ళని వీధిలోనే చూసిన పార్వతమ్మ గబగబా ఇంట్లో కెళ్లి ఓ టెలిగ్రాం పట్టుకొచ్చి "చూశారా అదృష్టమంటేను!" అంటూ పరంధామయ్య చేతిలో పెట్టిందా కవరు. సారాంశం తెల్సుకున్న పరంధామయ్య పార్వతమ్మతో

"నీ కీ సంగతి ఎవరు చెప్పేరు?" అని అడిగేడు.

"మధ్యాహ్నం పోస్టుజవాను వచ్చి ఇచ్చేడు ఎక్కణ్ణించో అని గాభరాతో మా అన్నయ్యకి చూపిస్తే ఈ సంగతి చెప్పేడు—మీకు ప్రైజు వచ్చిందని," అని "ఇంతకీ వెళ్ళిన పని పండా? కాయా?" అడిగింది పార్వతమ్మ.

"కాయే...నేమందే చెప్పలా? ఒకొక్కళ్ళ దాహాలు తీర్చడం మనతరంగాదని" అంటూ నావ్వేశాడు పరంధామయ్య.

"పోన్లెండి, అదృష్టముంటే! అంతకంటె మంచి సంబంధమే వస్తుంది" అంది పార్వతమ్మ.

"ఎందుకు రాకూడదూ అదృష్టముంటే! అయినా ఆ బ్రహ్మ ముళ్ళు తప్పించడం మన వశమా? చెప్పు బావా?" అంటూ లోనికి ప్రవేశించేడు పార్వతమ్మ అన్న రమణయ్య.

"అప్పుడే తయారయ్యాడా" అనుకున్నాడు పరంధామయ్య అదోలా ముఖం పెట్టి.

మేనమామ రాకతో ఇంట్లోకెళిపోయింది శాంత. పరంధామయ్య ముఖం చూసిన రమణయ్య తను వచ్చినపనిని అట్టేవుంచి, ఏదో లోకాభిరామాయణం మాట్లాడి కొంచెంసేపు కూర్చొని, తనపని రేపు చూసుకోవచ్చని అనుకొని వెళిపోయేడు.

ఆ మర్నాడు సాయంకాలమే "చెల్లాయ్! ఈ సంగతి విన్నారమ్మా!" అంటూ తయారయ్యేడు రమణయ్య.

"మొన్నీ మధ్య మావాడి కిద్దామనుకున్న అమ్మాయి కలరా వచ్చి మూడుగోజుల క్రిందట పోయిందట. పాపం... ఇంతకీ విధి వ్రాత తప్పింపతరమా!" అంటూ పరంధామయ్య వేపు తిరిగి "బావా! ఆ అమ్మాయి పోవడం, ఇప్పుడు శాంతకీ సంబంధం తప్పిపోవడం. నీకేమనిపిస్తోందో చెప్పు" అనడిగేడు. దాంతో పరంధామయ్యకి ఒళ్ళు మండిపోయింది.

"నా బొందిలో ప్రాణం వుండగా నీ కొడుక్కి నా కూతుర్నివ్వను. ఏమనుకుంటున్నావో పరంధామయ్యంటే!" అన్నాడు. ఆ సమయంలో పరంధామయ్య ముఖం చూడాలేకాని వర్ణించ తరంగాదు. ధర్తవాలకం చూసి ఇంట్లో కెళ్ళిపోయింది పార్వతమ్మ.

"నే నేమన్నానని నీకీ కోపం బావా!" అంటూ ప్రాధేయపడాడు రమణయ్య.

"నాకోపం దేనికి!...ఆనాడే నేనొచ్చి అడిగితే ఏమన్నావో జ్ఞాపకం వుందా?... నీకొడుకు కవతైనో ప్రేమించాడని, అనేకాక నీ కొడుక్కి శాంత నచ్చలేదని, అంతా నీకొడుకే అక్కర్లేదన్నట్లు చెప్పావే. ఇప్పుడు శాంత నచ్చుతుందా వాడికి— చేతిలో దమ్మిడీ లేకపోతేసరి ఎవరూ నచ్చరు. పిసా పోగయిందవగానే కొండమీద కోతైనా సరే నచ్చుతుంది...ఇటువంటి ఇంట్లో వేసేకంటె దానికింత విషం ఇచ్చి చంపితే మంచిది" ఖచ్చితంగా తెంచేసేడు పరంధామయ్య. చేసేదిలేక ముఖం వేలేసుకొని వెళ్ళిపోయేడు రమణయ్య.

"సార్! పరంధామయ్యగారున్నారా?" అంటూ అడిగేడు పోస్టుజవాను, అప్పుడే వీధిలో అడుగెడుతున్న రమణయ్యని చూసి.

"ఏం?" అన్నాడు కోపంతో.

"వారికో వుత్తరం వచ్చింది" అని కవరూ రమణయ్య చేతికందించి వెళ్లిపోయేడు పోస్టుబంట్రోతు. ఇంకో రెండ్రోజుల్లో మీకు డబ్బు పంపిస్తామని రాసిన క్రాస్‌వర్డ్సు కంపెని వుత్తరం అది.

ఆ తరం అందుకొని తిన్నగా ఇంటికెళ్ళి చించిపారేశాడు రమణయ్య. అంతకిమించి మరేం చెయ్యలేకపోయాడు.

వీధిలో బండి ఆగడం గమనించి 'ఎవరా'

(64-వ పేజీ చూడండి)

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు
లోధ్ర
కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14
ఆంధ్రప్రదేశ్ ఏజంట్లు
మెసర్సు సీతారామ్ జనరల్ స్టోర్సు ఏజెన్సీస్
విజయవాడ, సికింద్రాబాదు.

తైలము
అంగగనములు బలహీనత చెంది, చిన్న దినచో తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటుగుణమునకు రూ. 25-0-0 లు.
డాక్టర్ రత్నంసన్స్, (Estd 1904)
మలకపేటబిల్డింగ్స్, ఆజంపురా మార్కెట్ వద్ద, హైద్రాబాద్ (దక్కన్) 2 A.P.

గ్రైపెండ్
బిడ్డల ఆరోగ్యాన్ని క్రమపరచును
అన్ని షాపులలోనూ దొరకును
వ్యాపార వివరములకు వ్రాయండి.
విల్‌ఫ్రెడ్ పెరీరా ప్రైవేట్ లి.
మద్రాసు-7
56-TG

నారసింహ లేహ్యము
బంగారుతో చేరినది. మేహము ...క్షాక, విస్ఫత్తువవగైరా హరిం... బలము రక్తవృద్ధి కల్గించును. 20 ... డబ్బీ రు. 3-8-0 పోస్టేజి రు.1-1-
...ఎ. ఎ. అండ్ కంపెనీ ఆయుర్వేద వమాజం
పెరిదేపి (PO) నెల్లూరుజిల్లా



# పెద్దిభొట్ల సుబ్బరామయ్య

ఆ వాడాదివారం. రామచంద్రమూర్తి ముందుగదిలో కుర్చీలో కూర్చుని ఇల్లు వారి అబ్బాయిదగ్గర దినపత్రిక అడిగి కుని చూస్తున్నాడు. వాకిట్లో వేపచెట్టు ంద ఇల్లుగల వారి చిన్న పిల్లవాడు ఇద్దరు గుర స్నేహితులతో గోలీకాయలు ఆడు ంటున్నాడు.

ఇంతలో వాకిట్లోనుంచి 'రామచంద్ర గారీ' అని కేకవినిపించింది. అతను ర్చీలోనుంచి లేచి వాకిట్లోకి చూసి 'నువ్వా, ష్ణారావ్! లోపలికిరా!' అన్నాడు.

కృష్ణారావు లోపలికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. రామచంద్రమూర్తి పక్కనే స్టూలుమీద కూర్చుని స్నేహితుడివంక చూశాడు. కృష్ణారావు మొహం దీనంగా వుంది. రామచంద్రమూర్తి "అదేమిటోయ్! అలా వున్నావు? ఏమిటి విశేషాలు?" అని అడిగాడు. కృష్ణారావు నిట్టూర్చి 'ఏం చెప్పనోయ్! నాకివి గడ్డురోజులు. పొద్దున్నే లేచి ఏమి దిక్కు తోచక నీ దగ్గరికి వచ్చాను. నువ్వు గట్టున పడెయ్యకపోతే లాభంలేదు!' అని వూరుకున్నాడు. రామచంద్రమూర్తి దినపత్రిక మడుస్తూ 'నువ్వేదో కొంప మునిగిపోయినట్టు మాట్లాడుతున్నావు. అదేమిటో చెప్పు. సాయం చెయ్యగలిగితే ప్రయత్నిస్తాను' అన్నాడు.

కృష్ణారావు హఠాత్తుగా అతని చేతులు పట్టుకుని "ఒక్క ఇరవై రూపాయలు అర్జంటుగా కావాలి. నా జీతం అంతా నాలుగో తారీఖుకే అయిపోయింది. ఇవ్వాళ మా మామగారికి జబ్బుగా వున్నట్టు టెలిగ్రాం వొచ్చింది. మా ఆవిడ పదకొండుగంటల బండికి వూరికి పోతానని కూర్చుంది. నువ్వు

"ఏదో ఉపాయం చూడకపోతే లాభంలేదు" అన్నాడు.

రామచంద్రమూర్తి అదిరిపడి "చంపేశావు. ఇవ్వాళ పదమూడో తారీఖు ఇరవై రూపాయలు కొదు గదా, ఇరవై నయాపైసలు కూడా మిగలకుండా పదో తారీకే జీతమంతా ఖర్చయిపోయింది. ఏమిటి సాధనం?" అన్నాడు;

కృష్ణారావు అతనిచేతులు వొదలకుండా "అట్లా అంటే లాభంలేదు. నేను మరెక్కడికీ పోను. మరెవ్వర్నీ అడగను. నువ్వే సర్దాలి" అన్నాడు.

రామచంద్రమూర్తి రెండు నిముషాలు ఆలోచించి 'అయితే కూర్చుని వుండు ఇల్లుగలవారి అబ్బాయిని అడిగి వొస్తాను. ఉంటే యిస్తాడు' అని దినపత్రిక అక్కడ పడేసి అవతలి భాగంలోకి వెళ్లాడు. ఇల్లుగలవారి అబ్బాయిపేరు జనార్దనరావు; అతనికి యిరవై ఏళ్ళు వుంటాయి. బి. ఎ. ఆఖరు సంవత్సరం చదువుతున్నాడు. అతను అప్పుడే స్నానంచేసి వొస్తూ, రామచంద్రమూర్తినిచూసి "ఏమండీ! ఇలాదయచేశారు?" అని అడిగాడు.

రామచంద్రమూర్తి సందేహిస్తూ "ఇంటిదగ్గిరనుంచి ఉత్తరం వొచ్చింది జనార్దనం! మా నాన్నకు జ్వరంగావుందట. మందులకూ మాకులకూ డబ్బులేదట. ఇరవై రూపాయలు పంపించమని వ్రాశారు. నా దరిద్రమేమో పదో తేదితోనే జీతం రాళ్ళు నిండుకున్నాయి. కొంచెం సర్దుతావేమోనని...' అన్నాడు.

జనార్దనరావు నవ్వి "దానికేం? అలాగే లెండి. నాకూ నిన్ననే పాతిక రూపాయలు పంపించారు మా నాన్నగారు, అందులో నే యిస్తాను. తీసుకోండి. ఇబ్బంది లేవరికి నా తిప్పవు. కానీ. ఒక్కమాట. మీరు మళ్ళీ పదిరోజుల్లో యిచ్చి తీరాలి. లేకపోతే నేను మాట పడవలసి వస్తుంది..." అన్నాడు.

రామచంద్రమూర్తి గుండెలు నిండుగా గాలిపీల్చి "అబ్బే! అంతదూరం ఎందుకూ? మా కృష్ణారావు నాకు పాతిక రూపాయలు యివ్వాలి. మరో అయిదారురోజుల్లో ఇస్తానన్నాడు అతనివ్వగానే మీ డబ్బు మీకిచ్చేస్తాను" అన్నాడు. జనార్దనరావు పర్సులోనుంచి రెండు పదిరూపాయల నోట్లుతీసి రామచంద్రమూర్తిచేతికియిచ్చాడు. రామచంద్రమూర్తి 'థ్యాంక్స్' అంటూ బైటికి వెళ్ళి ఒక్క అంగలో తన గదిలోకి పరిగెత్తాడు.

కృష్ణారావు దినపత్రిక చూసి లేచి, సంచుని ఆతుర్దాతో "ఏమయింది?" అని అడిగాడు. రామచంద్రమూర్తి ఆ రెండు పదిరూపాయలనోట్లనూ కృష్ణారావు చేతుల్లో పెట్టి "తీసుకోగానే కాదోయ్! అన్నమాట ప్రకారం పదిరోజుల్లో తీర్చాలి. ఆవిషయం మర్చిపోకు, నువ్వివ్వకపోతే మళ్ళీనేను మాటపడాలి...!" అన్నాడు.

కృష్ణారావు సంతోషంతో "అబ్బే నిన్ను మాటపడనివ్వనుగా! పదోరోజు నాటికి ఆ యువ డబ్బు ఆయనకు పువ్వుల్లో పెట్టియిద్దువుగానిలే...వస్తా" అంటూ వెళ్లిపోయాడు. రామచంద్రమూర్తి మళ్ళీ పత్రిక తీసుకుని చూడటం ప్రారంభించాడు.

ఆ తర్వాత వారం రోజులు గడచిపోయాయి. కృష్ణారావు. రామచంద్రమూర్తికి రోజూ ఆఫీసులో కనిపిస్తూనే వున్నాడు. అతను మామూలుగా ఉత్సాహంగా తిరుగుతున్నాడు. అతనికి డబ్బువిషయం జ్ఞాపకం వున్నట్టు లేదు. రామచంద్రమూర్తి ఒకనాడు మధ్యాహ్నం కృష్ణారావుతో "నువ్వు డబ్బు తీసుకుపోయి వారంరోజులయింది. జనార్దనం, డబ్బు మళ్ళీపదిరోజుల్లో యివ్వకపోతే ఇబ్బందిపడవలసివస్తుందని చెప్పి యిచ్చాడు. నీకేమో యీ విషయం గుర్తున్నట్టు లేదు." అన్నాడు. కృష్ణారావు నవ్వి "వారంరోజులే కదా అయింది? ఇంకా మూడురోజులు వ్యవధి వుందిగా ఆలోచిద్దాంలే." అన్నాడు.

తర్వాత మరో రెండురోజులుకూడా గడచినయ్. రామచంద్రమూర్తి ఆఫీసులో కృష్ణారావును కలుసుకుని "జనార్దనం ఇవ్వేళ పొద్దున నన్ను అడిగాడు. అతనెవరికో ఇవ్వాలిట అవతలివారతన్ని అడుగుతున్నారట! 'రేపు తప్పకుండా ఇస్తాన'ని చెప్పివొచ్చాను. నువ్వేంచేస్తావో! రేపు ఇవ్వకపోతే నాగౌరవం దక్కదు." అని చెప్పాడు. కృష్ణారావు తొందరగాపోతూ "రామశాస్త్రి నాకు ఇరవై రూపాయలు ఇవ్వాలి సాయంకాలం ఇస్తానన్నాడు. ఆయన ఇవ్వగానే మీ

> ఒకప్పుడు అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ ను చూడవచ్చిన విదేశరాజు ఒకాయన లింకన్ బూట్లు పాలిష్ చేసుకోవడం చూసి ఆశ్చర్యపడి—
>
> 'ఏమిటి మీ బూట్లు మీరే పాలిష్ చేసుకుంటారా' అన్నాడు ఆశ్చర్యంగా. వెంటనే లింకన్ మరింత ఆశ్చర్యంగా ఇలా అడిగాడు.
>
> 'అవునండి. అయితే మీరు పరాయివాళ్ళవి తప్ప మీవి చేసుకోరా ఎప్పుడూ.'

యింటికి తెచ్చియిస్తాలే" అన్నాడు. చంద్రమూర్తి మరి మాట్లాడలేదు.

ఆనాటురాత్రి ఎనిమిదిగంటలకు చంద్రమూర్తిగదిలో కూర్చుని ఏదో పు చదువుకుంటూ వుండగా కృష్ణారావువొ డు. అతనిమొహం కళావిహీనంగావు రామచంద్రమూర్తి ఆదుర్దాగా "కూర్చో ఏమయింది? రామశాస్త్రి, నీకివ్వవలసినడ ఇచ్చాడా?"అని ప్రశ్నించాడు.

కృష్ణారావు తల అడ్డంగా వూపు "లేదు బ్రదర్! లోకం పాపిష్టిది. ఎవ నమ్మేందుకూ వీల్లేకుండా పోతోం 'పాపం! ఇబ్బందిలో వున్నాడే' అని జా తలచి నానాగడీలిచి, అడ్డమైన అబద్ధా ఆడి నేను రామశాస్త్రికి డబ్బుయిస్తే మ దక్కించుకోలేక పోయాను. ఇందుకే లు 'ఎవర్నీ పూర్తిగానమ్మవద్ద'న్నారు.. అన్నాడు.

రామచంద్రమూర్తికి గుండె ఆగినంత యింది. అతను పుస్తకం మడిచి క్రింద "పోన్లే! ఇంతకీ మీ ఆవిడ వూరికి సుర తంగా వెళ్ళిందా? మీమామగారికి జబ్బన మెంటా?" అని అడిగాడు, కృష్ణార "అబ్బే! నాభార్య ఊరికెప్పుడు పోయిం ఇంట్లో నేవుంది. మా మామ గారికి జబ్బనట కోటమేమిటి? ఆయన చచ్చిపోయి అ దేళ్ళవుతోంది" అన్నాడు.

రామచంద్రమూర్తి ఆశ్చర్యంతో నో తెరచి, ఒక్కక్షణం ఆగి "అదేమిటోయ్ నువ్వు ఆనాడు చెప్పావుగా?" అన్నా కృష్ణారావు నవ్వి "చెప్పానుగా" ఆ రా శాస్త్రి 'ఇబ్బందిలో వున్నాను, గట్టునప య్యమ'ని అడిగితే కాదనలేక నీదగ్గరకొచ్చి అడిగాను. అదంతా అబద్ధమే. ఇంత అబద్ధమూ ఆడి సహాయంచేసి ఆదుకున్న నుకు ఇలా చేశాడు. పెద్దమనిషి."అన్నాడ

రామచంద్రమూర్తి గాలిపీల్చుకు పెందు పంచలోకి వొచ్చి నిలబడి, "అయితే రే రామశాస్త్రిని నేనడుగుతాను. ఏ వ టాడో" అన్నాడు. కృష్ణారావు వె పోతూ "సరే. అడుగు" అని జవా చెప్పాడు.

మర్నాడు రామచంద్రమూర్తి ఆఫీసుల రామశాస్త్రిని కలుసుకుని 'మీరు కృ రావుకు ఇరవై రూపాయలు బాకీ వున్నా రట. అతను నాకు అంత మొత్తమూ యివ్వాలి. మీరు 'ఇబ్బందిలో వున్నా' అడిగితే వెంటనే నా దగ్గర బదులు తీసుక మీకిచ్చాను. నాకు చాలా ఇబ్బంది వుంది. మీరు ఈ సాయంకాలం లోప స్తకపోతే నేను మరొకళ్ళచేత మాటప డవలసివస్తుంది' అన్నాడు.

రామశాస్త్రికి ఇరవై ఎనిమిదేళ వుంటాయి. ఆయునకలం క్రిందపెట్టి రా

నమ్మకమైన నంజనగూడు కుటుంబ ఔషధములను వాడుడు

నంజనగూడు పండ్లపొడి

తీపి, ఉప్పు ప్యాకెట్లు.

సకల పండ్లవ్యాధులను ఆపి, మాన్పు
బి.డి.యల్. 61. నంజనగూడు పండ్లపొడి (డబ్బా)

**శ్రీకర కస్తూరి మాత్రలు** — పిల్లలకు, పెద్దలకు శ్రేష్ఠమైన సంజీవి.

**కర్జన్** — (గోరోజన మాత్రలు) పసిపాపలకు.

**బాలక్స్** — విరేచన మాత్రలు పెద్దలకు పిల్లలకు.

**జ్వరెగ్** — సకల జ్వరములకు.

**కాలరెక్స్** — అతిసారము, కలరాకు.

**జిన్‌జిప్** — జీర్ణవృద్ధికి, పిత్తశాంతికి.

స్వాభావిక, పరిశుద్ధ యూనికార్న్ తేనె

సోల్ ఏజంట్లు: యునైటెడ్ కన్సర్న్, 54 బంధరు వీధి, మద్రాసు-1.

శాఖలు : విజయవాడ, హైదరాబాదు, (స్టాకిస్టులు కావలెను)



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన వర్యనుగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, విధినిక్షేపములు, లాటరీ, ఆకస్మాద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్నయెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన ఫోర్కాస్టు మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

అందమునకు
ఆరోగ్యమునకు
వసంత్ సబ్బులు




వసంత్ సోప్ వర్క్సు లిమిటెడ్.
వసంత్ నగర్ * మధరాసు.

# ★ చక్రనేమి ★

చంద్రమూర్తి చేతులు పట్టుకుని, "ఏం చెప్పమంటారు? నా అవస్థ. మీ పినతండ్రికొడుకు హైస్కూల్లో టీచరు. వాడిపెళ్ళాం కొత్తగా కాపురానికి వచ్చింది. వాడు ఖర్చుల్లోవుండి 'ఒక్క యాభై రూపాయలుంటే సర్దమ'నిఅడిగాడు. ఎల్లా కాదనను? ముప్ఫై రూపాయలు నా దగ్గరవుంటే యిచ్చాను. ఇంకా ఇరవై రూపాయలు కావల్సివచ్చింది. కృష్ణారావును అడిగాను. ముందు లేదన్నాడు. నేను 'మా నాన్న మరణశయ్యమీద వున్నాడనీ, నా దగ్గర అక్కడికి పోవటానికి చార్జీకి కూడా డబ్బులేదనీ, మా నాన్నను ఇప్పుడు చూడలేకపోతే మరి జన్మలో చూడలేనేమోన'నీ చెప్పి వొప్పించాను. నా అవస్థ విని అతను మెత్తబడ్డాడు. ఆ మర్నాడే మీ దగ్గరికి వొచ్చి బకులు తీసుకుని నాకిచ్చాడు. నేను మా వాడికిచ్చాను. కానీ, వాడింతవరకూ ఆ డబ్బు నాకివ్వలేదు. ఏంచావమంటారు? నా పరిస్థితి ఎన్నడూ ఇంత దరిద్రంగా లేదు" అన్నాడు.

రామచంద్రమూర్తి అతికష్టంమీద తేరుకుని "మీ పినతండ్రికొడుకు ఎక్కడ పని చేస్తున్నాడు? ఆయన పేరేమిటి?" అని అడిగాడు. రామశాస్త్రి "అతను మునిసిపల్ హైస్కూల్లో హింది టీచరు. అతనిపేరు సుదర్శనరావు" అని సమాధానం చెప్పాడు. రామచంద్రమూర్తి ఏదో గుర్తుకు తెచ్చుకున్నట్టు "అతనా? సుదర్శనం? ఎర్రగా పన్నగా వుంటాడు. అతనితో నాకు మంచి పరిచయం వుంది. అతన్ని నేనడుగుతాలెండి. ఇవ్వకపోడు." అని మళ్ళీ ఆగి "నిజంగానే అతను మీకు డబ్బు ఇవ్వాల్సి వున్నాడా?" అని అడిగాడు.

రామశాస్త్రి ఒక్కక్షణం ఆశ్చర్యపడి, తర్వాత పెద్దగా నవ్వుతూ "అబ్బే! యింక మీకు భయంలేదు. అబద్ధాలన్నీ దాటి నిజం దగ్గరికి వచ్చారు. అతన్ని యీ సాయంకాలమే కలుసుకుని అడగండి" అన్నాడు.

ఆనాడు సాయంకాలం నాలుగున్నర గంటలు దాటిన తర్వాత రామచంద్రమూర్తి ఆఫీసునుంచి నేరుగా మునిసిపల్ హైస్కూల్ దోవపట్టాడు. అతను హైస్కూలుకు వెళ్ళిన అయిదు నిముషాల్లోనే 'ఇంటిబెల్లు' కొట్టారు. పిల్లలంతా గోలచేసుకుంటూ యిళ్ళకు పోతున్నారు.

వారిలో రామచంద్రమూర్తికి ఇల్లుగలవారి అబ్బాయి కనుపించాడు. అతను అయిదోక్లాసు చదువుతున్నాడు. రామచంద్రమూర్తి అతన్ని పిలిచి "అవధానీ! మీ హిందీ మేష్టారు సుదర్శనం ఎక్కడ వుంటాడు?" అని అడిగాడు అవధాని

దూరంగా పోతున్న సుదర్శనాన్ని చూపించి "అదుగో! అతనే" అంటూ పరిగెత్తి పోయాడు.

రామచంద్రమూర్తి పెద్ద పెద్ద అంగలతో సుదర్శనాన్ని సమీపించి "హల్లో! సుదర్శనం!" అని పలకరించాడు. సుదర్శనం ఎర్రగా పొడుగ్గా వున్నాడు. గ్లాస్కో ధోవతి కట్టుకుని సిల్కులాల్చీ వేసుకుని వున్నాడు. అతను రామచంద్రమూర్తి వంక కాస్సేపు చూసి గుర్తుపట్టి, 'మూర్తీ! నువ్వా? చాలారోజులకు కనిపించావే! ఇక్కడే వుంటున్నావా? ఏమిటి ఉద్యోగం? జీతమెంత? పెళ్ళయిందా? పిల్లలా? మీ నాన్నగారు ఇంకా కవిత్వం వ్రాస్తూనే వున్నారా?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

రామచంద్రమూర్తి అన్నిటికీ సమాధానాలు చెప్పి నెమ్మదిగా "సుదర్శనం! రామశాస్త్రి మీ పెత్తండ్రి కొడుకుట కదూ? ఆయన నాకు యిరవై రూపాయలివ్వాలి. ఆయన నీకోసమనే నాదగ్గర బదులు తీసుకున్నాడు. నేను మరొకరిదగ్గర అడిగి తీసుకుని ఆయనకు ఇచ్చాను. ఇప్పుడు నన్ను వాళ్లు అడుగుతున్నారు. ఇవ్వాళ ఇవ్వకపోతే నామాట దక్కేట్టు లేదు. ఏంచేద్దామంటావ్?" అని అడిగాడు.

సుదర్శనం నవ్వి "అవును. అతను నాకోసమే అప్పు తెచ్చి యిచ్చాడు. నాకేమో ఇవ్వాళ్టి నుంచీ యివ్వటానికి వసతి లేదు. కొత్తకాపురం కదా? అందువల్ల ఇబ్బందుల్లో వున్నాను. సూది దగ్గర్నుంచీ గంగాళందాకా కొనుక్కోవలసి వచ్చింది. మొన్న మొన్నటి తారీకున నేనొక స్నేహితుడికి యిరవై రూపాయలు అప్పుగా యిచ్చాను నాలుగైదు రోజుల క్రితం అతను కనిపించి, 'తనకు డబ్బువచ్చింద'నీ, దాని, తన 'స్నేహితుడొకడు ఆపదలో వుంటే ఆదుకునేందుకు యిచ్చాన'నీ, 'ఇవ్వాళ తప్పక చేతికందుతుంద'నీ, 'ఇస్తా'ననీ చెప్పాడు. నీకు వేరేపని ఏమీ లేకపోతే మనిద్దరం పోదాం. రా" అన్నాడు.

వారిద్దరూ కలిసి నడవటం ప్రారంభించారు. కొంతదూరం పోగానే వారికి రామశాస్త్రి కనిపించాడు. అతనుకూడా వీరి వెంట బయలుదేరాడు.

సుదర్శనం నడిచి నడిచి, రామచంద్రమూర్తి అద్దెకు వుంటున్న యింటిముందే ఆగాడు. రామచంద్రమూర్తి ఆశ్చర్యపోతూ 'ఇదేమిటి?' అన్నాడు. సుదర్శనం వినిపించుకోకుండా "మీరిద్దరూ ఇక్కడే వుండండి. నేను లోపలికిపోయి అడిగి వస్తాను." అంటూ ప్రహారీ గుమ్మందాటి లోపలికి పోయాడు.

ఇంట్లో పంచలో కృష్ణారావు జనార్దనంతో మాట్లాడుతూ నిలుచుని వున్నాడు.

సుదర్శనం కనుపించగానే, జనార్దనం గతుక్కుమని మళ్లీ సర్దుకుని "రండి. కూర్చోండి." అని మర్యాదచేసి, ముఖం తుడుచుకుంటూ "మీరు నన్ను క్షమించాలి. నా చేతికి డబ్బువచ్చిన వెంటనే మీ ఇరవై రూపాయలూ మీకిద్దామనుకున్నాను. కానీ, మాయింట్లో అద్దెకున్న ఆయనకు ఏదో ఇబ్బంది వొచ్చిపడితే, 'పదిరోజుల్లో మీకివ్వవచ్చు కదా' అని ఆయనకు ఇచ్చాను. కానీ ఆయన మాట నిలబెట్టుకోలేకపోయారు. ఇంతవరకూ ఆయన ఇంటికే రాలేదు. ఆయన రాగానే అడిగి ఎట్లాగో తంటాలుచేసి రేపు పొద్దున్నే మీ యింటికి తెచ్చియిస్తాను" అన్నాడు.

ఇంతలో వాకిట్లో నిలుచున్న చంద్రమూర్తీ, రామశాస్త్రీ యింట్లోకి వచ్చారు. జనార్దనం రామచంద్రమూ[ర్తిని] చూసి "అదుగో అయనే! వచ్చే[డు] ఇంట్లోకి పోగానే అడుగుతాను" అన్నా[డు].

సుదర్శనం నోట మాటలేకుండా ప్రతిమవలె కూర్చుండిపోయాడు. ఆ[..] ఒక్క నిముషానికి గానీ ఆశ్చర్యంలోను[ంచి] తేరుకోలేదు. తేరుకుని నెమ్మదిగా "ఆ[..]కేనా మీరిచ్చింది? అయితే మీరడగనక్క[ర] లేదు" అన్నాడు.

ఒక్క నిముషం తర్వాత ఆ అయిదుగ[ురూ] అసలుసంగతి అర్థమై, తర్వాత ఒకగంట[..] కలిసికట్టుగా నవ్వుకున్నారు.


మనోహరమైన పరిమళమునకు!

Remy

రెమి సౌందర్య పరికరాలు

Aykan

రెమి హాస్యనాటికం—ప్రతి బుధవారం రేడియో సిలోన్—41 / 25 మీ. తరంగదైర్ఘ్యము మీద సా॥ 6-30 నుండి 6-45 గం॥ల వరకు వృద్ధి చేయుడు.

# జీవనరాగం

## వేటూరి సుందరరామమూర్తి

(గతవారం తరువాయి)

ని శరదృతువు. రాత్రి వేళ కాలేదు. సాయంకాలం ముదిరింది. రఘూ లేఖ గించేసరికి పశ్చిమదిశాంగి పర్యంకంమీద ూర్యుడు తలవాల్చాడు. వ్రాసిన లేఖను కొక్కమారు రఘూ తిరిగి చదువుకొన్నా . తనలాగా, తన మనోభావాలలాగా, తన నికిలాగా తన శైలికూడా మారిన విషయం కడు గుర్తించాడు. 'నీ అభిమానపాత్రుడు' వే చివరి మాట చదివే వేళకు చీకటి బాగా సిరి అక్షరాల నిజరూపం బాగా కనిపించ ను. ఇంతలో వే ఆకుల నీడలు పడీపడనట్టు లేఖపై పడటం రఘూ చూశాడు. గలగల ాగుతున్న రావి ఆకులలోనుంచి అలవా )తహాసంలా చందమామ కనిపించింది. ాయలోనుండి కొండపైకి షికారు వచ్చిన ిగాలులు రఘూ శరీరాన్ని తాకి మనస్సును మోమో పరామర్శించాయి. వినిపించని రేూ వో సమాధానాలు రఘూ మనస్సులో ప్పుకున్నాడు.

గత వర్ష ఋతు లక్షణముగాను, ఆగామి హే ంత ఋతు చిహ్నముగాను ఆరాత్రి ప్రసవు ంలో మంచు పొడిపొడిగా రాలుతున్నది. ంచు పరదాల చాటున కొండలు, కోనలు, ట్లు, చేనులు—ఇవన్నీ దోబూచులాడు న్నట్లుగా ఉన్నాయి. ఆ మంచు తెరలలో దరి చెదరి తారలు కొన్ని తుణనయస్క ుైన తరుణులవలే మెరుస్తున్నాయి. వెన్నె ని రెక్కలువచ్చి ఎగిరిపోతున్నట్లు సవ్వడి స్తూ తెల్లకొంగలు బారులు బారులుగా గురుతున్నాయి.

ఈ ప్రకృతి కాంత ఆనంద ఖేలనంలో ఘు పరవశుడైనాడు. గుండె వేగంగా స్పం ంచింది. హార్మోనియం పలికించమంటూ ాన్నెపు వెన్నెలలో పదాలు పరదాగా ాడుకోవాలనుకున్నాడు. వెంకన్నను పిల ాడు. బదులు లేదు. ఆవెన్నెలవానలో తడిసి ానుకట్టిన గుడిసెలాగా కుటీరం ఎర్రగా ట్టుపైన కనిపిస్తున్నది. ఆనందానుభూతికి ్యక్తీకరణలేక అతని హృదయం బరు క్కింది.

రఘూ నడచి లోపలకు వెళ్లాడు. హార్మోని పె గిన్నెలు కాలుతున్నాయి. వెంకన్న ేడు. కుటీరం వెనుక భాగానికి రఘూ వెళ్ళి క వింత దృశ్యం చూశాడు. అంతే ఒక

సహజ దృశ్యాన్నే అనుకోనకుండా చూశా డన్నమాట.

అక్కడ ఒక చెట్టు తిన్నెపై కూర్చున్న వెంకన్న తన వృద్ధాప్యపు కంఠస్వరంతో వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. అతను రఘూను చూడలేదు. ఏమిటి వింతకి రఘూ కొంచెం ఆలోచించాడు. వెంకన్న దగ్గరకు మెల్లగా నడచి వెళ్ళి వెనుకనుంచి అతని బుజంపై చేయి వేశాడు. వెంకన్న కొంచెం ఆశ్చర్యపోయి చకితుడై రఘూవంక చూశాడు. అతని కళ్లు వాచి ఎఱ్ఱబడి వెన్నెల్లో వెక్కిరిస్తున్నాయి. కాలువకట్టిన కన్నీటిని తుడుచుకుంటూ—పేలవంగా నవ్వి ససంభ్రమంగా 'షికారు అయిందా బాబూ' అన్నాడు వెంకన్న. అంతలో అలా స్వస్థుడై వెంకన్న ప్రశ్న వేసి సమాధానం అపేక్షించకుండా గుడిసెలోనికి వెళ్ళిపోవడం రఘూకు మరింత ఆశ్చర్యం కలిగించింది.

యాభై ఏళ్ళు పైబడ్డ వెంకన్న ఒక తరహా మనిషి. అతను వయస్సుకుమించిన వృద్ధుడులా కనిపిస్తాడు. అతని ముఖం అనేక నిగూఢ అనుభూతులు పొందినట్లు ఉంటుంది. అతని గొంతులో చిన్న కదలిక ఉంది. అది శిల పరిపక్వతను స్ఫుటంగా తెలియజేస్తుంది.

అతనికి ఏదైనా మెత్తని విషయంవిన్నా, జాలికొల్పే ఏ సంఘటన చూసినా వెంటనే కన్నీరు అప్రయత్నంగా కన్నులలో నిండుకునేది. తానైకొన్ని ఆర్ద్రమైన విషయాలు మాట్లాడబోయినపుడు గొంతు పెల్లగిలి వచ్చేది కాదు. తాను చెప్పదలచుకొన్నదానికి బదులు కంటనీరు ఉబికివచ్చేది. అతణ్ణి ఆర్ద్ర హృదయుడుగా రఘూ మొట్టమొదట గుర్తించాడు.

అయితే—ఇవన్నీ చూస్తే వెంకన్న జీవితంలో ఏదో అవ్యక్తమైన నిగూఢమైన గాథ ఒకటి ఉండి ఉండాలనిపించింది. ఏదో పెద్ద దెబ్బతగిలిఉండాలి. లేదా—మహా జాలి కరమయిన ఘట్టం అతని గతజీవితంలో ఉండాలని ఎవరైనా అనుకుంటారు. అతను జీవితంలో ఏకాకి. ఒకరోజు ఉదయమే రఘూ వెంకన్నను అడిగాడు. 'మీ ఆవిడ పోయిందికదా—నీకు పిల్లలు లేరా' అని. ఎందుకు అడిగానా అన్నంత పశ్చాత్తాపంకూడా పొందాడు. ఆ ప్రశ్న అడిగినప్పుడు వెంకన్న శోకావేశానికి లోనుఅయ్యే పరిస్థితిని అతికష్టంమీద

అపుకున్నాడు. సమాధానం చెప్పనేలేదు.

ఈ కొద్ది అనుభవంలోను వెంకన్న ప్రవర్తనలో అట్టడుగున నిగూఢంగా, అవ్యక్తంగా మెదలుతున్న ఈ కథను బయటికి లాగాలని కూడా రఘూకు అనిపించింది.

కుటీరంలోకి వెళ్ళిన వెంకన్నతోబాటు రఘూకూడా వెళ్లాడు. హార్మోనియం బయట చెట్టుక్రింద పెట్టుకుని వెంకన్నను పిలచాడు. వెంకన్న సంగతి తెలుసుకోవాలన్న రఘూ ప్రయత్నం వ్యర్థమయింది. వినయంగా నే- పనితొందర పేరుతో వెంకన్న విషయం చెప్పలేదు. అయితే ఎప్పుడో చెబుతానన్నాడు వెంకన్న. ఆ సమయం ఎప్పుడుకి ఎటువంటిదో?

వికలమైన మనస్సు సంగీతం కోరగా, సంగీతం పాడుకున్న హాయినిద్ర కోరింది. ఆ చల్లని వెన్నెల రేయిలో తన కుటీరంలో విచ్చగా నిద్రించాడు రఘూ.

* * *

లోకంలో ఉదయకాలమంత మనోహరమయింది లేదు. ఉషస్సులో సకల జీవులు తమ పుటకను జ్ఞాపకం తెచ్చుకుని పులకిస్తాయి. ప్రతిరోజూ జీవితంలో ఒక పుటక లాటిదే. సుదిశాల ప్రపంచమంతా చీకటి తెరలో దోబూచులాడి—గుట్టుచప్పుడు కాకుండా నిశ్శబ్దంలో నక్కి తెల్లవారుతుండగా తిరిగి కలకలా నవ్వుతూ హృదయ వైశాల్యంతో దర్శనమిస్తుంది.

పక్షులు వృక్షపటలిపై చెలరేగుతూ కిలకిలారావంతో కోలాహలం చేస్తున్నాయి. సూర్యోదయం ఇంకా కాలేదు. దిక్కానలో పోస్తున్న పాలలాగా క్రమంగా చీకటిలోకి తెల్లని ఉదయకాంతులు జారబడుతున్నాయి. సూర్యుడు కనిపించకుండానే అలుముకుంటున్న కాంతి, చర్మచక్షువులకు కానరాకుండానే భగవంతుడు జీవులపై వెదజల్లే కరుణాప్రసారంలా ఉన్నది.

వెంకన్న తెల్లవారుఝామునే లేచి పాలకు వెళ్లివచ్చి కాఫీ పెడుతున్నాడు. కాలకృత్యాలు అంతకుముందే తీర్చుకుని నుదుట శ్రీ వైష్ణవనామం దిద్దుకుని, రామదాసుకీర్తన చల్లనిరాగంలో పాడుకుంటున్నాడు. పరిపక్వమయిన గాత్రంతో ఆకీర్తన ఏదో జీవిత వేదాంతాన్ని బోధిస్తున్నది.

రఘు మేల్కొన్నాడు. కళ్లు తెరచి చూస్తే- కుటీరం- క్రిందరాలిన తోటియాకు

మొక్కలు - తాటినిట్టాళ్ళు - కిటికీలోంచి బయట కనిపిస్తున్న సువిశాల వన్యప్రాంతం లోయలు కొండలు, హృదయానందనమైన వెంకన్న గీతం -

జిల్లుమని వీస్తున్న చలిగాలికి వణుకుతూ వంగి వంగి నడుస్తూ వెంకన్న ఇల్లు చక్కదిద్దుతున్నాడు తత్వం పాడుకుంటూ. కుంపటిపై గిన్నెలో నీళ్ళు తెర్లి ఆవిరికి ఎగిరి ఎగిరి పడుతున్న మూత రఘూను లెమ్మని తొందరిస్తున్నది. కళ్ళు తెరిపినబడి కాలకృత్యాలు తీర్చుకొని,

కాఫీ సేవించాడు రఘూ.

తెల్లగా తెల్లవారింది. మంచు తెరలు చించుకుని తరలి వస్తున్నది. బంగారునీరులా లేయెండకాంతి- వెంకన్న గీతం సన్నగా శ్రావ్యంగా ఆలపిస్తూనే కసవు చిమ్ముతున్నాడు. బయట కొండ రాయి తిన్నె మీద కూర్చున్న రఘు 'వెంకన్నా-నీవు పాడే కీర్తన యే రాగం' అని ప్రశ్నించాడు మెల్లగా. ఆ పాటలో లీనమైన రఘూ అదేరాగంలోకి చేరకపోతడంతో ఆశ్చర్యపోతున్నాడు. ఏవో కొన్ని రాగాలఛాయలు ఉన్నా - ఒకటీ రెండూ కాదు. అనేక ఛాయలు అస్పష్టంగా ఉన్నాయి. ఆ గీతంలో కేవలం శారీర స్వారస్యంగాని, రాగమధురిమగానీ రఘూను ఆకర్షించలేదు. శ్రుతీ, ప్రక్కవాద్యాలు వాటిప్రసక్తే లేదు. మరి ఏమిటి అందులో మహిమ? మొత్తంమీద ఆ పాట అతన్ని కరగిస్తున్నది. అలా తను బహుశః అనలేడు. అనడానికి రాగం అంతకన్నా బాగా అనగలడు. కాని ఆ ఆర్తి, హృదయం అందులో తను ప్రతిష్ఠించలేననుకున్నాడు రఘు. ఉషఃకాలంలో, ఆ ప్రకృతిసీమలో, ఆ రీతిలో, నిర్మలంగా, హృదయపూర్వకంగా చేస్తున్న ఆ గానం రఘూను మైమరపించడంతోపాటు ఏదో అంతర్వర్తినిగా స్ఫూర్తిని కలిగించింది. వెంకన్న చెప్పాడు: 'మా పాటల్లో రాగాలు ఉండవుబాబూ. ఉంటే మాకు చేతకానూకావు. అందులో ఉండేదల్లా భక్తిరసం.' రఘూ హృదయంలో తళుక్కుమంది-ఒక కొత్తవిషయం. సంగీతం రక్తికట్టడానికి కావలసిన అమూల్యరసం - 'భక్తి' అనుకున్నాడు. అయితే ఆ రసం సిద్ధించడానికిసైతం సాధన అవసరం అని అతనికి తెలుసు.

వెంకన్న పెట్టిన వేడినీళ్ళు పోసుకుని, విజయపురివైపు వెళ్ళాడు రఘూ ఆ ఉదయ కాలంలో - వెంకన్నకూడా తోడుగా నడిచాడు. దాదాపు ఒక మైలుపట్నం చమక్ బూట్లతో నడవడం కష్టమైంది రఘూకు. ఆ కొండరాళ్ళ గంప్రదతనానికి ఆకుల్లాంటివైనా చెప్పులు తాళలేకపోయాయి. ఎత్తుపల్లాల్లో నిటారుగా దిగుతున్న కయ్యాల్లో, ప్రయాస పడుతూ నడుస్తున్నాడు రఘూ వెంకన్నను అనుసరిస్తూ. తుమ్మచెట్లక్రిందరాలిన పసుపుపచ్చపూవుల దొంతరలోపడి సూర్యకాంతి మరింత పచ్చనై ప్రకాశిస్తోంది. అరుణవర్ణంలోంచి క్రమంగా ప్రౌఢమౌతున్న బాలసూర్యుడు రఘూ వెంకన్నలతో పాటు అల్లంతదూరాన ఉండి జతగా వస్తున్నాడు. గుట్టలచాటునుంచి, చెట్ల గుబురుల నుంచి మధ్య మధ్య తొంగిచూస్తున్న సూర్యుణ్ణి, ముందుదారిని, చూస్తూ నడుస్తున్నాడురఘూ- వెంకన్న తల వొంచుకుని నడుస్తున్నాడు. దూరదూరంగా మనుష్యులు కనుపిస్తున్నారు. మానవుల ఉనికికి పెట్టని విశేషణాలుగా ఉండే కాకులు, కుక్కలు, కూడా ఆ చుట్టుపట్ల కనిపించాయి. ఏటవాలు గుటకు చెయ్యి చూపుతూ వెంకన్న 'అదే విజయపురి' అన్నాడు. రఘూ ఒక్కసారి తాము నడచి వచ్చిన వెనుకదారి చూసుకుని 'ఇప్పటికి కొత్త మనుష్యలోకంలోకి వచ్చామన్నమాట' అన్నాడు అప్రయత్నంగా.

విజయపురి ఊరిబయట నుంచి రఘూను కొంచెం వింతగా చూడడం మొదలుపెట్టారు జనం. నిన్న సాయంకాలం వ్రాసిన ఉత్తరం అక్కడ తపాలాపెట్టెలో జారవిడిచాడు రఘూ పప్పులూ ఉప్పులూ కొని పాలవాడితో పాలు బాగా పిందల కడ తెస్తూ ఉండమని చెప్పి, కూరా నారా కొని వెంకన్న సాగాడు. రఘూ అనుసరించాడు. అప్పుడు ఎనిమిది గంటలవుతుంది.

విజయపురి వీధిగుండా నడుస్తున్న రఘూకు కొంత బెరుకుతోచింది. అందరిలోకి తన వేషం పట్టిచ్చినట్లుగా ఉండటంతో చాలామంది నిటారుగా నిలబడి తనవైపే చూస్తున్నారు. అక్కడి వారి వేషభాషలు రఘూకూడా చోద్యంగానే చూడసాగాడు. వీధినిండా పేడనీళ్లు చల్లి ముగ్గులు ముచ్చటగా తీర్చి ఉన్నాయి. వేదూడెలు తోకలెత్తి అక్కడక్కడ గంతులేస్తున్నాయి. ఒక అరుగుమీద పండుముసలి- ఒక తాత కొలుసుడిచి ములక పేనుతున్నాడు వణుకుతున్న చేత్తో వడలిన మోకాళ్లమీద. జియ్యర్ దాసు మంచి గుమ్మడికాయ ఆకృతిలో మెరుస్తున్న రాగిపాత్ర నెత్తిన కుదురుగా పెట్టుకొని, కాలిగజ్జెల ఘలంఘులతో చిరతలు మోగిస్తూ భజనగీతం పాడుతున్నాడు. ఆ పాటవింటూ మెల్లగా సాగుతున్నాడు రఘూ. అతనికి ఆ జియ్యర్ వేషం నేటి సినిమా నారదుడి వేషంకన్నా ఎంతో బాగా, సహజంగా ఉంది. క్రిందికి దిగిఉన్న మూరులోనుంచి కుండిలో జొన్నలు తొక్కుతూ కూనలమ్మపదం పాడుతున్నారు కొందరు అతివలు. ఆయాసంతో కూడిన హుంకారంతో, గాజుల సవ్వడితోదంపుడు శబ్దంతో వారి జానపదగీతం ఎంతో రక్తి


LEUCODERMA

(శ్వేత కుష్ఠ)

వలన యెంతమాత్రం భయపడనక్క లేదు. మావద్ద గల ప్రఖ్యాత ఆయుర్వేద ఔషధములు సులభముగా, నమ్మకంగా తెల్ల, ఎఱ్ఱ మరేరకమైనపాడైనను, శరీరంలో యేభాగమునందున్నా పోగొట్టును. వేనకువేలు మా మందు విజయమునుగూర్చి ప్రశంసిస్తున్నారు. పైపూత, లోనికి మందు సీసా 1 టి రు. 7/- మాత్రమే.

Vaidyaraj Ramsharam Lalgup
(AP.)PO. Rajdhanwar(H.Bagh

వైబ్రో
గర్భాశయ రోగ నివారిణి

సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యమును వంశాభివృద్ధిని కలుగజేయును. అన్నిచోట్ల దొరకును. సీసా 2-8-0

కృష్ణా లేబరేటరీ బెజవాడ

పండిత్ డి. గోపాలాచార్యులవారి
అరుణా
స్త్రీల టానిక్
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్
మద్రాసు-17

 జీవనరాగం 

...న్నాడు. వెంకన్నా, మూ శా వా రఘు.

...టు ఎంత బాగుందో' అన్నాడు తన ... గ్రామం మెల్లిగా వెనకబడుతున్నది.

...ం తోటివాడితో పంచుకుంటూ గోడకు పిడకలు కొడుతున్నారు కొందరు


# పళ్లువచ్చునప్పటి బాధలా?

## పిరమిడ్ బ్రాండ్ గ్లిసరిన్ పళ్లువచ్చునప్పటి బాధను సులువానర్చును






పళ్లువచ్చునప్పటి బాధలా? పసి చిగుళ్ల వాపులా? మీ వ్రేలికి మెత్తని గుడ్డ చుట్టుకోండి. దానిని పిరమిడ్ గ్లిసరిన్‌లో ముంచి బిడ్డ పసిచిగుళ్ల మీద మెల్లగా రుద్దండి. త్వరితంగా శమన మగును — దాని తియ్యని ప్రీతియైన రుచిని పిల్లలు ఇష్టపడుదురు. ఇది శుద్ధమైనది, ఔషధరీత్యాను, సౌందర్యకారిగాను, కాంమార్వం నిమిత్తమున్న, ఇంట్లో అనేక ఇతర విధములుగాను ఉపయుక్తమైనది, ఒక సీసాను దగ్గరుంచుకోండి.

**ఉచిత**

కరపత్రము: ఈ కూపన్ పూరించి, హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ పోస్టు బాక్సు నం. 409, బొంబాయి. ఈ విలాసమునకు పోస్టు ద్వారా పంపండి.

పిరమిడ్ బ్రాండ్ గ్లిసరిన్ "ఇంట్లో" ఉపయోగించే విధములు తెలిపే ఉచిత కరపత్రమును దయచేసి నాకు పంపండి.

నా పేరు మరియు చిరునామా ______________

నా కెమిస్టు పేరు మరియు చిరునామా ______________ APWM

PYG-13-X30 TL డిస్ట్రిబ్యూటర్లు: జి.ఎ.జి. (ఇ) ప్రై.లి., బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు.


ముసలమ్మలు. కర్రమీద ఓరగా వాలి నిలబడి చుట్టలు కాలుస్తున్నాడు ఒక రైతు రఘూ నరేపనిగా చూస్తూ. ఒక పల్లెపడుచు 'తోటకూర, గోంగూర, బీరకాయలు' అని ఖంగుమనే గొంతుతో కేక వేస్తూ సుడిగాలిలా ఒక సందులోనుంచి మరో సందులోకి దూసుకుపోయింది. కూరలమ్ముతూ, విసురుగా చేతులు ఊపుతూ, నెత్తిన బుట్ట ఓయ్యారంగా పెట్టుకొని కాలిగజ్జెల సందడితో ఆమె తనముందుగా మిలమిలలాడే కళ్ళతో కొండవలికంటి బులాకీ ముక్కుకు తగిలించుకొని పక్కసందులోనికి పోయిన తీరు 'తోడి' రాగ ఆరోహణా క్రమంలోని విసురులాగా, వడిలాగా తోచింది.

మజ్జిగ, వెన్న, వాసనలు, పేడనీళ్లు చల్లిన ఘాటు పల్లెటూరి వాతావరణానికి ముఖ్య విశేషణాలు. ఆ వూరు విడవగానే అతనికి ఆ వాసనలు అట్టే కనిపించలేదు.

ఆ ఊళ్ళో నడుస్తున్నంతసేపూ అనుభవ వైవిధ్యం పొందిన రఘూకు ఒక్క క్షణంలో అంతరాయం కలిగింది. ఒక కోపలాకుక్క అతని పట్నపు వేషాన్ని చూసి కొంతదూరం వెంబడించి అరచింది. అది నలుగురూ చూడడానికికూడా కొంత హేతువైంది.

ఊరి బయటకురాగానే మళ్ళీ మలుపులతో ఎత్తుపల్లాలతో పచ్చని బీళ్ళమధ్య భూమాత పాపటలాగా ఉన్న కాలిబాట నిడుపుగా కనిపించింది. కాళ్లు అప్రయత్నంగా నడుస్తున్నాయ్. వెంకన్న భుజంమీద పొట్లకాయలు నిస్సహాయంగా నడక ఊపుకు ఊగుతున్నాయి నేలవైపు చూస్తూ.

తుమ్మచెట్లమీద ఊసరవెల్లులు_తీరికగా కూర్చుని మెడతో నెక్కిరిస్తున్నాయి. సూర్యుడు ఎరుపు, తెలుపురంగులే మార్చగలడని, తాము అన్నిరంగులూ చిత్రంగా మార్చగలమన్న ధీమా వాటి చురుకుకళ్ళల్లో కనిపిస్తున్నది.

క్షణం తీరికలేనట్లు భ్రమరం పూవు పూవుకు తిరిగి సంగీతం పాడుతూ మధువు నాస్వాదిస్తున్నది. బంభరంలో పేరుకున్న పేరాసకు కొంతసినీ ప్రపంచం జ్ఞాపకం వచ్చింది రఘూకు. ఊళ్లో పాటలూ పద్యాలు పాడుతూ ఇంటింటికీ తిరిగి తండులాలు సంపాదించుకుంటున్న జియ్యరీ కూడా జ్ఞాపకమొచ్చాడు. సృష్టి వైవిధ్యంలోని సారూప్యత రఘు గుర్తించాడు.

అలా తిరిగివస్తానని చెప్పి వెంకన్నను యింటికి పంపాడు రఘూ.

విశాల శాఖోప శాఖలతో వింజామరలు వీస్తున్న వృద్ధవృక్షాల ఛాయలు భూతలంమీద అనంతంగా పరచుకుని ఉన్నాయి. బారెడు తోకతో ఎర్రటి ఛాయలు, ఉదారంగా రెక్కలు, తెల్లటి పొడుగల పక్షులు అక్కడ శాఖలపై చికపిక మంటూ జిలిబిలి పలుకులు పలుకుతున్నాయి. దూ గా వ

తూర్పు వేపుగా తంబుర మీటుతున్నట్లు స్పష్టంగా ఒక ధ్వని వినిపిస్తోంది. రఘు శబ్దం వచ్చే వైపు మెల్లగా అడుగులు వేసుకుంటూ సాగాడు. ఎండకు మాడుతున్న పచ్చిగడ్డిలోంచి వెచ్చని ఆవిరులు కాళ్ళకు తాకుతున్నాయి. ఘాటుగా పసరు వాసన వేస్తోంది. ఉండుండి చల్లగాలి తెరలు ఆప్యాయంగా సోకుతున్నాయి. పడమర నుంచి తూర్పుకు అడుగులు వేస్తూ సూర్యుడి గమనానికి ప్రతికూలంగా వెడుతున్నాడు రఘూ. తాను అన్వేషిస్తున్న పిట్ట సవ్వడే ఉన్నట్లుండి మరో దిశగా వినిపించింది. దాని అన్వేషణలోనే అడుగులు వేస్తూ నడుస్తున్నాడు రఘూ. కొంత దగ్గరౌతున్నట్లు తిరిగి దూరం దూరంగాను అనిపిస్తున్న ఆపిట్టను కళ్ళార చూడాలి. దగ్గరలో ఉండి ఆ నాదం వినాలి అని రఘూ కుతూహలం. ఇంతకూ ఆపిట్ట కనిపించదేం. ఇది విహంగాలా? విహరించే వింత స్వరాలా రఘూ హృదయంలో ఆవేదన కలిగింది. ఒక్కసారి కనిపించరాదూ ఆపిట్ట. తనంతగా తన గానరసం వెదజల్లరాదూ. కేవలం పాట వినాలనేగా తన కోరిక! తను వెన్నాడుతున్నాననేనా అది మరీమరీ పరుగెత్తుకు దూరదూరాలకు పోతున్నది?

నిరాశా, నిస్పృహా రఘూ హృదయాన్ని ఆవరించాయి. కళ్లు ఒక్కసారి తిరిగి కాళ్లు ఒణికాయి. కాఫీ సంగతి జ్ఞాపకానికి వచ్చింది. పదిగంటలకల్లా మళ్ళీ ఒకసారి కాఫీ పడితేనే గాని అతనికి మనస్సు మనస్సులో ఉండదు. కళ్ళు తిరుగుతాయి. ఈ స్వరాన్వేషణలో పడి తాను అది మరచిపోయాడు.

వెనుదిరిగి అడుగులు వేయడం సాగించాడు. అశేషంగా చెట్లు అవరించి పందిరిలా ఉంది తాను నడచివచ్చిన దారంతా పల్లంగా ఉంది. తాను ఎత్తు ప్రదేశంలోకి వచ్చినట్లు తెలుస్తోంది. వృక్షకాండాలు నిట్టాళ్ళుగా గుబురుకున్న శాఖలు కప్పిన చలువపందిళ్ళుగా అతనికి తోచినాయి. తన కుటీరం ఎక్కడో తెలియలేదు. ఎటుపోవాలో తోచలేదు. అడుగులు తడబడి నడువలేకపోయాడు. కాళ్ళు లాక్కుపోతూ కళ్ళు తేలిపోతున్న రఘూ ఒక విశాలవృక్షం క్రిందకు చేరి కూర్చున్నాడు. ఆ చెట్టు మొదలు వానుకోబోయారు. బారులు తీరి చింతనిప్పుల్లా ఉన్న ఎర్రటిచీమలు మెరుస్తూ ఆ చెట్టుపై పాకుతున్నాయి. కొండచీమలంత ఉన్న ఆ చీమలు నడుస్తున్న నిప్పుకణాల్లాగా మెరమెరలాడుతున్నాయి. వాటిని చూడటానికి అతనికి యెంతో ముచ్చట వేసింది. పానపానలాడుతూ పగడాల్లాగా దొరలిపోతున్నాయి చీమలు. అవి కుడతాయని అతనికి తెలుసు. ఆబాధ తేలుకుట్టినట్లే ఉంటుంది. భగవంతుడు వేరే డేంజర్ లైటు అవసరం లేకుండా వాటి రఘురూపం ఎర్రటి ఎరుపులో చిత్రించిన పవిత్రం అతనికి ఆనందం కలిగించింది. వీణపై ఆభితాగ తానం వాయిస్తున్న వరుసన అలా వెళ్ళిపోతున్నాయి చీమలు.

ఎడంగా జరిగి ఒక కొండరాయి ఆనుకొని కూర్చున్నాడు రఘు. పైన ఆకాశంలో చాలా ఎత్తున్న ఎగురుతున్నది ఒంటరిగా ఒక గరుడపక్షి. ఉత్తరదిక్కుగా తెలిమబ్బులలముకొంటున్నాయి. తీక్ష్ణ సంతప్తుడై ఉగ్రనారాయణుడైన సూర్యునికి దిక్పాలకులు వీస్తున్న వింజామరల్లా దూరదూరాల తేలుతున్న తెలిమబ్బులు రఘూకు కనిపించాయి. సూర్య పురోగమనానికి కొలతలు వేస్తూ చేతి గడియారం పదకొండు దాటుతున్నది. గువ్వలు గూ గూ అంటూ ఎక్కడో మూలుగుతున్నాయి. పరిసరాలలో ఎవరో మూలుగుతున్నట్లు అతను భావించాడు. ఇలా అనేక శబ్దాలు చేరువలో మనుష్యుల ఉనికిని స్ఫురింపజేస్తున్నాయి. కాని ఎవరూ కనిపించరు. మాలకాకులు ఎర్రటి నోళ్ళు తెరచుకొని వ్యావృత్తితో వాలుతూ పోతున్నాయి. కొమ్మల మీద ఉడతలు తోకలెగరేస ఎలుగు పెడుతూ చిలిపిగా దూకుతూ పరుగెడుతున్నాయి. కందిరీగ రంధ్రాన్వేషణా ప్రవృత్తిలో రఘూ చెవులవద్ద రొదపెట్టి వెళ్లింది. నోరు పారేసుకొని సీతాకోక చిలుకలు చుట్టుపట్ల తంగేడు పూలను మూచూచి పారిపోతున్నాయి.

అల్లంత దూరాన దొనెలా తిరిగి భూతలం ఆకాశాన్ని చుంబిస్తోంది. చూస్తూ వుండగా రఘూకు అక్కడ మనుషులు వస్తున్నట్లు కనిపించింది. భూమిలోంచి పుట్టుకు వస్తున్నట్లుగా మనుషులు బారుగా మెల్లమెల్లగా బయటకొస్తున్నారు. వాళ్లు తన వైపే రావడం రఘూ గుర్తించాడు. ఆరితేరిన నడకతో ఈటెలూ, కర్రలు పట్టుకొని ఎర్రకుచ్చుల తలపాగాలతో వాళ్లు చేరువనేకొద్దీ రఘూకు ముచ్చెమటలు పోశాయి. ఒక దండులా వేగంగా వస్తున్నారు వాళ్లు.

రకరకాల తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు పూసల దండలు మెళ్ళో వేసుకొని తలకు మొలకు చుట్టుకొన్న జింక తోలు పటకాలతో కొరమీసాలతో మెలికలు తిరిగిన కండరాలతో వీరుల్లాగా వాళ్ళు నడుస్తున్నారు. రఘూకు నుంచోవాలో, లేచి వెళ్ళిపోవాలో తోచలేదు. వాళ్ళంతా తనను వింత జంతువును చూసినట్లు చూస్తారు తప్పదు. ఇంకేమైనా చేస్తారా? కొంపతీసి దొంగలముఠా కాదుకదా. జానపద చిత్రాలలోని దొంగల గుంపులు, కొండజాతులు అతనికి జ్ఞాపకం వచ్చాయి.

అందరిలోకి అగ్రగామిగా ముందు నడుస్తున్న మనిషి నడి వయస్సు దాటిన వాడు. కొంచెం కుదిమట్టంగా మిగతి వాళ్ళకన్న ఒక గుప్పెడు పొట్టి కురచగా ఉన్నా కలగలుపు నెగుపు గడ్డంతో మెలితి మీసాలతో ముఖం గంభీరంగా ఉంది. పాటి కనుబొమ్మలు, వాటి క్రింద తీక్ష ఉన్న ఎర్రటి కళ్లు. ఆ కళ్ళ చూపు కొంత నిదానము—హుందా తనము కని న్నాయి. అనుభవ పరిపక్వత ద్యో మౌతున్న ముఖంతో అతను దగ్గరకు వ నిలచాడు. వెనుక గుంపంతా మాట్లాడకుం హావభావాలేం ప్రదర్శించకుండా చూ న్నారు.

రఘు లేచి నిలబడ్డాడు. 'ఒర్నా ఆపాదమస్తకం ఒక్కసారి శోధించిన చూసి ప్రశ్నించాడు అగ్రగామి.

వెంటనే ఆ ప్రశ్నకు ఏం సమాధా యివ్వాలో, ఎట్లా యివ్వాలో తోచలే రఘూకు.

'నా పేరు రఘూ—ఈ కొండమి దారితప్పి వచ్చాను. మా ఇల్లు కనిపించలే జవాబిచ్చాడు రఘూ.

'ఎక్కడ మీది? ఎడకొచ్చినవ్? ఎ పోవాలి?' తిరిగి ప్రశ్నించాడు ము నాయకుడు.

ఆ ప్రశ్నల్లో తన గోడుకు కొంత చో దొరికిందని భావించాడు రఘు. కొరుకు ఇలా అన్నాడు. 'చూడండి. నేను పట్నం నించి వచ్చాను - ఈ కొండమీద అద్దెలకి కుటీరాల్లో ఒక దాంట్లో చేరాను. చోటికి రావడం ఇదే క్రొత్త. ప్రొద్దు 'తంబురా పిట్ట'ను వెతుక్కుంటూ వచ్చా దారి తప్పాను. ఇంటికి ఎట్లా పోవా తెలీలా" అన్నాడు రఘూ దీనంగా అకరతో.

'ఏది! గిట్టా తిన్నగున్న గుట్టకాడ పోతే

(45 వ పేజీ చూడుడు)

శ్రీమద్భగవద్గీత
వ్యాఖ్యాత:
కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
వెల రూ. 4-00

బుడుగు రూ. 1-2
టామ్‌సాయర్ ,, 2-0
కాంచనద్వీపం ,, 1-5

పోస్టేజి, ప్యాకింగ్ ఖర్చులు ప్రత్యేకము
ఆంధ్రగ్రంథమాల,
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

# లంబాడీల వి

బి. విశ్వ



గాజుపలకలు, బిళ్లలు అమర్చిన దుస్తులమీద లంబాడీలకు మోజు.

రత దేశములో జాతి మత సంప్రదాయ భేదాలు చాల హెచ్చు. ఏ జాతిలోని, ఆ జాతి ప్రత్యేక సంప్రదాయాన్ని ఁరించి, జీవిస్తూ ఉంటారు. అలాగే ఆంధ్రప్రదేశ్ లో అనేక జాతులవారు ్నారు. వారిలో ఒక్కొక్క జాతివారు ్క్క రకమైన జీవిత విధానంతో, విచిత్ర వేషభాషలతో, చూచేవారిని ్యపరుస్తారు.

రుచు మన పట్టణాల, గ్రామాల వీథు సంచరిస్తూ ఉండే 'లంబాడి' అనే కిచెందిన స్త్రీ పురుషుల్ని చూస్తూ ాము. కాని వారి జీవితవిధానం ంచి చాలమందికి తెలిసిఉండక పోవచ్చు. ంబాడీజాతివారు సాధారణంగా దేశ ్మరులు. వారి జీవిత పద్ధతులు చాల విచి గాను, ఆశ్చర్యంగాను ఉంటాయి. వీరు మెలిసి గుంపులు గుంపులుగా నివసిస్తుం . ప్రతి ఒక గుంపునకు ఒక గురు ాడు. ఆ గురువును 'నాయక్' అనే కనామంతో పిలుస్తారు. గురువు ఆజ్ఞను ్రించక, అతనివాక్కును వేదవాక్కుగా అతన్ని రెండవ భగవంతునిగా ంచి, ఎల్లప్పుడు అతని పాదసేవ చేసు

శంలోనే ఉండి, జీవనం గడపాలనే ఉద్దేశ్యం ఏమాత్రం లేదు. ఒక ప్రదేశంనుండి మరొక ప్రాంతానికి పాలు, పెరుగు, నెయ్యి మొదలగువాటిని వెంట తీసికొని పోయి విక్రయిస్తూ, వాటివల్ల వచ్చిన ఆదాయంతో జీవనం గడపడం వారి కలవాటు; కష్టపడి పనిచేస్తారు. కనుక స్త్రీపురుషులు బలిష్టంగా ఉంటారు. కష్టపడి సంపాదించిన ధనంతో శుభ్రంగా నగలువేసుకొని, అలంకరించుకోవడం వారి ప్రధానాశయం.

లంబాడీలలో మూడువంతులమంది నల్లగా ఉన్నప్పటికీ, వారు చాల అందంగా పొడుగ్గా ఉంటారు. నగలుమీద వీరికి ప్రత్యేకంగా మోజు ఎక్కువగా కనిపిస్తుంది. వారు నగలు ధరించే విధానాన్ని చూస్తే, 'ఇంత బరువైన ఇన్ని నగల్ని ఎలా ధరిస్తున్నారో!' అని ఆశ్చర్యం కలుగుతుంది. వారి నగల్లో ఎక్కువభాగం వెండి ఉంటుంది. వాటిమధ్య పూసలు, ముత్యాలు, చదరంగాఉండే గాజు పలకలు, వృత్తాకారంగా ఉండే గాజు బిళ్లలు ఉండి తళతళా మెరుస్తూ, ఆకాశంలో నక్షత్రాలమధ్య చంద్రుడు మెరుస్తున్నట్లు ఉంటుంది. వారికి ముత్తెదువులంటే చాలా

గాజుబిళ్ళలు, రకరకాలవి, రంగురంగులవి అమర్చబడి ఉంటాయి. వారు వీథులలో నడుస్తుంటే వారి ఆభరణాలు, దుస్తులు కంగు కంగుమనే శబ్దంతో, తళతళలాడుతూ చూపరులను ఆకర్షిస్తాయి. కాలికి పెట్టుకున్న వెండి గొలుసులు, పట్టాలు చాలా పెద్దవిగా, అందంగా ఉంటాయి. జుట్టును రెండుప్రక్కలకు చక్కగా సర్దుకొని, అందులో బాగా బరువైన వెండి ఆభరణాలను తగిలించుకొంటారు. నడుస్తున్నప్పుడు అవి అటునిటు చలిస్తూ, ఒక వింతశోభను వారికి కలిగిస్తాయి. ఈ ఆభరణాలలో నగిషీలు చెక్కబడి, పొడవుగా ఉంటాయి. వాటిచివర కుచ్చులవలె ఉండే, వెండి గుండ్లుఅమర్చబడి ఉంటాయి.

## వివాహ విధానం

ఒక్కొక్కజాతిలో వివాహం ఒక్కొక్కరీతిగా ఉంటుంది. లంబాడీల విధానం చాల విచిత్రమైనది. తండ్రి తనపుత్రుడికి వివాహం చేయవలసివస్తే, అతడే వివాహ విషయాలన్నిటిలోను శ్రద్ధ వహించాలి. తనకుమారునికి తగిన యువతిని తండ్రి వెదకి, వివాహ సంబంధం కుదుర్చుకోవాలి. వివాహ నిర్ణయం అయినతరువాత, పెండ్లికొడుకు తరఫువారు, పెండ్లికూతురునకు 121 రూపాయలు కట్నంగా ఇవ్వాలి. ఈ కట్నం చెల్లిస్తేనే వివాహంజరుగుతుంది. ఇదిలంబాడీ జాతిలో ముఖ్యాచారం. మామూలుగా వివాహం పెండ్లికుమార్తెగృహంలోనే జరుగుతుంది. వధూవరులను వివాహ సమయంలో అభ్యంగనస్నానం చేయిస్తారు. ఇరువురినీ జతగా ఒక చెక్కపీటపై కూర్చొపెడతారు. రూపాయి బిళ్లను ఒక నూతనవస్త్రంలో ముడివేసి, వారిరువురి చేతులు జతపరచి ఈ గుడ్డతో ముడి వేస్తారు. మరొక విచిత్రం ఏమిటంటే, వివాహ సంద



పాలు, పెరుగు, నెయ్యి

# ఆచారాలు

గాడక్

ఆచారంకూడా ఉంది. వధూవరుల ఎదుట హోమాగ్ని వెలిగించి, ఏడురకాల పుల్లలను, మంత్రాలను ఉచ్చరిస్తూ పురోహితుడు హోమాగ్నిలో వేస్తాడు. వధూవరులు తమ తల్లిదండ్రులతో అగ్నిగుండంచుట్టు ఏడు సార్లు ప్రదక్షిణంచేస్తారు. వివాహమైన మూడవరోజున పెండ్లికూతురు ఇంట్లో విందు జరిపి, తమ చుట్టాల్ని ఇరుగు పొరుగువారిని ఆహ్వానిస్తారు. తరువాత పెండ్లికుమార్తెను భర్తతోకూడా పంపిస్తూ, ఆమెకు కావలసిన యింటి పరికరాల్ని ఇస్తారు. మరొక విశేషం ఒక ఎద్దును పెండ్లికుమార్తెతో భర్త యింటికిపంపించడం ముఖ్యాచారం.



చిత్రయించటం

భర్త చనిపోయిన స్త్రీలు మరలవివాహంచేసుకోవచ్చు. దానికి కొన్ని నిబంధనలు ఉన్నాయి. రెండోవివాహం చేసుకోబోయే స్త్రీ తన మొదటి అత్తగారినిఅరటి గూపాములతో సన్మానించి ఆమె ఆజ్ఞ పొంది, తనకు నచ్చిన వేరొక పురుషుని వివాహం చేసుకోవాలి. ఈ రెండో వివాహానికి మొదటిఅత్తగారు తప్పక అంగీకరించి తీరాలి. 60రూపాయిలు ఇవ్వనిపక్షంలో అత్తగారు అంగీకరింపక పోయినా సంఘం ఒప్పుకుంటుంది. లంబాడీ జాతివారికి మూఢ విశ్వాసాలు చాల ఎక్కువ. తమ యింట్లో ఎవరికైనా వ్యాధివచ్చినా, మరణంసంభవించినా, ఎవరో తమజాతిని, కుటుంబాన్ని నాశనం చేయ బూనుకొన్నారనిఅనుమానిస్తారు. ఈ ఘోర కృత్యానికి ఎవరు కారకులై ఉంటారో వారిని తప్పక చంపితీరాలని అనుకుంటూ, వెదకడం ప్రారంభిస్తారు. మంత్రోచ్చారణవల్లనే ఈ ఘోరం జరిగిందని, మంత్రాన్ని తమపై ప్రయోగించినవాణ్ని వధించాలని నిద్రాహారాలు మాని తిరుగుతారు. వారికి, ఎవరిపై



లంబాడీల నగలుచూస్తే "ఎట్లా వీటిని ధరిస్తున్నారో!" అని ఆశ్చర్యం కలుగుతుంది.

బలవంతంగా కొట్టి చంపి, సంతృప్తి పడతారు.

## లంబాడీల నృత్యం

లంబాడీలకు నాట్యమంటే చాలా యిష్టం. తమలో నాట్యంచేసేవారిని ఎక్కువగా గౌరవిస్తారు. వారి నాట్యం చాల విచిత్రంగా ఉంటుంది. ఈ నాట్యం చూస్తుంటే ఎన్ని సంవత్సరాలు వారు కష్టపడి ఇట్టి వింత నాట్యాన్ని నేర్చుకున్నారో అనిపిస్తుంది. నిజంగా వారి నాట్యవిధానం అతి కష్టమైనదే. చిన్నప్పటినుంచీ నాట్యాభ్యాసం చేయడం మొదలుపెడతారు. నాట్యంలో స్త్రీకి ఎప్పుడూ అగ్రస్థానమని తెలిసిన విషయమే. అలాగే లంబాడీ జాతిలో స్త్రీలే నాట్యంలో ఆరితేరినవారై ఉంటారు. వారు లంబాడీభాషలో పాడుతూ నాట్యం చేస్తుంటే చాల రమ్యంగా వుంటుంది. కాని ఆ పాటలోని భావం మన కర్థంకాదు. నృత్య ప్రదర్శనానికి ముందు తమకున్న నగలన్నిటిని ధరిస్తారు. ఒకరి చేయి ఊపుతూ, అందరూ ఒకేసారి తమ శిరస్సులు క్రిందకు వంచి పైకి లేవతీస్తారు. గుండ్రంగా నిలబడి అందరు ఒక్కసారి క్రిందకు వంగి, పైకి లేస్తున్నప్పుడు ముకుళించిన పద్మము ఒక్కసారిగా వికసించినట్లు ఉంటుంది. ఈవిధంగా వారు పాటకు తగిన అంగచాలనంతో నృత్యంచేస్తూ, పాటలోని భావము విశదీకరిస్తారు. వారి నృత్యాన్ని చూచి గ్రహించాల్సిందేగాని. వర్ణించడం కష్టం.

నాగరికత అభివృద్ధి చెందినకొలది, ప్రజలు తమ పూర్వాచారములను విస్మరిస్తూ, ఆధునిక లక్షణాలు అలవరచుకుంటూ, నానాటికీ మారుతున్నారు. కాని ఇంకా కొందరు అనగా లంబాడి మొదలగు జాతులకు చెందిన వారు, తమ పూర్వాచారాలప్రకారమే నేటికీ నడుస్తూ, ఆధునిక నాగరికతకు దూరంగా ఉండి జీవిస్తుండడం చాలా ఆశ్చర్యంగా కనిపిస్తుంది. ఆధునిక నాగరికత అలవడిన ప్రజలు, పూర్వాచారాలను అనుసరిస్తున్న జాతులవారిని వింతగా చూస్తూ, ఆశ్చర్యపడుతూ ఉంటారు. అంతా కాల

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

వచ్చే అతిథికి కొంత ఫలహారమైనా పెట్టడం తనధర్మమని స్ఫురించాడు శివరాం. బజారుకు వెళ్ళి, ఆపిలుపళ్ళు, ద్రాక్ష, బిస్కట్లు కొని యింట్లో పెట్టి ఆదివారం ఒంటిగంటకు తన ఆఫీసుదగ్గర బస్సుస్టాండుకు చేరాడు శివరాం. నల్కగులాబి చీరకట్టి, పాలపిట్టరంగు చారలతో తెల్లటి సిల్కురవిక తొడుక్కుని, పిఱుదులకు దిగవ పొడుగాటిజడ బుజంమీదినుంచి ముందు వేలాడించుకుని ఊగిస్తూ, చేతిలో వేనిటీ బేగ్ పట్టుకుని నిరీక్షిస్తూ నిలుచుంది రాణి. ఆనమాట అక్షరాల అమలు జరుపుతున్న రాణి హృదయంలో తనమీద ఏదో అపూర్వమైన అనురాగం ఉందనుకున్నాడు, శివరాం. బస్సు ఎక్కి మౌనంగా యిల్లుచేరారు ఇద్దరూ.

పొరుగింటి అమ్మలక్కలు, అందమైన అమ్మాయితో సహా వచ్చిన శివరాంను ఎగాదిగా చూశారు. రాణిని కిటికీల్లోంచి తొంగిచూసి పరీక్షించారు ముఖం. ఏదో గుసగుసలాడుకున్నారు. రాణి మేడ ఎక్కి శివరాం తలుపుతీసేలోగా పరిసరాలు పర్యవేక్షించసాగింది.

"మీ మేడమీది బంగళాకు వాయుదేవుడే సేవచేస్తున్నాడే!... వేసవికాలం యిక్కడ చాలా హాయిగా ఉంటుంది కదండీ!" రాణి లోపలికి ప్రవేశించింది.

విశాలమైన ముందు గదిలో నాల్గుకుర్చీలు ఒక చిన్న గుండ్రని బల్ల, గోడలలో కొలుచుకున్న అలమరుల్లో పుస్తకాలు, వెండికప్పులు, మరో వైపున సుందర ప్రకృతిదృశ్యాలు, ఇంకొకవైపున శివరాం గీసిన తైలవర్ణ చిత్రాలు, కళాకృతుల మనుష్యుల బొమ్మలు వేలాడుతున్నాయి. ఇల్లు పరిశుభ్రంగా ఉంది. వీధివైపున్న గోడకు నిలువుటద్దం తగిలించి ఉంది.

అద్దంలో ప్రతిబింబించే తన రూపం ఒకసారి చూసుకుని జడసవరించుకుంది రాణి.

'మీదగ్గరచాలాపుస్తకాలున్నాయండీ... కాలక్షేపానికి ఎప్పుడైనా కథలు, నవలలు మీదగ్గరనుంచి పట్టుకెళ్ళవచ్చన్నమాట—'

తప్పకుండా నన్నాడు శివరాం.

చేతిలోని వేనిటీ బేగ్ మరో కుర్చీలో పడేసి, వాలుకుర్చీలో ఒరిగి, ఒక నిమిషం కాళ్ళు చాపుకుని బరువుగా శ్వాస విడిచి నవ్వింది రాణి.

'అలసిపోయావా?'

'అబలను కదండీ!' నవ్వింది రాణి.

"ఏమన్నా ఫలహారాలు తింటావా?"

"మీరు ఫలహారాలు కూడా యింట్లో తయారుచేస్తారా?..." ఆడవాళ్ళు యింట్లో లేకపోయిన శివరాం ఏమి అమర్చాడో తిండానికి అని ఆశ్చర్యపోయింది రాణి.

ప్లేటులో మూడు ఆపిలు పళ్ళు, రెండు ద్రాక్షగుత్తులు అరడజను బిస్కట్లు తెచ్చి ఉంచాడు శివరాం.

"ఇవన్నీ ఏమిటండోయి!" నోరావలించింది రాణి. ఒక ద్రాక్షపండు నోట్లోకి విసిరాడు శివరాం "అందుకు" అంటూ నవ్వాడు.

తియ్యటి ద్రాక్షపండ్లు వయ్యారంగా నమిలి, అందులోని రుచిని ముఖభంగిమల్లో ప్రస్ఫుటంచేస్తూ నవ్వింది రాణి.

> ఒక పర్వదినాన బందీలకు మిఠాయిలు పంచిపెట్టి జైల్లోనే ఒక సభ యేర్పాటుచేసి, ఒక పెద్ద మనిషిని వక్తగా పిలిచారు.
>
> 'సోదరీ సోదరులారా—సహృదయులారా' అని సంబోధించి ఆయన చటుక్కున నాలిక్కొరుక్కున్నాడు.

"మీతో ఒకసంగతి చెబుదామనుకున్నానండి!"

"చెప్పండి!"

"ఎవరో ఈశ్వరయ్య...మంచి, మర్యాద లేనట్లుందే...ఒకరోజు లకిడీకాపూల్ బస్సుస్టాండుదగ్గరనిలుచున్నాను ... అతను కనిపించాడు...ఏమిటేమిటో మాట్లాడుతాడు...తన జన్మదినంనాడు టీపార్టీ యిస్తాడుట...నన్ను ప్రత్యేకం రమ్మంటాడు....దగ్గరకువచ్చి ముఖంమీద ముఖం పెట్టి...తుంపరలు పడేలా ఛీ...పైగా దారినపోయే పువ్వులవాణ్ణి పిలిచి నాకో మల్లెదండ కొని యివ్వబోయాడు....నాల్గు చీవాట్లు పెట్టాను....హాలు....మీ స్నేహితులంతా యిటువంటివాళ్ళే!" మూతి కోపంగా త్రిప్పుకుని రెండు ద్రాక్షపండ్లు నోట్లో కుక్కుకుంది.

"అనేకరకాల స్నేహితులు జీవితంలో తారసిల్లుతారు...కొందరిని అర్థం చేసుకోలేం...కొందరిని అర్థంచేసుకోటానికి చాలా కాలం పడుతుంది!" శివరాం రాణివైపు నిశితంగా చూశాడు."

రాణి మౌనంగా పాలోచనగా ముఖం త్రిప్పుకుంది.

"ఏమిటి...మీరు నన్ని గదిలో కూర్చోపెట్టనున్నారే! ఇల్లంతా చూపించరు?..." లేచి నిలుచుంది రాణి.

శివరాం రెండోగదిలోకి తీసుకువెళ్లాడు. గోడమీద ఏవో బంధువుల ఫోటోల్లా కనిపించాయి. నేలమీద కుంచె, రంగుల పెట్టె, కాన్వాస్ గుడ్డ, డ్రాయింగు పేపరు, చాకు, సూదిగా చెక్కిన పెన్సిళ్ళు...పాలెం దృశ్యం...కుంటుతూ చిప్పకర్ర చేతబట్టిన ముసలి బీదవాడు....సూర్యాస్తమయం.... ఉత్తుంగతరంగాల సముద్రతీరం...చెట్లమీద పక్షిగూళ్ళు...శీతాకాలంలో చలి కాచుకునే ముసలివాడు...పావురాలకు తిండిపెడుతున్న కుర్రవాడు...బిడ్డకు పాలిస్తున్న తల్లి...వివిధ చిత్రాలు చెదిరి పడిఉన్నాయి. ఒక్కొక్కటే ఆసక్తితో పరీక్షించింది రాణి. ఒకవారగా పెద్ద పట్టె మంచంమీద పరుపు. నీలంగళ్ళ దుప్పటి, పువ్వులుచెక్కిన తలగడ...చిలకకొయ్యలకు వేలాడే నెక్ టైలు...పంట్లాములు... మూడు ఫెల్ట్ హేట్స్, ఒక స్ట్రాహేట్... ఒకబల్లమీద గుడ్డకప్పుకుని కూర్చున్న రేడియో కనిపించాయి రాణికి.

"మీయింట్లో అన్నిహంగులూ ఉన్నాయండీ!"

"ఏవనితసంతప్ప!" వ్యంగ్యంగా నవ్వాడు శివరాం.

మందస్మితం చేసింది రాణి.

"మొదటిగదిలో ఫోటోలు...మా ఆఫీసువాళ్ళతో తీయించుకున్నవి... ఈ ఫోటో మా తాతయ్యగారిది..." శివరాం ఒక్క—

క్కటి పరిచయం చేయసాగాడు.

"ఈ ముఖంలో ఎంత బ్రహ్మ వర్చస్సో!" ఆశ్చర్యంగా అవలించింది రాణి.

శివరాం చకితుడై ఆమెవైపు తేరిపారి ఒక్కసారి చూశాడు.

"ఈ ఫోటో...మా అమ్మగారిది..."

"ఎంతో భద్రత, నిమ్మళం, శాంతం ఆమెలో మూర్తీభవిస్తోందండి!"

"ఈ ఫోటో...మా చెల్లెలిది!"

"లక్ష్మిలా కలకలలాడుతోంది!"

"ఈ ఫోటో...మా తాతయ్య వసివగారిది!"

"ఇదేమిటి చిట్టెలుకలా ముఖం పెట్టుకుని కూర్చుంది ఈవిడ ఫోటోలో!"

రాణి పకపక నిర్లక్ష్యంగా నవ్వేసింది. రాణి అన్న మాటల్లో ఏదో సాన్నిహిత్యం దాగిఉన్నట్లు శివరాంకు అనుమానం కలిగింది. మాటలద్వారా వ్యక్తుల పేర్లు రాణి సూచవగా చేసినట్లు భ్రాంతిపడ్డాడు శివరాం. అయినా ఆమెతోపాటు తాను మర్యాదగా నవ్వాడు.

"అయితే వాళ్ళ పేర్లు చెప్పారు కాదు!" నిష్ఠూరం మోపింది రాణి.

"వాళ్ళ పేర్లు నువ్వే సూచించావు చాలవరకు!" అంటూ అందరి పేర్లు వివరవు పెట్టాడు శివరాం. "బ్రహ్మవర్చస్సు కలిగిన మనిషి బ్రహ్మయ్యగారు. భద్రత కలిగిన మనిషి సుభద్రమ్మ. లక్ష్మిలా కలకలలాడిన మనిషి లక్ష్మి. చిట్టెలుకలా కనిపించిన మనిషి చిట్టెమ్మ!"

శివరాం ఏదో మంత్రం చదివినట్లు రాణి విచిత్రంగా చూసింది శివరాంవైపు.

"అయితే నా మాటలు వేదవాక్కులన్న మాట... తెలియకుండానే నిజం చెప్పేస్తున్నానే యీ మధ్య!" పకపక నవ్వింది రాణి గట్టిగా.

"అవును... తెలిసి కూడా ఒక్కొక్కసారి అబద్ధమాడడం సులువుగా నేర్చుకున్నావు గదా!" రాణి నిజస్వరూపం మీద అనుమానం కలిగిన శివరాం వ్యంగ్యంగా ఏదో అంతరార్థముతో మాట్లాడాడు.

రాణి శివరాం వైపు ఒకసారి తీవ్రంగా చూసింది. ముఖభంగిమలు మరుక్షణంలో మార్చుకుని కిలకిల నవ్వింది.

'అబద్ధాలాడడం నిజంగా కళకదండీ... అంగుళో నిజాయితీమనుష్యులు అబద్ధాలాడడం చాలా కష్టంమీద నేర్చుకోవలసిన కళకదండి!" రాణి మౌనంగా చిన్నగా నవ్వుతూ ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

జేబు రుమాలు తీసుకుని కళ్ళు తుడుచుకుంది. శివరాం గాభరా పడ్డాడు రాణి ఏడ్వడం చూచి.

"నేను వేళాకోళంగా అన్నాను...... ఏమనుకోకు రాణీ!" శివరాం దగ్గరికిచేరి అనునయించాడు.

"అబ్బ!... నేను ఏడ్వటం లేదండీ...... మీ మీదపై ఎగిరే పిచికలు దుమ్ము కంట్లో రాల్చాయి... నీరు కారితే తుడుచుకున్నాను!" మళ్ళీ కిలకిల నవ్వింది రాణి.

"అబద్ధం!"

శివరాం వైపు తీవ్రంగా చూసింది రాణి. 'జీవితంలో బాగుపడాలంటే అబద్ధాలాడే కళలో చాలా నైపుణ్యం సంపాదించుకోవాలండీ!" మందస్మితం చేసింది రాణి.

ఆమె మాటలకు శివరాం అనుమానంతో ముఖం కందగడ్డ చేసుకోవడం గుర్తించింది రాణి. ప్రస్తావన మార్చి ప్రక్కగదిలోకి నడిచింది.

'ఇది వంటిల్లా?...' ప్రశ్నించింది. గదిలో అన్నం తిన్న విస్తరి అలాగే ఉంది. మూత లేక కొద్దిగా అన్నం ఉన్న గిన్నె తెరిచి ఉంది. ఊరగాయి సీసా, పెరుగు సీసా ప్రక్కనే ఉన్నాయి. ఒకవార ఇత్తడి గిన్నెలో మంచినీళ్ళు నిశ్చలంగా ఉన్నాయి. గోడమూల ఎలక ఒకటి తొంగి చూసి దండెం ఊతంతో ఇంటికప్పు కిటికీ పైకి ప్రాకిపోయింది. అమలమరులో జాడీలు, సీసాలు, పప్పు. మీపదినుసులతో కనిపిస్తున్నాయి. గోడమేకుకు వేలాడే సజ్జలో కూరగాయలు నిండి ఉన్నాయి. గోడలు చాలావరకు పొగచూరి మసితో నల్లబడ్డాయి.

"ఇక్కడేముంది చూడ్డానికి!" అసహ్యంగా ఉన్న వంటిల్లు చూపి రాణిభావాలలో తన మీద మార్పు తెప్పించుకోడం యిష్టంలేకపోయింది శివరాంకు.

"మీరు వండుకుంటారా?" రాణి పాలోచనగా ప్రశ్నించింది. వండుకోడం హోదాకు భంగమనుకునే సహజయువక అహంభావం శివరాంకూడా వెలిబుచ్చాడు.

'లేదు...దాసీమనిషి వండుతుంది!"

'నేను ఒకరోజు మీకు వంట చేసిపెడతానండి!"

'తప్పకుండా...మనిద్దరం భోంచేద్దాం!"

'ఇదేమిటి వంట చేసిపెట్టాక, భోజనం పెట్టాకుండా యింట్లోంచి తరిమేద్దామనుకున్నారా...ఏదో దయగా భోజనం పెడతామంటారేమిటి!... వంట చేసిక నా యింట్లో భోంచేయడం నా జన్మహక్కు!" నవ్వింది రాణి.

"నీ జన్మహక్కు అన్నివిధాల కాపాడే అభయహస్తం యిస్తున్నాగా!" శివరాం కూడా ఆమెతోపాటు నవ్వాడు.

ఇద్దరూ వంటిల్లుదాటి మేడవరండాలోకి వెళ్ళారు. వరండా చుట్టూ పూలకుండీలు అందంగా అమర్చి ఉన్నాయి. ఒక ఎర్ర మచ్చల ఆకుల క్రోటనుతీగ మేడవరండా చిన్నగోడపై సాగసుగా ప్రాకుతోంది. కుండీలలో గులాబి, మల్లి, చామంతి మొక్కలు పువ్వులు విచ్చుకుని నవ్వుతూ గాలిలో ఊగుతున్నాయి. ఎదురుగా నాయుడుగారి మేడ...ఇంటి యజమాని కట్టించిన ఇతర బంగళాలు రాణివైపు నిక్కి చూశాయి చోద్యంగా.

రాణి మొదటి గదిలోకి తిరిగి వచ్చేసింది. రాణి వెనుదిరిగాక శివరాం ఒక గులాబి కోసి, చేతులోవడ్డ వెనుకాల దాచుకుని, మొదటి గదిలోకి రాణిదగ్గరకు వచ్చాడు. రాణి బల్ల మీద మేగజైను పేజీలు తిరగవేస్తోంది.

శివరాం మెల్లిగా ఆమెవెనుకవైపు వెళ్ళి జడలో పువ్వు గుచ్చబోయాడు. రాణి కంగారుగా బెదురుగా వెనుదిరిగి చూసింది, మౌనంగా ఊరుకుంది. సాహసంగా శివరాం ఆమె తలలో గులాబి గుచ్చాడు. రాణి నవ్వింది. గులాబి మత్తువాసనలు శివరాం ఆఘ్రాణించి, ఉద్రేకపడి, ఆమెను పైన బుగ్గలను స్పృశించి చుంబించాడు శివరాం.

'రాణీ నన్ను చూస్తుంటే...' శివరాం ఏదో అనబోయి ఆగిపోయాడు.

'చూస్తుంటే...?" అపిలు ముక్కలు చేసింది రాణి.

'అసలు నీ దేవూరు రాణి...నీ జీవిత

## గ్రామాయణం

ఒకప్పుడు గాంధీజీ ఘంటశాల గ్రామంలో ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తున్నారట. మిట్టమధ్యాహ్నం కన్ను చెదిరిపోయే వేసవి ఎండ. క్రింద కాళ్లు, పైన తల మాడిపోతున్నాయి. ప్రముఖ కాంగ్రెసు నాయకులంతా ముందు కూర్చున్నారు. బలవంతులంతా తోసుకుని వస్తున్నారు.

గాంధీజీకి యెండ తగలకుండా 'మేమంటే మేమంటూ' అనేకులు గుడ్డ గొడుగులు నాణ్యమయినవి పట్టుకొచ్చి వేయబోయారు. ఆ తోపిడిలో చివరకు ఎట్లాగైతేనేం ఒక బలంగల ఆసామీ మంచి విశాలమైన మేలిరకం గొడుగు పట్టి గాంధీజీ ప్రక్కనే నిలబడ్డాడట.

ఈ సమయంలో గాంధీజీ దృష్టి దూరాన చెరువుగట్టున నిలుచున్న మూడుకాళ్ళ ముసలిపై బడింది. ఆ ముసలిచేత ఒక తాటాకు గొడుగు కూడా ఉంది. ఆయన కళ్లు ఆర్ద్రభావంతో తళుక్కున మెరిశాయి. ఉపన్యసించడానికి మాట పెగలలేదు.

ఆయన వెంటనే వేదిక దిగి చకచకా చెరువుగట్టుకు నడిచివెళ్ళి ఆ ముసలికి నమస్కరించి 'అయ్యా ఈ గొడుగు పట్టుకొని ఎందుకు ఇక్కడ నిలబడ్డారు' అని అడిగారు. దానికి ఆ వృద్ధుడు 'నాయనా-నన్ను పరీక్షిస్తున్నావా-ఈ గొడుగుతప్ప విదేశీ గొడుగులు నీవు వేసుకోవని నేను తీసుకువచ్చాను' అంటూ ఆ గొడుగు పట్టబోయాడు.

ఆనంద బాష్పాలతో మహాత్ముడు ఆయనను కౌగలించుకుని ఆ తాటాకు గొడుగు తానే ఆ జ్ఞానవయోవృద్ధునికి పట్టారు. జనమంతా విస్తుపోయారు. ★

## డాక్టర్ డిగ్రీ పొందండి!

ఇంటిలో తీరికగా కూర్చొని వుండే ప్పుడు, పోస్టల్ ట్యూషన్ పొంది, ప్రభుత్వ రిజిస్ట్రేషన్ పొందిన కాలేజీ ద్వారా మీరు డిప్లొమా పొందవచ్చును. ఉచిత ప్రాస్పెక్టస్‌కు వ్రాయండి.

Indian Homeopathic College,
(AWM) Jullundur City.



## తరచుగా మూత్రవిసర్జన

తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైనచిహ్నము. శరీరాన్ని గుల్లచేయ సేకాకుండా యీ వ్యాధి, తనబంధంలో చిక్కిన వారిని అరోజుకారోజు మృత్యువుకు ఆసన్నుని చేయును. ప్రథమదశలో శారీరక మానసికశ్రమ లకు యిచ్చగించకుండుట, నరములలో నొప్పి చూపు మాంద్యము, తొడల్లో తిమ్మిరి, నరముల బలహీనతతో యీ వ్యాధి బొడచూపును. పై లక్షణములతోకూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు, నోరు యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్లు తూకంతగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ల నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచ పుండ్లు, యిట్టి భయంకర బాధాకరమైన వ్యాధుల యెన్నో సంభవింపవచ్చును.

"వీనస్ థారమ్" మాత్రలు వాడి, అనేక వేల మంది తమబాధల నుండివివారణపొంది మృత్యు కరాళమునుండి రక్షింపబడిరి. "వీనస్ థారమ్" శాస్త్రీయ పద్ధతులమీద, ప్రాచీన యూనాని వైద్య విధానప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థ ముల, స్వాభావిక క్షారముల సారముతో తయా రైనవి. "అమిత దాహం తగ్గి.... పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము. 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణగును. కొద్ది రోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "వీనస్ థారమ్" కొద్ది వ్యయముతో, సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేకపథ్యము లేదు. నిరాహారముతో నుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై రోగులు యిదివరకటికంటే యెక్కువరకాల ఆహారపదార్థములు తినికొనవచ్చును వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినచో ఉచితముగా పంపబడును

ధర: 50 మాత్రల సీసా రు. 6-75
ప్యాకింగు పోస్టేజి ఉచితము.
లభించు స్థలము:

Venus Research Laboratory (A.P. W)
P- O Box No. 587,- Calcutta.


# ★ అన్వేషణ ★

చరిత్ర కొంచెం చెప్పు!" శివరాం ఆవేదనతో దీనంగా అడిగాడు.

'మాది గుంటూరండి...మా నాన్న చిన్నతనంలో పోయాడు...అప్పటినుంచి మాఅమ్మ పెంచింది నన్ను...గుంటూరులో మాకొక యిల్లు భూములుకూడా ఉన్నాయండీ! కావలిస్తే ఎవరినైనా అడగండి!"

శివరాం అసలు శారదగురించి ప్రస్తావిద్దామనుకున్నాడు. కాని రాణిమాటలు, తీరు ప్రవర్తన విచిత్రంగా ఉంది. ఆప్రసను ఆంతరంగిక సమావేశంలో పరస్త్రీగురించి ప్రస్తావిస్తే అసూయతో రాణి దూరమై పోతుందనే భయంతో శివరాం ఊరుకున్నాడు.

ఆపిలు ముక్కలు శివరాంచేతిలో పెట్టింది రాణి. ద్రాక్షపళ్ళు గుత్తులనుంచి విడదీశాడు శివరాం. ఇద్దరూ ఫలహారాలు పూర్తిచేశారు.

'ఏమండీ!...నాబొమ్మ వేస్తానన్నారు అప్పుడే వచ్చి రెండుగంటలయిపోయింది. ఏమిటో కబుర్లతో కాలక్షేపం అయిపోయింది! బుంగమూతి పెట్టింది రాణి.

'మళ్ళీరా...ఈసారి పూర్తిగా నిబొమ్మ వేస్తూ కూర్చుంటా...మాట్లాడను నీతో!" నవ్వాడు శివరాం.

వెడతానండి...ఇప్పటికేచాలా ఆలస్యమైపోయింది ...మా అమ్మ కోప్పడుతుంది!" గారాబుగా మాట్లాడింది రాణి.

'అమ్మఅంటే ఎంతభయం పిల్లకి!" నవ్వాడు శివరాం.

లేచి అలమర దగ్గరకు వెళ్ళి రెండుపుస్తకాలు తీసుకుంది రాణి.

"మళ్ళీ వచ్చినప్పుడు తెచ్చి యిచ్చేస్తా!"

"అంటే...ఎప్పుడు?"

"మీరు ఎప్పుడు రమ్మంటే...అప్పుడు?"

"వచ్చే ఆదివారం!"

"ఊఁ!' మౌనంగా తల ఒంచుకుని నవ్వింది రాణి.

రాణిని బస్సుస్టాండు దాక దిగబెట్టాలని బయలుదేరాడు శివరాం. మధ్యాహ్నం నాల్గు గంటలయింది. ఇల్లువిడిచి జంటగా నడుస్తున్న శివరాం, రాణివైపు మేడమీదనుంచి శివరాం పొరుగింటి అమ్మలక్కలు గుసగుసలాడుకుంటు తొంగిచూస్తున్నారు. ఇస్త్రీ పంట్లాము తొడుక్కొని, స్పోర్ట్సు బనీను వేసుకున్న మేడక్రింది నిమ్న జాతుల కుర్రాడొకడు ఒడుపుగా రాణివైపు తేరిపార చూశాడు.

గాలి రివ్వున వీస్తోంది. బుజాలమీదకు జార్చి వేలాడేజడను అరచేతితో గెంతిస్తూ రాణి వయ్యారంగా సొగసుగా శివరాం వైపు చిలిపిగా చూస్తూ నడుస్తోంది.

"నువ్వు అలా వంకరగానడుస్తావేం రాణీ" శివరాం రాణి నడకను హేళనచేశాడు.

"వయ్యారంగా సొగసుగా నడుస్తోంటే కాలు వంకర తిరుగుతుందండి!" రాణి ఫకాలున నవ్వింది తన చలోక్తికి.

శివరాం ఆమె చలోక్తికి ఆనందించి నవ్వుకున్నాడు.

"మిమ్మల్ని ఒకటి అడుగనా?"

"ఊఁ!"

"మీ కన్ను మెల్లగా ఉంటుందేమండీ?"

ఉబికివచ్చే నవ్వు పెదాలమధ్య బిగించింది రాణి.

"అందమైన అమ్మాయిని చూస్తోంటే కన్ను వంకర తిరుగుతుంది!" శివరాం మునుపటి పద్ధతిలోనే చలోక్తి విసిరాడు.

"కమ్మటి వాసనలు ఆఘ్రాణిస్తూంటే ముక్కు కూడా వంకరతిరుగుతుందండోయి"

పోటీగా మరో వాక్యం చెప్పి నవ్వింది రాణి.

"గాఢంగా చుంబిస్తే పెదాలు కూడా వంకర తిరుగుతాయి కదూ!"

శివరాం ఆఖరి వాక్యానికి లీలగా కోపంగా చూసి, మెరిసే కళ్ళతో, మూతి ముడుచుకుని వ్యంగించేసిన పెదాలతో నవ్వుకుంది లోలోపల రాణి.

బస్సుస్టాండు చేరారు యిద్దరూ.

రావణుడు సీతను ఎత్తుకుని పోయినట్లు, దెయ్యంలాంటి బస్సు గోజుకుంటూ వచ్చి రాణిని మింగి అదృశ్యమైపోయింది. శివరాం మత్తు ఆలోచనల్లో మెల్లిగా యిల్లు చేరాడు.

వాగ్దానం చేసినట్లు రాణి తరువాతి ఆదివారంకూడా యథాప్రకారం ఒంటిగంటకు తలుపు తట్టింది. సుస్వాగతమంటూ ఆహ్వానించాడు. మామూలు పద్ధతిలో శివరాం. టేబిలుమీద ద్రాక్షపళ్ళు ఆపిలుపళ్ళు ప్లేటులో ఉంచాడు.

'ఈ పళ్ళు నాకు పెట్టకపోతే ఏమౌతుందండి?' రాణి చిలిపిగా నవ్వింది.

'ఈ పళ్ళు తింటే ఏమౌతుందండీ?' శివరాం చిలిపిగా ప్రశ్నించాడు.

ఇద్దరు తమ ప్రశ్నలకు సమాధానాలు చెప్పకుండానే పళ్ళప్లేటుమీద చేతులు వేశారు.

'అబ్బ మీ చెయ్యి ముట్టుకుంటే నా చెయ్యి కాలిందండి!'అంటూ రాణి చెయ్యి లాక్కుని వేళ్ళమీద ఊదుకుంది.

'నా గుండెల్లో పోటు వస్తోంది' అంటూ శివరాం కుర్చీలో వాలిపోయాడు.

'మీ కింత ఖర్చు ఎందుకండీ!' సానుభూతి చూపించింది రాణి.

'ఖర్చేముంది? మా దొడ్లో ఆపిలు చెట్లు, ద్రాక్షతీగ విరగ కాస్తున్నాయి...అవి పాడైపోతాయని మీకు పెట్టాను!" శివరాం నవ్వాడు.

'అబద్ధాలు కథల్లా చెప్పడంకూడా ఒక కళ కదండీ!" ద్రాక్షపళ్ళ గుత్తి చిలిపిగా నోటిమీదకు తెచ్చుకు ఒక్కొక్క పండు తినసాగింది రాణి.

'రాణీ, నిన్ను చూస్తోంటే...'

ఏమిటన్నట్లు శివరాంవైపు చూసింది రాణి.

'ఒక అమ్మాయి జ్ఞప్తికి వస్తుంది. ఆ అమ్మాయిని ఎంతో ప్రేమించాను...చివరకు మోసంచేసింది...అదేవిషయం తిరిగి నువ్వు చేస్తే నేను భరించలేను!'

బ్రతుకుమీద భయంతో భారంగా మాట్లాడాడు శివరాం.

"అయితే యింతకుముందు ఎన్నో ప్రేమకలాపాలు చేశారన్న మాట!" తింటున్న ద్రాక్షగుత్తులు ప్లేటులోకి విసిరేసి, ముఖానికి అడ్డుగా పుస్తకం తెరిచి పట్టుకుంది రాణి.

'ఆమె చేసిన ద్రోహానికి నాకు చాలా అసహ్యం వేసింది....ఆమెను మరిచిపోవాలని యత్నించాను...కానినిన్ను చూస్తోంటే ఆమె జ్ఞాపకం వస్తుంది!" నిట్టూర్చాడు శివరాం.

'పోనీ ఆమె ఎక్కడుందో వెతికి, వెంటబడి పెళ్ళి చేసుకోండి...నా స్నేహం ఎందుకు మీకు!"

రాణి పుస్తకంచాటునుంచే మాట్లాడింది. ఆమె ముఖభంగిమలు పరిశీలించడానికి శివరాంకు అవకాశం లేకపోయింది. శివరాం ఛటాలున ఆమెముఖంమీది పుస్తకం లాగేశాడు. రాణిముఖం భారమైన ఆలోచనలతో ముడుతలుపడ చిట్లింపులతో నిండిపోయింది. ఆవేదనాభరంతో ముఖం దించుకుంది.

'గతంతో మనకు నిమిత్తంలేదు రాణీ...ప్రస్తుతం మనకు ప్రధానం...నువ్వు నన్ను పెండ్లిచేసుకోడానికి ఒప్పుకుంటే...నా ఆనందానికి మితిలేదు..." శివరాం రాణి చుబుకొన్ని ఎత్తి దీనంగా ఆమెకళ్ళల్లోకి చూశాడు.

రాణి ముఖం దించుకుని టేబిలుమీది పెన్సిలుతో మౌనంగా కాగితంమీద పిచ్చి గీతలు గీసింది కొన్సేపు. గబుక్కున కన్నీరుకార్చి చీరకొంగులో ముఖం దూర్చుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

శివరాం నిర్ఘాంతపోయాడు. పెళ్ళిమాట విని రాణి ఎందుకు ఏడుస్తోందో, ఆమె మనస్సులోని అంతర్భావాలేమిటో గుర్తించుకోటం చాలా కష్టమనిపించింది శివరాంకు. బహుశా పరస్త్రీని యింతకుముందు ప్రేమించానని అసూయతో రాణి ఏడ్చిందేమో అనుకున్నాడు శివరాం.

ఉద్రేకంలో రాణిమీద దినదినం పెరుగుతున్న అభిమానంమోజులో, పెళ్ళిచేసుకుంటానన్నమాట అప్రయత్నంగా జారిపోయింది శివరాం నోటినుంచి. క్రైస్తవుల పిల్ల పెళ్ళి చేసుకుంటానని వ్రాస్తే సనాతన సాంప్రదాయులకు బద్ధులైన బ్రహ్మయ్యగారు తదితర బంధువులు, మతి వివక్షత లేక వివేకం పోగొట్టుకున్నాడని తన్ను తిటడం సహజం అనుకున్నాడు శివరాం.

ఏడ్చిఏడ్చి తనంత తానే కళ్లు తుడుచుకుని పచారుచేసి, తెచ్చిన కథలు నవలలు, పుస్తకాలు రాణి అందిచ్చింది శివరాంకు.

'అబ్బ! ఆ నవల చదువుతుంటే చాలా భయం వేసిందండీ!'

రాణి నవ్వింది. ఆ నవ్వులో విషయం మార్చిన శివరాంను ప్రసన్నుని చేసుకోవాలనే ఆకాంక్షవున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది.

అలమరులోని మరి రెండు క్రొత్త ఇంగ్లీషునవలలు అందిచ్చాడు శివరాం.

'నేను ఈ ఏడు ఇంటరుపరీక్షకు కూర్చుంటున్నానండి......ట్యుటోరియల్ కాలేజిలో చేరాను!" రాణి కనుబొమలు ఎగరవేసింది నవ్వుతూ.

'సత్యం సంగతి ఏమయింది?'

'వదిలేశాను. ఒంట్లో ఓపిక లేక అస్తమానూ వంకరటింకరలుగా గెంతలేక...!'

'అయినా కనుబొమలు గెంతడంమాత్రం మానలేదు!' నవ్వాడు శివరాం.

'నృత్యం మానేసినా ఈ పాడు అలవాటు పోలేదు నాకు!' రాణి కులుకుతూ ధనుస్సుల్లా వంగి ముడుచుకుంటున్న కనుబొమలు కొన్సేపు ఎగరేసి అద్దంలో తన ముఖారవిందం చూసుకుని ఆనందించింది.

'ఏమండీ! నా బొమ్మ గీయరూ!'

గారాబుగా శివరాం భుజాలమీద చేతులు వేసి దగ్గరగా నిలుచుంది రాణి.

రాణి విచారంతగ్గి ప్రసన్నురాలైందని సమాధానపడ్డాడు శివరాం.

కుర్చీమీద కూర్చోమన్నాడు. ఒక భంగిమలో, ముఖం, కన్నులు, నాసిక, జడ, ఆకార రేఖలు స్ఫుటంగా కనిపించేలా కూర్చోపెట్టాడు శివరాం. ఒక పెద్ద డ్రాయింగు కాగితం ఒళ్లకు అమర్చి ఆమె ఆకృతి రూపురేఖలు ఒకగంటసేపు పెన్సిలుతో దిద్దాడు.

గంటసేపు ఒక భంగిమలో కూర్చునే ఓపిక, పట్టుదలలేని రాణి మధ్య మధ్య చిలిపిగా నవ్వుతూ, గారాబుగా నిట్టూరుస్తూ, భంగిమ చెడగొడుతూ, అల్లరిగా ఆపిలు పండు ముక్కలు తింటూ నవ్వుతూ శివరాంను విసిగించింది. శివరాం లీలగా కోపపడేవాడు. "ఏమండీ ఆ బొమ్మ పూర్తిచేశాక, నేనని ఎవరైనా చెప్పగలరా?...లేక నా పేరు వ్రాసి వచ్చిన వాళ్ళకు గంటసేపు మీరు ఉపన్యాసమియ్యాలా!" రాణి శివరాంను హేళన చేసింది.

అబ్బే......బొమ్మ పూర్తిచేసి "కోతి" అని పేరే వ్రాస్తా......ఉపన్యాసం యివ్వక్కర్లేదు!" అన్నాడు శివరాం సరదాగా.

'ఆఁ......నేను కోతిలా ఉన్నానా...ఎంతమాటన్నారు...అద్దంలో చూడండీ!...మీకే తెలుస్తుంది..."రాణి ఒయ్యారంగా తలదువ్వుకుని సొగసుగా అద్దంముందు నిలుచుంది. శివరాం వెనకనుంచి చూసేడు...

'నా వెనుకాల ఉన్న కోతిని చూస్తోంటే నాకు భయం వేస్తోందండీ!" రాణి పకపక నవ్వింది.

'ఇద్దరు కోతులు పెళ్ళిచేసుకుంటే ఇంకా బాగుంటుంది కదూ' నవ్వాడు శివరాం.

'అప్పుడు కోతులే బాజాలు వాయించడం మంత్రాలు చదవడం, సన్నాయి పాడడం.. వగైరా...వగైరాలు!" నవ్వింది రాణి.

కోతిచేష్టలతో చిలిపి అల్లరిచేస్తే రాణిని మక్కువతో ఆనందంగా ఆలింగనం చేసుకున్నాడు శివరాం. చేతులు విడిపించుకుని కొంత దూరంగా పారిపోయింది రాణి.

బస్సుస్టాండువైపు నడిచారు యిద్దరూ ఆనాటి సమావేశము ముగించుకుని.

'ఏమండీ నాకు ఆకలి వేస్తోందండీ!"

రాణి చంటిపిల్లలా ముఖం పెట్టింది.

'ఇంతవరకు తిన్న పళ్ళన్నీ ఏమైపోయాయి?

(ఇంకావుంది)

---

ఒకడు: 'బ్రతికున్న వాళ్లు కృతఘ్నులు, చచ్చిపోయిన వాళ్ళను ఇట్టే మరచిపోతారు గదా.'

మరొకడు: 'ఛా. నీ మొహం. —నేనుమాత్రం చస్తే మరచిపోలేను.'

ఒకడు; 'ఏమిటి ఋజువు నీ మాటకు'

మరొకడు: 'నేనొక వితంతువును పెళ్లాడనురా భాయి-ఆమె మొదటి భర్త నాకెప్పుడూ జ్ఞాపకం వస్తూఉంటాడు.'

# రాశిఫలాలు

★ దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి ★

**25-11-1959 బుధవారం మొదలు**
**1-12-1959 మంగళవారం వరకు**

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీరు అన్ని విషయాలలోను జాగ్రత్తగా ఉండటం అవసరం. వృత్తి వ్యాపారాలలో ధన సంబంధమైన చిక్కులు రాగల సూచనలున్నవి. తలపెట్టిన పనులు కూడా మీరు అనుకున్నంత చురుకుగా జరుగవు. అనావశ్యమైన పనులలో ముందు తొందరపడి ప్రవేశించటంవల్ల, మధ్యలో మీకు సహాయం చేస్తామన్న మనుష్యులు వెనుకజారుకోవటంవల్ల ప్రతిష్ఠకోసం ప్రాకులాడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండక పోవటంవల్లను, కుటుంబంలో ఖర్చులు పెరగటంవల్లనూ క్రొత్త విషయాలను గురించి యోచించగల శక్తి లోపిస్తుంది. ముఖ్యంగా మీరు ఇతరులకు చెప్పినమాటను కాపాడుకోవటానికి ప్రయత్నించటం అవసరం. వారం మధ్యలో శుభవార్తలు తెలుస్తవి. గొప్పవారితో ప్రసంగించటం జరుగుతుంది. అయితే తాత్కాలికంగా ప్రయోజనం మాత్రం ఉండదు. మీకు ఇష్టం లేకపోయినా ఇతరుల నిమిత్తం కొన్ని ఆడంబరమైన బాధ్యతలు నిర్వహిస్తారు. సుబ్రహ్మణ్య సహస్రనామ పఠనంవల్ల సర్వకార్యసిద్ధి, మనోధైర్యం లభిస్తుంది.

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం ఒక్కొక్క పని శ్రమపడి సాధించుకుంటూ మీరు బాధపడకుండా, ఇతరుల మనస్సుకు బాధ కలుగకుండా ముందుకు పోగలుగుతారు. మీ ఓర్పు మిమ్ములను కాపాడుతుంది. మీ బంధుమిత్రులు చెప్పే మాటలు కొంత భయంకరంగా కనుపించినా మీరు సాహసంతోను, నిబ్బరంతోను ప్రవర్తించటంవల్ల విజయం సాధించగలుగుతారు. ధనాదాయపరిస్థితులు లోగడ మీరు తలచినంతవిశేషంగా పెరగకపోయినా కొంత వృద్ధికరంగా ఉంటుంది. వస్తువులుగాని, ముఖ్యమైన కాగితాలుగాని దొంగతనంగావచ్చునే సూచనలున్నవి. సాధ్యమైనంతవరకు క్రొత్తవారితో వివిధమైన లావాదేవీలు పెట్టుకోవటం మంచిదికాదు. మీరు ప్రతివారితో మెలగటంవల్ల ఈ సమయంలో ఎంతో మేలు పొందగలుగుతారు. స్వశక్తితో మీరు అన్నివిధాలా సంతృప్తికరమైన ఫలితాన్ని పొందగలుగుతారు. కాని అనేక సందర్భాలలో పోటీ తప్పించుకుంటూ ముందుకు పోవలసివస్తుంది. 25, 26 లలో ఆందోళన, దుర్వార్తలు, భేదాభిప్రాయాలు.

**మిథునం:**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

మీ వృత్తివ్యాపారాలలో ప్రస్తుతం కొంత ఆందోళనకరమైన పరిస్థితులు కనుపించినా మీ బుద్ధిబలంతో ఎదటివారిని లోబరచుకుని వారి ఆదరాభిమానాలను పొందగలుగుతారు. ఖర్చులు పెరగటంవల్ల డబ్బు ఇబ్బందులు కనుపిస్తవిగాని, ఆదాయం బాగుంటుంది. ఈ సమయంలో మీకు సహాయం చేయవలసినవారు చిక్కులలో ఉండటంవల మీరు క్రొత్త ప్రయత్నాలు ఆరంభించవలసివస్తుంది. మొత్తంమీద మీరు ఎన్ని చిక్కులను ఎదుర్కొన్నా దైవబలం బాగున్నది. కనుక మీకు అన్నీ అనుకూలంగా జరిగి గౌరవం దక్కుతుంది. శత్రుబాధ క్రమక్రమంగా తగ్గుతుంది. పుణ్యక్షేత్ర దర్శనం, పండితులతో మైత్రి లభిస్తవి. ఈ సమయంలో జరిగే సంఘటనలు తాత్కాలికంగా ఆశ్చర్యకరంగా కనుపించినా ముందుముందు చాలా లాభకరంగా ఉంటవి. ఈ వారం ఆరంభంలో మీ ఆరోగ్యం లోపిస్తుంది. దక్షిణ దిక్కు నుంచి కష్టవార్తలు తెలియగలవు. 29, 30 లలో స్వంత విషయాలలో పట్టుదలలు, శ్రమవల్ల ద్రవ్యప్రాప్తి.

**గ్రహస్థితి**

కన్యలో శుక్ర రాహువులు, వృశ్చికంలో సూర్య, అంగారక బుధగురువులు, ధనుస్సులో శని, మీనంలో కేతువు. సింహ కన్యా తులా వృశ్చికాలలో చంద్రుడు.

**కర్కాటకం:**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈ వారం మీరు చేసే ప్రతిపనీ సులభంగా నెరవేరగల అవకాశాలున్నవి. క్రమకు మనుష్యులతో నూ పరిచయ లభిస్తుంది. విలాస వినోదాల నిమిత్తం ధనం విశేషంగా ఖర్చు చేస్తారు. బంధువులతో అభిప్రాయభేదాలు రాగల అవకాశాలున్నవి. కుటుంబంలో శుభసంతోష కార్యాలు జరుగుతవి. మీరు కొంతమందికి సహాయం చేయటంవల్ల మరికొంతమందికి మీ మీద క్రోధం కలుగుతుంది. గ్రహబలం బాగున్నది. మీరు ధైర్యంతో ఉండి న్యాయాన్ని సాధించగలుగుతారు. వ్యవహార విషయాలలో మీ బుద్ధి బాగా పనిచేస్తుంది. కుటుంబ సౌఖ్యం లభిస్తుంది. ప్రయాణాలు చేయవలయునని అనుకుంటారు. కాని, ఆటంకం వస్తుంది. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. మిమ్ములను ఎదురుగా స్తోత్రం చేస్తూ చాటున మీమీద అపవాదులను ప్రచారం చేస్తూఉండేవారిని గురించి జాగ్రత్తపడటం అవసరం. 27, 28 లలో మనశ్శాంతి లభిస్తుంది. ఇష్టవస్తు ప్రాప్తి, బంధుమిత్ర సమాగమం.

**సింహం:**

(మఘ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం.)

ఈ వారం మీకు అన్నివిధాలా ప్రోత్సాహకరమైన సమయం. మీ మాట చక్కగా చలామణి అవుతుంది. ధనాదాయం ఇంతకు ముందుకన్నా పెరుగుతుంది. దైవానుగ్రహంవల్ల మీ బుద్ధిబలాన్ని ఉపయోగించుకుని అనేక చిక్కు సమస్యలనుండి బయటపడగలుగుతారు. ఈ సమయంలో ఇతరులతో కలసి చేయుపనులలో ఆరంభంలోనే నిష్కర్షగా ఉండటం మంచిది. దూరదేశాలలో ఉంటున్న స్నేహితులవద్దనుంచి శుభవార్తలు రాగలవు. ఇతరుల ప్రోత్సాహంవల్ల సాహసకార్యాలకు దిగుతారు. అందువల్ల క్రొత్తగా చిక్కులు రావుగాని, తగినంత ప్రయోజనం కనుపించదు. పదిమందిలో పేరుప్రతిష్ఠలుమాత్రం నిలుపుకోగలుగుతారు. మీ ప్రసంగం కొంత కటువుగా ఉండటంవల్ల మీ తోటివారి మనస్సుకు బాధకలిగే అవకాశాలున్నవి. సాధ్యమైనంతవరకు నిగ్రహంతో ఉండండి. వారం రెండవభాగంలో కుటుంబంలో కలతలు ఆరంభం అవుతవి. అధికారులను ఉన్నతస్థితియందున్న పెద్దమనుష్యులను కలుసుకోవటంవల్ల ముందుముందు మేలు కలుగుతుంది. 30, 1 తేదులలో శుభకార్యాలు, దండుగ ఖర్చులు, పొరపాట్లు.

**కన్య:** (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ముఖ్యంగా ఈ సమయంలో ధైర్యం అవసరం. ఇతరులవల్ల ఇంతకుముందు కలుగుతున్న ప్రతిబంధకాలు చాలావరకు తొలగిపోయి మీఆలోచనలు క్రమక్రమంగా కార్యరూపం పొందగల అవకాశాలున్నవి. ఎవరు ఏవిధంగా భావించినా మీరు మాత్రం న్యాయము, పరోపకారము వీటినిమిత్తం శ్రమపడి విజయం సాధించగలుగుతారు. ఏకే

హించగలుగుతారు. మన్యమనస్క మనస్సును నిరుత్సాహము, విరక్తి తోచగలవు. కాని అంతలోనే మనస్సును నిలత్రొక్కుకుని మీ ప్రయత్నాలను కొనసాగించగలుగుతారు. మీ స్వకీయ వృత్తివ్యాపారాదులయందు ఉత్సాహంతో పనిచేయలేకపోతారు. మీ ఆరోగ్యమూ, కుటుంబంలోని వారి ఆరోగ్యమూకూడా కొంత అసంతృప్తికరంగా ఉంటుంది. సంచారము, శ్రమ విశేషంగా కనుపిస్తున్నా మీ పట్టుదలతో అన్నిరంగాలలోను అనుకూలం పొందగలుగుతారు. దుబారాఖర్చులు పెరగకుండా చూచుకోండి. 26, 27 తేదులలో వృత్తిలో అభివృద్ధి, గొప్పవారితో మైత్రి, అకస్మాత్తుగా ఆరోగ్యంలో మార్పు.

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

శ్రమపడి అభివృద్ధి సాధించుకోగల శక్తి, ఓర్పు కలిగి ఉత్సాహంతో ముందుకు పోగలుగుతారు. అసూయాపరులు మిమ్ములను గురించి అపవాదులు కల్పించినా, వాటివల్ల మీకు ఎంతమాత్రం ఇబ్బంది కలుగదు. సమయానుకూలంగా ఉండి శత్రువులను సాధించగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో క్రొత్త విషయాలు అనుభవంలోకి వస్తవి. మీ ఆరోగ్యంలో మార్పు కనిపిస్తుంది. ఆహార విహారాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం. ఇతరులు తమలో తాము కలహించుకుని చివరకు మీమీదనిందమోపడానికి ప్రయత్నించవచ్చు. కుటుంబంలో ప్రశాంతత లోపిస్తుంది. వారం ఆరంభంలో ధనాదాయం సామాన్యంగా ఉన్నట్లు కనుపిస్తుంది. కాని క్రమక్రమంగా వృద్ధిఅవుతుంది. పిల్లలమూలంగా ఆనందం, సౌఖ్యం లభిస్తవి. వృత్తి ఉద్యోగాలలో మీ మాటకు విలువ పెరుగుతుంది. సాటి వారిలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకుని నిశ్చింతగా కాలం గడుపగలుగతారు. కఠినమైన పనులుకూడా ఈ సమయంలో సులభంగా నెరవేరగలవు. 29, 30, 1 తేదులలో ఖర్చులు విలాసవస్తువులు కొంటారు.

**వృశ్చికం :**

**(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

అందరితోను అనుకూలంగావుండి ప్రశాంతంగా మీ కార్యం సాధించుకొని అపకీర్తి రాకుండా కాపాడుకోగలుగుతారు. ముందుగా పైనపెట్టుకొన్న కార్యభారం వల్ల మనస్సుకు ఆందోళన అధికంగా ఉంటుంది. కాని మీరు ఊహిస్తున్నటువంటి చిక్కులు ఏమీ ఉండవు. కుటుంబంలోనివారివల్ల మీకు యేవిధంగాను శాంతీ, సౌఖ్యము లభించవు. గాని బాహ్యవిషయాలలోమాత్రం మీ ప్రయత్నాలకు ఆటంకాలు తొలగిపోయి పదిమందిలో మాట దక్కించుకోగల అవకాశాలు లభిస్తవి. ఇంతకుముందు మీరు ఎవరినిగురించి ఆందోళనపడుతున్నారో వారే ఈ వారంలో మిమ్ములను ఆదరించి సహాయం చేస్తారు. ప్రయాణాలు చేయవలసివస్తుంది. ఈ సమయంలో అధిక ధనాదాయమార్గాలను గురించిన ఆలోచనలు, ప్రయత్నాలు ఆరంభమవుతవి. వృత్తి, ఉద్యోగాలలో మీ ధర్మాన్ని మీరు చక్కగా నిర్వహించుకునే పైవారివల్ల గౌరవం, సహాయం పొందగల్గుతారు. శక్తికిమించిన పనులకు పోవద్దు. 25, 26, 27 తేదీలలో సాటివారిలో గౌరవం, శుభవార్తలు.

**ధనుస్సు:**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

ఈవారం మీరు మీ శక్తికి తగినంతవరకే భారం వహించటం మంచిది. కాని ఆడంబరం నిమిత్తం పాటుపడటంవల్ల పశ్చాత్తాపపడవలసి వస్తుంది. మిమ్ములను పొంగించి ముందుగా సాహసకార్యాలకు దింపి వెనుకనుంచుని వేడుకచూచే మనుష్యులు తటస్థపడతారు. ఈ సమయంలో ఉద్రేకాన్ని తగ్గించుకోవటం అవసరం. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. ఖర్చులుమాత్రం అధికంగా చేయవలసివస్తుంది. వృత్తిఉద్యోగాలలో శ్రమ కనుపిస్తుంది. కొన్ని సమయాలలో ఇతరుల సహాయ సంపదల నిమిత్తం ఎదురు చూడవలసివస్తుంది. తాత్కాలికంగా అదృష్టం కలసివస్తున్నట్లు సూచనలు కనుపిస్తవి. కాని యథార్థంగా అనుకూలించే అవకాశాలు తక్కువ. మీ శ్రమకు తగిన ఫలితం ఉంటుంది. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. లోగడ మీరు ప్రతికూలం అవుతవని అనుకుంటున్న వ్యవహారాలలో తలవని తలంపుగా విజయం లభిస్తుంది. అధికారులతో స్నేహం లభిస్తుంది. సంఘ కార్యాలలో ప్రవేశించటంవల్ల మీ స్వంతపనులకు ఆటంకం కలిగే సూచనలున్నవి. 30, 1 తేదులలో సంచారం, ఖర్చులు, కార్యసిద్ధి.

**మకరం:**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఈ సమయంలో మీ హోదా పెరుగుతుంది. ఆదాయం కూడా బాగుంటుంది. మీ వృత్తి ఉద్యోగాలలో సాటివారివల్ల గౌరవం, అభివృద్ధి లభిస్తవి. ఇంతకుముందు మీరు చేస్తున్న యోచనలు నిరాటంకంగా కార్యరూపం పొందగలవు. అనేక సందర్భాలలో ఉంటున్న చిన్నచిన్న పేచీలు క్రమక్రమంగా తొలగిపోయి మనశ్శాంతి లభిస్తుంది. మీ ఆరోగ్యం కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యప్రయత్నాలు ప్రస్తుతం నెరవేరవు. మీ సహాయం నిమిత్తం ఎదురుచూచే మనుష్యులు ఉంటారు. అయితే ముందుగా మాట ఇవ్వటంవల్ల సమయంలో చిక్కులు పడతారు. ఆస్తి వృద్ధిపరచుకునే ప్రయత్నాలు ప్రస్తుతం అనుకూలించవు. బంధుమిత్రులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి ప్రయాణసూచనలున్నవి. ఇతరుల నిమిత్తం మీరు చేసే ప్రయత్నాలు సిద్ధించగలవు. ఇతరుల వ్యవహారాలలో మధ్యవర్తిత్వంవంటి పనులకు పోవటం మంచిదికాదు. 27, 28, 29 లలో పుణ్యకార్యాలు, పడమరదిక్కునుంచి లాభకరమైన వార్తలు.

**కుంభం:**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఈవారం మీకు పరీక్షాసమయంగా కనుపిస్తుంది మనస్సులో అనేక ఆలోచనలు. ఒకరికి అనుకూలంగా మాట్లాడితే మరొకరికి కోపం వస్తుంది. మిమ్ములను ఆశపెట్టి కొన్ని అక్రమమైన పనులకు దింపటానికి ప్రయత్నాలు చేస్తారు. ఏపని చేయటం, ఏపని మానటం అనేది పెద్ద సమస్యలా ఉంటుంది. కాని చివరకు ధైర్యంతో ఒక నిర్ణయానికి వచ్చి కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. ఆదాయం పెరుగుతుంది. మితిమీరిన పరోపకారాలవల్ల మీ స్థితికి భంగం రాగల అవకాశాలున్నవి వ్యాపార విషయాలలోను, వ్యవహారరంగంలోను నిష్కర్షగా ప్రవర్తించగలుగుతారు. అందువల్ల మొదట్లో కొంతమంది మనస్సుకు బాధ కలుగుతుంది. కాని పర్యవసానంలో మీకు మీతోటివారికికూడా సంతృప్తికరంగా ఉంటుంది. మీ కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. ముందు ముందు విశేషంగా లాభించగల పనులకై ధనవ్యయం చేస్తారు. మహాత్ములు, పండితులు మొదలయినవారి దర్శనం, పరిచయం లభిస్తుంది. 28, 29 తేదీలలో అదృష్ట సూచనలు. సులభంగా కార్యసిద్ధి, దైవకార్యాలు.

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీరు చాలారోజులనుంచి ఎదురుచూస్తున్న పనులు ఒకరూపం పొంది మీ ఆందోళన తగ్గుతుంది. బంధువర్గంలోనివారు ఒకరిద్దరు మీతో విరోధిస్తారు. అంతమాత్రంచేత విచారపడవలసిన అవసరంలేదు. ధనవిషయంలో ఇంతకుముందు వచ్చిన పేచీలు తగ్గిపోతవి. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. వృత్తిలో మీరు ప్రయత్నించే ప్రతిపనీ సుఖంగాను, ఉపయోగకరంగాజరిగి సాటివారిలో ఉన్నతస్థితిని పొందగలుగుతారు. ఇతరులతో కలసి చేస్తున్న పనులలో చిక్కులు, అభిప్రాయభేదాలు రాగలసూచనలున్నవి. కోర్టు కచేరిలలో ఇంతకుముందుకన్నా ధైర్యస్థైర్యాలు లభిస్తవి. మీ శ్రమకూ, ధనవ్యయానికి తగినఫలితం కనుపిస్తుంది. ఇతరులుమిమ్ములను స్తోత్రపాఠాలతో ఉబ్బించి గౌరవిస్తున్నట్లు కనుపిస్తారు. కాని మీరు మాత్రం తొందరపడి కార్యభారం పైనపెట్టుకోవద్దు. 25,26 లలో భార్యకు అనారోగ్యం, తోటివారితో పేచీలు, వృథాశ్రమ.



# నాకు నచ్చిన కథ

నాకు వర్షంవచ్చిన రోజున ఎంతో సరదా. ఒకసారి మా స్కూలుకి ఆదివారం శెలవు వచ్చింది. ఆ నేళ ఆకాశం మబ్బుపట్టి చీకటి పడ్డట్టుగా ఐపోయింది. మావయ్యని మంచి కథచెప్పమని అడగడానికి మావయ్య గదిలోకి వెళ్ళేను. మావయ్య చాలా బాగా బొమ్మలు వేస్తాడు. నేను వెళ్ళేటప్పటికి నీలంగా మబ్బులువేసి కింద తోటలో అందమైన నెమలి నాట్యం చేస్తున్నట్లుగా బొమ్మ వేసేడు.

ఏం తోచడంలేదు మంచి కథ చెప్పు మావయ్యా అని అడిగేను. నీకు ఎలాంటి కథలు నచ్చుతాయిరా అన్నాడు ఇదివరకు కోళ్లు కెక్కరిస్తాయి, కప్పలు బెకబెకమంటాయి, నాగస్వరం వాయిస్తే పాములు ఆడుతాయి ఎందుకో తెలుసా అంటూ కథలు చెప్పేవుకదూ. అలాంటిదే ఈసారి మేఘం పట్టినప్పుడు నెమళ్లు ఎందుకు నాట్యం చేస్తాయో చెప్పు మావయ్యా, నాకు అలాంటి కథలే నచ్చుతాయి అన్నాను. అప్పుడు మావయ్య నాకీ కథ చెప్పేడు.

పూర్వం సప్తస్వర నగరాన్ని రాజధానిగా చేసుకుని భూపాలుడు అనే రాజు పాలిస్తూండేవాడు. అతని కాలంలో ఆ రాజ్యంలోని ప్రజలందరికీ సంగీతమంటే చాలా యిష్టం అందరూ సంగీత విద్వాంసులే. సరస్వతిని దేవతగా పూజించేవారు. రాజుగారి పేరే భూపాల అనే ఒక రాగం. మంత్రి నాటామాత్యుడు. రాణి పేరు కల్యాణి, రాజకుమారుడు వసంతుడు. ఈ విధంగా రాజ్యమంతటా బిలహరి, ముఖారి, గౌళ, కల్యాణి, కాంభోజి ఇలాగ పేర్లు పెట్టుకొనేవారు.

ఆ రాజుగారి కుమారుడు వసంతుడికి కూడా చిన్ననాటినుంచీ

దువ్వూరి వెంకటసత్య సూర్యనారాయణమూర్తి

సంగీతమంటే చాలా ఇష్టం. చాలా బలపరాక్రమాలు ప్రదర్శించేవాడు. తండ్రితో వేటకుపోయేవాడు. సరస్వతి కటాక్షంవల్ల రాణిగారి కోరిక ఫలించి ఒక కుమార్తె కలిగింది. రాణిగారి ఆనందానికి అంతులేదు. ప్రజలందరూ ఆనాడు పండుగ చేసుకున్నారు. దేశమంతటా గానసభలు జరిగేయి. సంగీత రూపకాలూ,




భరతనాట్యమూ ప్రదర్శించేరు. అప్పటికి వసంతుడు పదేళ్ళవాడు. చెల్లెలిని చూసుకుని మురిసిపోయేడు. ఆ పిల్లకి నామకరణ మహోత్సవంనాడు పురోహితులు చక్కని రాగంతీస్తూ మంత్రాలు చదివేప్పటికి ఏడుపుమాని శ్రద్ధగా వినేది ఆ పిల్ల. సభలోని గాయకులలో మలహరి రాగాలాపన చేస్తున్న గాయకుడిమీద అభిమానం పెరిగింది ఆ బాలికకి. అతను ఎత్తుకుంటే చక్కగా అతని పాట వినేది. ఇది చూచి రాజదంపతులు మలహరి అని నామకరణం చేసేరు రాజకుమార్తెకు. రాణి కల్యాణిదేవి ప్రత్యేకించి ఒక సంగీతభవనం వుంది. అది నాలుగంతస్తులు కలది. అందులో చాలా గదులు వాయిద్యాలు వుంటాయి. ఒక గదిలో సంగీతశాస్త్రానికి కావలసిన అన్ని గ్రంథాలూ వుంటాయి. కల్యాణిదేవి సంగీత సాధన చేసేప్పుడు మలహరి దగ్గర కూర్చుని వినేది. క్రమంగా వయస్సు పెరిగినకొద్దీ మలహరి సంగీతవిద్వాంసులవద్ద పాఠాలు నేర్చుకుని యుక్తవయస్సునాటికి విద్వాంసురాలైంది. అన్ని రాగాలలోనూ మలహరి రాగం ఆమెకి చాలా నచ్చేది. ఆమెపాట విన్నవారంతా ఆశ్చర్యపోయేవారు.

ఇరవైఅయిదు సంవత్సరాల వయస్సుగల వసంతుడు రాజ్యంలో అందరినీ మించిన బలశాలి అయాడు. వేటకి పరివారం లేకుండనే వెళ్ళేవాడు. క్రూరమృగాలని వశంచేసుకునేవాడు. కాని చెల్లెలు అయిన మలహరి అనినా, ఆమె గాత్రం అన్నా చాలా ముగ్ధుడయేవాడు. వేటకుపోయే సమయాన మలహరి పాట వినిపిస్తే వేట మాని ఆమె

సంగీతం వింటూ కూర్చునేవాడు. ఇది గమనించిన కల్యాణీదేవి క్రూర మృగాలున్న అరణ్యంలోకి ఒంటరిగా వెళతాడనే భయంచేత కుమార్తెను వేట సమయంలో సంగీతం సాధనచేయమని చెప్పింది. ఈ విధంగా వసంతుడి వేట వెనకబడింది.

ఒకనాడు మలహారి, గౌళ, సావేరి, దేవక్రియ, లలిత మొదలైన చెలికత్తెలతో ఉద్యానవనంలోని సరస్సులో జలక్రీడలాడుతోంది. అది వసంతుడికి వేటకు పోయే వేళ. ఆ సమయంలో చెల్లెలి పాట వినిపిస్తే ఆగేవాడు. లేకపోతే వేట తొందరలో ఆగేవాడుకాదు. ఆ వేళ అతను వేటకు బయల్దేరుతూండగా మలహారి పాట వినబడకపోవడంవల్ల వెళ్ళిపోయేడు. రాణి తొందరగా కబురు చేయగా మలహారివచ్చి పాట పాడింది. అప్పటికే వసంతుడు చాల దూరం వెళ్ళిపోయేడు.

వసంతుడు అడవిని ప్రవేశించి కనబడ్డ క్రూరజంతువులని చంపుతూ నిరాటంకంగా ప్రయాణం సాగించేడు. వేట సరదాగా సాగింది. ఇంతలో చీకటిపడింది. వసంతుడొక వెడల్పాటి చెట్టెక్కేడు. దూరాన వెన్నెలలో ఒక ఆశ్రమం కనిపించింది. చక్కటి సంగీతం కూడా చెవిన పడడంచేత వసంతుడక్కడికి వెళ్ళి ఒక అందమైనయువతిని చూసేడు. ఇంతలో మునీశ్వరుడు, ఆమె తండ్రి వచ్చి సంగతి తెలిసి ఆ రాత్రివేళ ఆహారంపెట్టి పక్క ఏర్పాటుచేసేడు. తెల్లవారినా అతడు ఆశ్రమం వదలలేకపోయాడు. కొంతకాలం అక్కడ ఆగేడు. మునికన్య అయిన మేఘరంజని యొక్క అందాన్ని చూచి ప్రేమించేడు.

వసంతుడి ప్రేమలో పడ్డనాటి నుంచీ మేఘరంజని తండ్రికి సపర్యలు చేయడం అశ్రద్ధ చేసింది. ఆయనకి సమిధలు తేవడం, పూవులు తేవడం, హోమానికి ఏర్పాట్లు చేయడం, సరస్సునుంచి నీళ్లు తేవడం మానివేసింది. కుమార్తెలో మార్పును గమనించిన ఆ మునీశ్వరుడు ఆమెను నెమ్మదిగా మందలించేడు. ఆయన ఎంత హితబోధ చేసినా ఆమె వసంతుని ప్రేమించడం మానలేదు. ఇది చూచి మునీశ్వరుడు చాలా కోపించేడు. అయినా తన కుమార్తెకు తగినవయసు కనుక అది సహజమే అనుకుని వసంతుడు, మేఘరంజనిని రెండు అందమైన నెమళ్ళుగా మార్చి స్వేచ్ఛగా వదిలివేసేడు. ఆ నెమళ్లు చక్కగా క్రేంకారాలు చేస్తూ ఆశ్రమప్రాంతంలో వుండేవి.

ఇది ఇలా వుండగా అక్కడ ఆమె కూడా అతడిని ప్రేమించింది. పిస్తూంటే ఆయువగుండె నీరయి రాజూ, రాణీ, మలహారి, రాజ్యప్రజలూ యువరాజు వసంతుడి గురించి ఆందోళన పడసాగేరు. ఒకనాడు రాజు పరివారంతో అడవికి పోయి గాలించి జాడ తెలియక తిరిగి వచ్చేరు. ఒకనాటి అర్థరాత్రి సమయంలో మలహారి ఒక సంచినిండా నవరత్నాలూ ముత్యాలూ మూటకట్టుకొని అన్నగారిని వెతుకుతూ బయలుదేరింది. ఎందుకైనా మంచిదని దారిలో రత్నాలు వేస్తూపోయింది. పోగా పోగా ముని ఆశ్రమానికి చేరుకొంది. ఒంటరి స్త్రీ అయిన మలహారిని ఆదరించి విషయం తెలుసుకున్నాడు ఆ మునీశ్వరుడు. తాను ఆమె అన్నను నెమలిగా మార్చినందుకు దుఃఖించేడు. ఆమె సోదరునికోసం విలపోయింది. ఇంతలో తెల్లవారింది.

వసంతుడు, మేఘరంజని నెమలి రూపంతో క్రేంకారంతో ఆశ్రమాన్ని సమీపించేరు. వాటిలో మగనెమలి మలహారి చుట్టూ తిరుగసాగింది. మునీశ్వరుడిక [illegible] ఆపుకోలేక ఆమెను చక్కటి వర్షమేఘంగా మార్చివేసేడు. అప్పుడు




"డాః త్వరగా—ఓ డజను కేపులివ్వు!"

చిత్రం: డి. వెంకటరావు, నెల్లూరు.

ఆయుర్వేదౌషధములు.
శాస్త్రీయముగాను నమ్మకముగాను తయారుచేయు సంస్థ
వేంకటేశ్వర ఆయుర్వేదనిలయం.
చింతలూరు.
ఆలమూరు పోస్టు ★ తూర్పుగోదావరిజిల్లా.
ఆంధ్రదేశమందంతటను బ్రాంచీలు. ఏజన్సీలు కలవు.
హైదరాబాదు బ్రాంచి 112, సెంట్రల్ బ్యాంకి బిల్డింగ్సు.
సికింద్రాబాదు బ్రాంచి : 7-2-148 హిస్సామ్‌గంజి పాత పోలీసుస్టేషను ఎదుట

మెరయుచు పొంగే ఈనో
★ దేహములోని మలినములను పోగొట్టును
★ పుల్లదనము నిమ్మును
★ కడుపులకు స్వస్థత చేకూర్చును



గుణము కలిగిస్తూనే నవోత్సాహమును కలిగించును

ఈనో
'ఫ్రూట్ సాల్ట్'
త్రాగండి




'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిష్టరు చేయబడిన ట్రేడు మార్కులు

# నాకునచ్చినకథ

మగనెమలి పురివిప్పి చక్కగా కూస్తూ నాట్యం చేసింది. ఆడనెమలి కూడా నృత్యం చేసింది.

అక్కడ రాజదంపతులు కుమారుడు కుమార్తె కూడా దూరమవడంతో చాలా విచారించేరు. మరలా అడవికి బయలుదేరగా దారిలో రత్నాలూ, ముత్యాలూ మెరుస్తూ దారి చూపించేయి. వారందరూ ఆశ్రమానికి వచ్చి మునీశ్వరునివలన జరిగిన విషయాన్ని తెలుసుకుని దుఃఖించేరు. మునికూడా విచారించి వారిని ఓదారుస్తూ, "మీరు మలహారిరాగం ఆలాపించిననాడు మీ కుమార్తె నీలిమేఘమై దర్శనమిస్తుంది ఆకాశంలో. ఆ మేఘాలను చూచి మీ కుమారుడు వసంతుడు నెమలిరూపుతో పింఛంవిప్పి నాట్యం చేస్తూ కనిపిస్తాడు. ఈ విధంగా మీ మలహారి వసంతులు మీకు ప్రతి సంవత్సరానికీ కనిపిస్తారు" అని చెప్పేడు. ఈ కారణంవల్లనే ఇప్పటికీ గాయకులు వర్షఋతువులో మలహారిరాగం ఆలాపిస్తారు. మేఘాల్ని చూడగానే నెమళ్ళు పురివిప్పి ఆడతాయి.

మావయ్య ఈ కథ చెప్పి తాను వేసిన బొమ్మ చూపిస్తూ "చూడు పైన మేఘాలు, కింద డాన్సు చేస్తున్న నెమలి" అన్నాడు—"ఎందుకో తెలుసా?" అంటూ మావయ్య చెప్పే కథలు అంటే నాకు చాలా ఇష్టం. ఇలాంటికథలే నాకు నచ్చిన కథలు. ఎవరు కథ చెప్తారని తెలిసినా ఏయే జంతువులూ పక్షులూ ఏమేమి చేస్తాయో అలాగెందుకు చేస్తాయో వివరించే కథలు చెప్పమంటాను. ★

# ప్రాణస్నేహితులు

నేను మూడవ ఫారం చదువుతుండగా జరిగిన సంఘటన యిది. అప్పుడు సుధీర్ బాబూ, బాలూ అనే మిత్రద్వయం చదువుతుండే వారు. సుధీర్ బాబు మావూరి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు ప్రకాశంగారి కుమారుడు. కాని బాలూ ఒక బీద కుటుంబానికి చెందిన రంగప్ప కొడుకు. ఇద్దరూ మంచి తెలివి తేటలూ, త్యాగగుణం కలవారు.

బాలూ పుస్తకాలు కొనడానికి కూడా డబ్బు లేని పరిస్థితిలో ఉన్నాడు. ఆనాడు ఇంగ్లీషు టీచరు పుస్తకంలేకుండా వచ్చినందుకు బాలూను బయటకు గెంటివేశారు. తనమిత్రుని స్థితిచూసి సుధీరుకి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. బడి వదలిపెట్టగానే సుధీరు పరుగెత్తుకుంటూ వెళ్ళి బాలూ చేయిపట్టుకొని "బాలూ! నీవేమీ భయపడవద్దు. రేపు ప్రొద్దునకల్లా నీకింగ్లీషు

**కొండూరు రాఘవప్రసాద్**

పుస్తకం కొనితెస్తాను. ఈరోజు రాత్రికి నా యీ పుస్తకం చదువుకో" అని చెప్పి తన యింగ్లీషు పుస్తకం బాలూకు ఇచ్చాడు.

వెంటనే తాను ఇంటికి వెళ్ళి తన పర్సుతీసి చూసుకోగానే దానిలోని రెండురూపాయలూ తాను నిన్ననే ఖర్చుపెట్టినట్లు జ్ఞాపకంవచ్చింది. వాళ్ళ నాన్న సుధీరుకు ప్రతినెలా ఐదురూపాయిలు స్వంత ఖర్చుకి ఇచ్చేవారు. ఇప్పుడు సుధీరుకి బాలూకోసమై ఇంగ్లీషు పుస్తకం కొనడనికి రూపాయిన్నర ఎక్కడ నుంచి వస్తుంది? పోయి వాళ్ళ అమ్మను అడిగాడు. వాళ్ళమ్మ "నీకు ప్రతినెలా డబ్బుయిస్తుంటె యింకా కావాలా?" అని కసిరి కొట్టింది. పాపం సుధీరుకి ఏమి చేయడానికీ తోచలేదు. బాలూ స్థితి తలచుకొంటే కళ్ళ నీళ్ళు తిరుగుతున్నాయి. వాళ్ళ నాన్నను డబ్బు అడిగేందుకు ధైర్యంలేదు సుధీరుకి. ఆరాత్రి వాళ్ళ నాన్నగారు ఆఫీసు నుంచివచ్చి కోటు హాలులో తగిలించి భోజనానికి వెళ్ళినారు. సుధీరు కోటుజేబులో ఉన్న ఐదురూపాయల కాగితాన్ని చూచాడు. కాసేపు తటపటాయించి చివరకు తన

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**బాలల సంఘం**

[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ----

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : వయస్సు ----

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ----

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ----

* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ----

పాఠశాల పేరు : ----

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

ఆర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1959]

(సంతకము)

* వరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: 25-11-59 | ఈ దరఖాస్తు 28-11-59 నాటికి మాకు చేరాలి



# ప్రాణస్నేహితులు



మిత్రునికోసం దొంగతనంకూడా చేయ సమకట్టి, మెల్లిగా వెళ్ళి ఆ నోటుతీసి తన పర్సులో పెట్టుకొన్నాడు. కాసేపు పాఠాలు చదువుకొని పడుకున్నాడు. ఆ రాత్రంతా సుధీరుకి నిద్రేలేదు. ఒకవైపు దొంగతనం చేశానే అన్న భయం; మరొకవైపు బాలూకి పుస్తకం కొనియివ్వావచ్చుననే ఆనందం!

మర్నాడు ప్రొద్దునే బడికిపోతూ, దార్లో ఇంగ్లీషు పుస్తకం, ఒక మంచి కలం, నోట్సు పుస్తకాలు కొన్నాడు. ఆరోజు ఉదయం బాలూ సుధీరుపుస్తకం తెచ్చి యిచ్చాడు. కాని టీచరు రానివ్వడనే భయంతో తనుమాత్రం ఇంటికి వెళ్ళబోయాడు. కాని సుధీరు తన సంచిలోంచి తన మిత్రునికై కొన్న పుస్తకాలను, కలాన్ని తీసి యిచ్చాడు. బాలూ కళ్ళు ఆనందంతో మెరిశాయి. కాని అసలు విషయంచెప్తే తీసుకోడనే భయంతో సుధీరు దొంగతనంచేసిన విషయం చెప్పలేదు. ఇద్దరూ క్లాసుకువెళ్ళి కూర్చున్నారు.

ఆరోజు ఉదయం ప్రకాశంగారు తనకోటుజేబులో ఐదురూపాయిల నోటు చూసుకుంటే, అది లేదు. వెంటనే భార్యను అడిగారు. ఆమె "నిన్న సాయంత్రం సుధీరు నన్ను డబ్బివ్వమని అడిగాడు. నే నివ్వనంగున వాడే తీసి ఉంటాడు" అన్నది. ప్రకాశంగారు సుధీరే తీశాడని నిశ్చయించుకొని త్వరగా ఆఫీసుకుపోతూ దారిలో స్కూలుకు వెళ్ళి హెడ్మాష్టరుగారితో సుధీరు విషయం చెప్పి, "మీరు వాడిని సరిదిద్దాలి." అని కోరారు. వెంటనే హెడ్మాష్టరుగారు కోపంతో మా క్లాసులోకి వచ్చి సుధీరుని పిల్చి "సుధీర్! ఇప్పటినుంచే దొంగతనం కూడా నేర్చుకున్నావా? మీ నాన్నగారి కోటుజేబులోని ఐదురూపాయిల కాగితాన్ని నీవు తీసింది నిజమేనా?" అని గర్జించారు. సుధీరు వెంటనే తన తప్పును ఒప్పుకున్నాడు. హెడ్మాష్టరుగారు మండిపడుతూ కేకలేస్తూ బెత్తంతో సుధీరుని కొట్టనారంభించారు. దెబ్బంటే ఎరుగని సుధీరు బిగ్గరగా ఏడ్వనారంభించాడు. పాపం వళ్ళంతా కందిపోయింది. ఇదంతా చూస్తున్న బాలూ అసలు విషయం అర్థంచేసికొని తన స్నేహితుడు తనకోసం దెబ్బలుతినడాన్ని సహించలేక ధైర్యంగా నిలబడి హెడ్మాష్టరుగారితో "మాష్టారూ, ఆగండి! సుధీరు నిరపరాధి. నా కింగ్లీషు పుస్తకం లేక టీచరుగారు తరిమివేయగా సుధీరు వాళ్ళ ఇంట్లోనుంచి డబ్బు తెచ్చి నాకు పుస్తకాలు, కలం కొనిచ్చాడు. తప్పంతా నాదే!" అని అరిచాడు.

అది విని హెడ్మాష్టరుగారు కొంచెం శాంతించి సుధీరు నోదార్చి అసలు కథంతా తెలిసికొన్నాడు. వారి త్యాగగుణాన్ని, మిత్రప్రేమను చూచి హెడ్మాష్టరుగారు ఆశ్చర్యపోయారు. ఆయన యిద్దరినీ దగ్గరకు తీసికొని వారి త్యాగగుణాన్ని మాకందరికీ ఆదర్శంగా చూపిస్తూ, వారిని మెచ్చుకొన్నారు. హెడ్మాష్టరుగారు సుధీర్‌కు, బాలూకు చెరి ఐదురూపాయిలూ బహుమానంగా యిచ్చారు. వెంటనే సుధీరు ఇంటికివెళ్ళి తన కిచ్చిన ఐదు రూపాయలను వాళ్ళ నాన్నగారికిచ్చేశాడు. వాళ్ళ నాన్నగారు సుధీరు వెనుకనేవచ్చిన హెడ్మాష్టరుగారివల్ల కథంతా తెలిసికొని తాను కూడ వారిద్దరికీ చెరి ఐదురూపాయలు బహూకరించారు.

ప్రాణస్నేహితుల త్యాగబుద్ధిని, మిత్రప్రేమనే మనంకూడా అనుసరిద్దాం!




ఇన్‌ఫెన్‌టోన్

గ్రైప్ వాటర్

క్షణ నివారణకు

పశిబిడ్డలకు దివ్యమైన గ్రైప్ మిక్స్చర్. కడుపు నొప్పి. పళ్ళు వచ్చుచున్నప్పుడు, కడుపులో వాయువుపట్టి, కలిగే జబ్బులను తక్షణం నివారించును. పశిబిడ్డలను ఆనందంగాను ఆరోగ్యంగాను వుంచును. 40 ఏళ్లకు మించి బాగుగా ప్రసిద్ధయివున్నది.

నిర్మాతలు:
హైదరాబాద్ కెమికల్స్ అండ్ ఫార్మసుటికల్ వర్క్స్ లిమిటెడ్.
హైదరాబాద్-దక్కన్.



# ★ జీవనరాగం ★

(31-వ పేజీ తరువాయి)

వచ్చుళ్ళావున్వేవా?! అన్నాడు ముతాలో ఒక నిడుపాటి పడుచు వీరుడు.

జీవితంలో జానపద చిత్రచ్ఛాయలు జొరబడ్డ రఘూ 'అవునవును' అన్నాడు ఆశగా.

'అరే - ఈ దుడిని నా గుట్టకాడ దిగ బెట్టిరారా' అన్నాడు నాయకుడు.

ముతాలోంచి పొడుగాటి వీరుడు బయటకి వచ్చాడు. కర్రలు చేతబట్టి బరబరా సాగిపోయింది దండు. రఘు తనలో తను వాళ్ల కట్టుకు, క్రమశిక్షణకు, ఉదారతకు, ఉపకారబుద్ధికి, హుందాతనానికి వేయి దండాలు పెట్టుకున్నాడు.

'నడుదొరా' అన్నాడు పడుచు వీరుడు.

వాళ్లు వచ్చిన వైపు తిరిగి 'ఇటు మీరెక్కడనుంచి వస్తున్నారు' అన్నాడు రఘు.

"మాది ఈపైన పడి ఐమూల్న పోతే సెంద్రవంక కోనలో గూడెం" అన్నాడు వీరుడు.

మళ్ళీ అడిగాడు రఘూ చనువు తీసుకుని 'ఆ యెత్తుగా ఉందే - ఏది అక్కడ భూమి ఎత్తుగా లేదూ, ఆపైన పోతే ఏముంది?

'పెద్ద కోనుంది దొర! సాలా పల్లంగా లోతుకుపోతాది' అన్నాడు మళ్లా వీరుడు.

అప్పుడు రఘూకు అర్థమైంది. వాళ్లు పల్లంలోంచి ఎత్తుకెక్కుతూ వస్తుండటంవల్ల భూమిలోంచి పుట్టుకువచ్చినట్లు కనిపించిన విషయం.

మెల్లిగా దారితీశాడు రఘు. "సరేగాని నేను వచ్చానని నీకెట్లా తెలిసింది ఆ గుడిసెలోకి?" ప్రశ్నించాడు.

'ఓ అదే తెలీదిట్లా-మొన్న మునిమాపున గూడెం తిరిగిపోతుంటే గుడిసెలో యెలుగ్గనిపిచ్చింది - ఎవరో వచ్చుంటారని అనుకున్నా—' అన్నాడు వీరుడు.

'గూడెంనుంచి ఎక్కడకు పోతున్నారు మీరంతా-' రఘు అడిగాడు.

పడమటికోనలో వేటకి పోతున్నట్లు తెలుసుకున్నాడు. వాళ్లంతా కొండజాతి సుగాలీలనీ బోధపడిందతనికి, కుందేళ్లు, లేళ్లు జింకలు వేటాడి తిరిగి సాయంకాలం ఇల్లు చేరుకుంటారని, రానుపోను పదిమైళ్ళదూరం రోజూ వచ్చిపోతారని రఘూ గ్రహించాడు.

ఎన్నెన్నో సరదాగా విషయాలన్ని చెబుతూ కుటీరం దగ్గర రఘూను దిగవిడిచాడు వీరుడు. సంతోషంతో ఒకరూపాయి జేబులోంచి తీసి యివ్వబోయాడు రఘూ—మోచెయి అడ్డంతిప్పి నిరాకరించాడు వీరుడు. 'కట్టంచెయ్యందేకానీ ముట్టందొరా' అన్న వీరుడిమాటకు రఘూ మెచ్చుకున్నాడు. ఇదుగో నీ పేరడగటం మరచాను అన్నాడు రఘు.

"రాజులు" అన్నాడు వీరుడు. నిజానికి అతనిలో రాజులు శివితో మూర్తీభవించారనుకున్నాడు రఘూ. మునిమాపున కనపడతావా అన్నాడు రఘు.

అంగీకారం వెల్లడించి పిక్కబలంతో పిట్టలా రివ్వున వెళ్ళిపోయాడు రాజులు.

సాయంకాలం కావడంతో కొండకోనల్లో రఘూ జీవితం మరొక్క దినం గడిచింది. అస్తాద్రి మూపురం పైకి చేరుకుంటున్న సూర్యుడు జీవిత వేదాంతం తెలిసిన తాత్వికునిలా హసిస్తున్నాడు.

పడమటిదిశన సూర్యుని నడినెత్తిన పొడిచిన కారుమబ్బు తెన్ను కావిరంగులో మెరుస్తున్నా కడుపంతా నల్లగా ఉంది. దేహం కావిబట్టతో కప్పినా కాలుష్యం మనస్సులో కాపురంచేసే కుహనాయోగిలా ఆ కారుమబ్బు నిర్లిప్తంగా ఆకాశంలో వేలాడుతున్నది.

'దొర' ఎవరో పిలిచారు. చల్లగాలికి బయట కూర్చుని దిగంత విశ్రాంత సౌందర్యం ఆలకిస్తున్న రఘు విస్మయంగా చూశాడు. అరుణకాంతుల్లో ప్రతిఫలిస్తున్న సుగాలీ వీరుడు రాజులు నవ్వుతూ వంగి దణ్ణం పెట్టాడు.



చిత్రం: బి. వి. సత్యమూర్తి, రామచంద్రపురం

వెంకన్నతో చెప్పి రఘు రాజులుతో బయలుదేరి కులాసాగా నడచిపోసాగాడు. రాజులువాళ్ల చంద్రవంక కోనచూపిస్తానని రఘూను ప్రొద్దున వాళ్లు కలుసుకున్న గుట్టలమీదకు తీసుకువెళ్లాడు.

శ్యామాయమానమై గంభీరంగా విశ్వచిత్రకారుని అలేఖ్య చిత్రలేఖనంలా కన్నుల గట్టిన ఆ కోన చూడగానే రఘు మనస్సు ఉల్లోలమైంది. ప్రకృతిసౌందర్యం ముందు వినశ్వరమయిన పట్టణ సౌందర్యం ఎంత అల్పమో, అసహ్యమో అతనికి ద్యోతకమైంది. ప్రకృతి మాత ఒడిలా ఉన్న ఆ కోన రఘూను ఆహ్వానిస్తున్నట్లున్నది.

ఇక్కడ పుట్టిపెరిగి, ఈ తల్లి ఒడిలోనే తలదూర్చుకొని బతికే సకల జీవరాశీ ఎంత ధన్యమైనది! ఇక్కడ క్రూరజంతువులు సైతం ఎంత అదృష్టవంతమైనవి! సంభ్రమానందతుందిల హృదయారవిందుడై రాజులు భుజం తట్టి, వస్తున్న ఆనందావేశాన్ని గుటక మింగుతూ 'ఎంత అందమైందోయి మీకోన!' అన్నాడు రఘూ. ఆ సమయంలో వేయి జన్మలు పులకించి కవితలు మొలకెత్తగల చల్లని గాలి ఆ కోనలోంచి విసురుగా రఘూకు తాకింది.

రఘూకు వెంటనే ఒక సందేహం వచ్చింది. ఇంత లోతుగా అగాధంలా ఉన్న కోనలోకి ఎట్లా దిగి వెడతారు. ఈ సుగాలీలంతా అని. రాజులు నడిగాడు.

"మాకు డొంకలుంటయ్ దొర. ఈ ఐమూల్న నడి పోతినంటే మసకచీకటి కింటికి జేర్తా" నన్నాడు రాజులు.

రఘుకు ఆ కోన చూడాలని, రాజులుతో వెళ్ళి తిరిగిరావాలని కొండంత ఆశ ఉన్నది. కాని వెళ్లడం రావడంకూడా గండాలే. మనస్సు ముందుకు దూకుతున్నా కాళ్లు వణకి వెనకాడుతున్నాయి.

పెద్ద ముత్తయిదువు భూమాత నుదుటన తిలకంలా అరుణ సూర్యుడు అందగించాడు. చుట్టుపట్ల నీడలు పెరిగి మసకచీకట్లుగా అలుముకొంటున్నాయి. ముచ్చటగా మలుపులు తిరిగిన కృష్ణాస్రవంతి కోనలోంచి కొండల్లోంచి ఎక్కడో లోతున పరుగు తీస్తోంది.

"రాజులు! మీ కోన నాకు చూపిస్తావా" అన్నాడు రఘూ.

'రా దొరా' అన్నాడు రాజులు కళ్లతో ఆహ్వానిస్తూ.

'వస్తాను సరే—మళ్ళీ యింటికెట్లా రావడం. చీకటిపడిపోతోంది —' రఘు ప్రశ్నించాడు.

(సశేషం)

సౌందర్య
రహస్యపు
చర్చ . . .

గడచిన పాతిక ఏళ్లాయి తల్లులు వారి కేశముల
అందమునకు కారణము తాతావారి పెర్‌ఫ్యూమ్డ్ కోకొనట్
హెయిర్ ఆయిల్ అనే రహస్యమును కుమార్తెలకు
చెబుతూ వస్తున్నారు. ఆహ్లాదకరమైన పూల పరిమళముగల
యీ శుద్ధమైన కొబ్బరి నూనె మీ కుమార్తెల
కేశములను కూడ ఎంతో సొగసుగ ఉంచుతుంది!




తాతావారి పెర్‌ఫ్యూమ్డ్
కోకొనట్ హెయిర్ ఆయిల్

ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# హరివంశం

(19-వ పేజీ తరువాయి)

పిలుస్తూ వచ్చాడు.

"ఒకసారి నేను ఉదధిజలాల్లో మునిగి వుండగా, భగవంతుడు వరాహరూపం ఎత్తి పేర్చిన ఒక్క కోరతో నన్ను పైకి ఎత్తాడు. ఇంకోసారి మొదట వామనుడై, బలిని దానం అడిగి, తర్వాత త్రివిక్రముడై, ఒక కాలితో నన్ను ఆక్రమించుకున్నాడు. ప్రభువు నాయందు ఎప్పుడూ దయతప్పి చరించలేదు. ఆయన శంఖకౌమోదకీచారుహస్తుడు. నత విధేయుడు. నాకు నాథుడు. అనాథులకు నాథుడు. విష్ణుడు. ప్రభవిష్ణుడు. జగదేక విభుడు. నాకు ఎప్పుడూ ఆయనే దిక్కు. ఇప్పుడుగూడా ఆయనే దిక్కనుకుంటున్నాను. బంగారం వున్నదంటే దానికి అగ్ని గురువు. తేజం వున్నదంటే, సూర్యుడు దానికి గురువు. అఖిల తారకాగణాలకు చంద్రుడు గురువు. నాకుమాత్రం ఎల్లవిధముల ముకుందుడు గురువు. నేను చరాచర భేద ప్రకటితమైన సృష్టిని యావత్తూ భరిస్తున్నానంటే, అందుకు విష్ణువే, నాకు ఆధారశక్తిని ప్రసాదించాడు.

"ఒక్కప్పుడు పరశురాముడు సర్వ క్షత్రియులోకాన్ని నిశ్శేషంగా వధించి, రుధిరమాంస దుర్గంధ దూషితను, పరుష విశీర్ణ కేశను, నన్ను, రజస్వలవలెవున్న దానిని కశ్యపునికి యజ్ఞదక్షిణగా ఇచ్చాడు. అప్పుడు నేను ఆ బ్రహ్మర్షిని "నాకు పతులైన రాజులందరు హతులైపోయారు. నేను విధవనై పాడుబారివున్నాను. నేను ఇంక ఓర్వలేను. నన్ను మళ్ళీ సనాథనుచేయగల శక్తి మీకు ఒక్కడికే వుంది. నాకు తగిన భర్తనుచూపించు" అని వినయంగా అర్థించాను. ఆయన నన్ను మనువుకు ఇచ్చాడు. నన్ను పాలించడానికి ఆ మనువు తన ఆత్మ వంశ్యులను పంపించాడు. మహా కులీనులు, ధీరులు, మునిజనసమ్మతాచారులు, శూరులు అయిన మనువువంశపు రాజులు నన్ను అనుభవించారు. వారంతా నాకోసం బ్రతికి నాయందే కైవల్యం చెందారు. ఇందులో మీరుఎరుగనిది ఏమీలేదు. కాని ఇప్పుడు ఈ రాజకులాలు అధికమై, నాకు భరించడం అశక్యం అవుతున్నది. ఆభారాన్ని మోయలేక కృశించిపోతున్నాను. దాన్ని ఏమాత్రమో తగ్గిస్తేనే నేను బ్రతికేది. ఈ పనికి ఒక్క విష్ణువే సమర్థుడు. ఆయన పూనుకుంటే, ఈపని అవుతుంది. పూనుకోకపోతే నా అదృష్టం అట్లావుంది అనుకుంటాను. చేయగలిగింది ఏమీలేదు. ఇప్పుడు ఇక్కడి పెద్దలు దుష్కరమైన ఈ కార్యాన్ని గూర్చి విచారించి, తగుప్రయత్నంచేస్తే సంతోషిస్తాను."

సభాసదులు భూదేవిచెప్పిన ఈమాటలు ఆలకించి, తమలో విచారించి, నిశ్చయించి, బ్రహ్మను సంబోధించి, ఇట్లా అన్నారు: ఈ దేవి ఇట్లా దుఃఖితయైపోగా మనకు వూరుకోవడం పాడికాదు. నీవు ఆదిభవుడివి. భువన ప్రాదుర్భావం నీవని. అందుచేత విష్ణువు, మహేశ్వరుడు, విశాఖుడు, సూర్యుడు, వాయుదేవుడు, అగ్ని, బృహస్పతి, విశ్వులు, రుద్రులు, అశ్వనులు, సాధ్యులు, యక్షులు, గంధర్వులు, రాక్షసులు, గరుడులు, నాగులు, కిన్నరులు, గిరిసరిజ్జలనిధులని పేరుపొందిన వీరియంతటి వారు, తమ తమ అంశాలతో భూమిమీద పుట్టేట్లుచెయ్యాలి. భూమిసురలలో, క్షత్రియులలో, యోనిజాలుగాను, అయోనిజాలుగాను, వీరికి జన్మలు కల్పించాలి. వారిసహాయంతో భూభారాన్ని నివారించడం మంచిది."

బ్రహ్మకు భవ్యులుచెప్పిన ఈ మాటలు బాగానచ్చాయి. "మీరు బాగా చెప్పారు. అట్లా చేయడమే బాగా వుంటుంది" అన్నాడు. అని వారికి ఇంకో విశేషాన్ని గూడా తెలియజేశాడు: పూర్వం ఒక సాయంత్రం వేళ కశ్యపుడు, నేను సముద్రం ఒడ్డున కూర్చుండి తత్వార్థగోష్ఠి చేసుకుంటున్నాము. మాట్లాడుకుంటూ మాట్లాడుకుంటూ వుండగానే, చంద్రుడు ఉదయించాడు. చంద్రోదయంతో సముద్రుడు ఉద్దాముడయ్యాడై, గంగాసంగమంవల్ల పొంగులెత్తి, ఆకాశాన్ని అంటే కెరటాలతో ఎగిరిపడుతూ, మేము కూర్చొన్నచోటికి వచ్చి, ఆ ప్రదేశాన్ని తప్పటమేగాక. మా పైకి గూడావచ్చాడు. మేము తడిసిపోయినాము. నాకు నవ్వూ వచ్చింది. కోపమూ వచ్చింది. నవ్వుతూనే "సముద్రుడా! శాంతించు" అన్నాను. సముద్రుడు శాంతించాడు. శాంతించిన వెంటనే అతని రూపం గూడా మారిపోయింది. అప్పుడు అతనికి తనుత్వం వచ్చింది. సముద్రపు నురుగు అతని కట్టుబట్ట అయిపోయింది. తరంగాలు భుజాలయినాయి. ముత్యములు, రత్నములు, ఆభరణాలైనాయి. అతని ఆ రూపం పరమ రాజన్య రూపంగా పరిష్కృతమైపోయింది. అప్పుడు నాకుముందు కార్యంస్ఫురించింది. స్ఫురించి సముద్రునితో ఇలా అన్నాను.

"నేను నిన్ను శాంతించు అన్నాను. నువ్వు ఆ శాంతించడంతోపాటు ఇట్లా శరీరధారిని గూడా అయినావు. చంద్రుడు ఉదయించి వెన్నెలలు వెదజల్లుతూ వుంటే, సింధురాజువు, నీవు, రాజాకృతి దాల్చి, నాముందు నీ రాజసాన్ని ప్రదర్శనం చేశావు. కాబట్టి నువ్వు ఇక భూమిమీద రాజువై పుడతావుగాక. నేను శాంతించు అనగా, తనుత్వం పొందావు గనుక, నీవు భూలోకంలో పుట్టినప్పుడు, నిన్ను అంతా శంతనుడు అంటారు. ఇప్పుడు ఎట్లో, అప్పుడు గూడా, గంగ నీకు భార్య అవుతుంది."

"నేను ఈ మాట అనేసరికి, సముద్రుడు చలించాడు. గంగాసమేతంగా సాకారుడై నాకు ప్రణామం చేశాడు." అయ్యా! పర్వకాలాల్లో, జలదపంక్తులతోడి వాయువు లేగిన సమయాల్లో, చంద్రుడు విజృంభించిన వేళల్లో, పొంగడం, తరంగాలు లేవడం, నాకు సహజం. అంతేగాని అందులో గర్వం ఇసుమంతా లేదు. ఇందుకు మీరు నాకు ఈ శాపం ఇవ్వడం తగునా?" అన్నాడు. ప్రసన్నుడవు కావలసిందని ప్రార్థించాడు.

"నేను అప్పుడు సముద్రునికి ఇట్లా చెప్పాను: సముద్రుడా! లోకహితం ఏమిటో ఆలోచించి నేను ఈ పని చేశాను. ఇందులో అపాయం ఏమీ లేదు. నువ్వు పవిత్రమైన భరతవంశంలో జన్మించి గంగయందు, వశిష్ఠశాప దగ్ధులైన వసువులను ఉత్పాదిస్తావు. అంతేగాక సత్యవతి అనే ఆమెను పెండ్లాడే, ఆమెవలన వంశకరులయిన పుత్రులను పొందుతావు. క్రమ్మర నీకు నిజస్వరూపం వస్తుంది. కాబట్టి నీకు ఈ విషాదం అనవసరం.

"సముద్రుడు చాలా సంతోషించినాడు. శంతనుడై ఉద్భవించిన తర్వాత అతనికి విచిత్రవీర్యుడు, ఆ విచిత్రవీర్యునికి ధృతరాష్ట్రుడు, పాండురాజు ఉద్భవిస్తారు. వారిలో పెద్దవానికి నూర్గురు సుతులు చిన్నవానికి ఐదుగురు పుత్రులు జన్మిస్తారు. ఈ ఇరుకులంవులవారికి రాజ్యాభిలాష మెండై ఒక్క మహాకలహం జరుగుతుంది. ఆ యుద్ధం ఘోరయుగాంతాకృతిని సాగుతుంది. భూలోకంలో రాజులంతా ఆ యుద్ధంలో ఇరుపక్షాలలోను చేరతారు. అన్యోన్యం పోరాటం సాగించుకొని నిహతులౌతారు. అప్పుడు ఉర్వీగల జనులుగూడా నాశనమైపోతారు. ద్వాపరయుగం అంతం అయిపోతుంది. భూమికి భారం తగ్గుతుంది. కలిఅంశం ధృతరాష్ట్రి పత్నియందు, యముని అంశం పాండురాజు పత్నియందు ప్రాదుర్భవం చెందుతాయి. తక్కిన దేవ రాక్షసాది అంశాలుకూడా ఉచితస్థానాలలో ప్రభవం పొందుతాయి."

పరమేష్ఠి ఈ మాటలు చెప్పగా విని సర్వ దివిజ సమాజము సంతోషించింది. ఆయన పనుపును దేవతలంతా అభినందించారు. ఆ సమయంలో నారదుడు అక్కడికి వచ్చాడు.

సశేషం.


కాంఫరాల్
బిళ్లలు
అజీర్ణవిరేచనములు, నీళ్లవిరేచనములు, కలరాకు అమోఘముగాపనిచేయును
అన్ని షాపులలో దొరుకును
కాంఫరాల్ లేబరేటరీ, పాలకొల్లు

# సంసారంలో సహకారం

భార్యాభర్తలిద్దరూ కూడా బాధ్యతల్ని పంచుకుని, కష్టసుఖాల్ని సమానంగా భావించి, పరస్పరానురాగంతోను, పరస్పర సహాయంతోనూ, యింటి అభివృద్ధికీ, పిల్లల అభివృద్ధికీ పాటుపడినప్పుడే వాళ్లు నిజమైన భార్యాభర్తలు- వాళ్లదే నిజమైన సంసారం.

కొంతమంది భార్యాభర్తలిద్దరూ సంసారమనే బండికి జోడెద్దులాంటి వాళ్ళనీ, రెండెద్దులూ సమానంగా కష్టపడితేనే గాని బండి సాగనట్లు, అన్యోన్యమైన సహకారం వుంటేనే గాని సంసారం నడవదనీ, అలా సహకారం లేనపుడు బండిలాగే సంసారం కూడా ఒడిదుడుకులకులోనై, బండిలా తోలాకొడుతుందనీ గ్రహించక, జీవితాలను పాడుచేసుకుంటూరు. కొందరుపురుషశ్రేష్ఠులు తమ భార్యలని ఒకసంపూర్ణమైనవ్యక్తిగా భావించక, వారు తమకూ, తమవారికీ కావలసిన పనులన్నీ చేసిపెట్టి, సేవలుచేసే ఒక యంత్రంలా పరిగణిస్తారు. ఇంటిపనులుచేయడం ఆమె బాధ్యతయనీ, తమకు వాటివిషయంలో జోక్యంలేదన్నట్లుగా భావిస్తారు. ఏ మగవాడైతే తనభార్య తనకు చాకిరీచేయడానికి మాత్రమే తగునని భావించకుండా, ఆమె నొకమనిషిగా గుర్తించి, ఆమెకూ యెన్నో ఆశలూ, కోరికలూ వుంటాయని గ్రహించి, అన్నీ కాకపోయినా యేస్వల్పమైన కోరికలనో తీర్చి, అది సాధ్యంకానపుడు కనీసం సానుభూతైనా చూపుతాడో, అతనిభార్య నిజంగా యెంతో కష్టపడినా కూడా, ఆ కష్టాలను మరచి భర్తని గౌరవించి, ఆదరిస్తుంది. అలా కానప్పుడే భార్యకు భర్తమీద ఒకవిధమైన నిర్లక్ష్యమూ, నిరాదరణా యేర్పడతాయి.

ప్రొద్దుటే, అంటే యే అయిదు గంటలకో లేచి, కాఫీకాయడంతో, నీళ్లుకాచడంతో ప్రారంభించి, పిల్లలకు స్నానాలు చేయించి, తొందర తొందరగా వంటపని ముగించి, బడికిపోయే బిడ్డల్ని, పనికివెళ్ళే భర్తనీ తృప్తిపరచి పంపించడం, ఆ తర్వాతమధ్యాహ్నం తీరికవేళల్లో యింట్లో అందరి బట్టలూ వుతికిపెట్టడం, మళ్లీ అందరూ యింటికొచ్చేటప్పటికి టిఫీనూ, రాత్రికి వంటా వగైరా పనులన్నీ చేసి, రాత్రి భోజనాలైన తర్వాత, అందరికీ పడకలువేసి యివ్వడంతో ఆఖరవుతుంది ఆరోజు కార్యక్రమం ఒక సామాన్య గృహిణికి. ఒకరోజో, రెండు రోజులో కాక జీవిత పర్యంతమూ యీ విధమైన కార్యక్రమాన్ని, యెలాంటి లోపమూ, విశ్రాంతీ లేకుండా చెయ్యడం మానవమాత్రులకు సాధ్యం కాదు. మధ్య మధ్య యేకొద్ది రోజులో, కాకపోతే కనీసం కొన్ని గంటలో అయినా, యీ యిల్లనే కూపంలోంచి బయటపడి తన కార్యక్రమాన్ని మరచి, ఆనందంగా గడుపకపోతే ఆ యిల్లాలి మనస్సు విసుగెత్తిపోతుంది. ఏదో

గౌరి

నిరాశా, నిస్పృహా ఆమెనా వరిస్తాయి. మునుపెంతో ప్రేమించే తన భర్త మీదా, బిడ్డలమీదా కూడా ఒక విధమైన జుగుప్స యేర్పడుతుందామెకు.

నాకు చాలా బాగా తెలిసిన కుటుంబం ఒకటుంది. ఆ గృహస్థు యేదో చిన్న వుద్యోగంచేస్తూ, కొంతవరకూ వ్యవసాయం చేయించి, తిండికీ, బట్టకూ లోపంలేనంత వరకూ సంపాదిస్తున్నాడు. ఇక ఆ యిల్లాలు యెముకలు పైకి తేలుస్తూ, అస్థిపంజరానికి బట్టలు వేసి నిలబెట్టినట్లుగా, ముప్ఫయి రెండేళ్ళకే ముసలి రూపంతో వుంది. ఇక వారికి పిల్లలు యేడుమంది. పెద్దకొడుకు పదనిమిదేళ్ల వాడు, ఆ తర్వాత పదిహేనేళ్ళ కూతురూ, యింక చిన్నపిల్లలు పిల్లలు మాత్రం బాగా కండపుష్టితో వున్నారు. ఇంతవరకూ బాగానే వుంది కాని ఆవిడకు మాత్రం సంవత్సరంలో యే వొక్క దినం కూడా ఆ యింటి పనులనుండి విముక్తి వుండేది సరి కదా, ఒక్క సినిమాకో లేక పేరంటానికో వెళ్ళేకూడా, తన పనులన్నీ, (ప్రతి చిన్న పనీ) చేసిపెట్టిగానీ వెళ్లడానికి వీల్లేదన్న మాట. ఆమెకు జబ్బుచేస్తే కూడా ఆ మాట వంతగా పట్టించుకోరు భర్తగానీ, పిల్లలుగానీ. ఇందుకు కారణం ఆ గృహస్థుకు భార్యంటే ఒకమనిషనీ, ఆమెకూ రోగాలూ అవీ వస్తాయనీ అభిప్రాయం లేకపోగా, ఆమె తనకూ, తన బిడ్డలకూ పరిచర్యలుచేయడానికి మాత్రమే నిర్దేశింపబడిందన్న అభిప్రాయం వుండడమే. బిడ్డలు కూడా అచ్చు తండ్రిపోలికే. వారికి తమతల్లి నిచూస్తే ప్రత్యేకమైనఆదరాభిమానాలు గానీ, ఆపేక్ష గానీ లేనే లేవు. కోడి కూయకముందే లేచి, స్నానానికి నీళ్లు కాచి, కాఫీ తయారుచేయకపోతే ఇల్లెగిరిపోయేలా కేకలేసి, కోపంతో యెక్కడికైనా వెళ్ళిపోతాడు భర్త. తను స్కూలుకు పొయ్యేటప్పటికి టిఫిను తయారుగాక ఒట్టి కాఫీ యిస్తే, కాఫీ ముఖాన్నే చల్లేస్తాడు పుత్రరత్నం. ఏడుగంటలకు నిద్రలేచి, స్కూలుకు టైమయినతర్వాత, తను వేసుకునివెళ్లే బట్టలకోసం వెతుక్కుని, ఉతకలేదని తల్లిని సాధిస్తూ, యేడుపు సాగిస్తుంది పదిహేనేళ్ళ పుత్రికామణి. ఇక చిన్న పిల్లలవిషయం చెప్పనేఅక్కర్లేదు. వాళ్లకి తిండీ, యేడుపూ తప్పించి మరేధ్యాస లే[దు]. భర్త ఎదురుగా పిల్లల్నేమైనా అంటే భర్తకి పట్టరానికోపం వస్తుంది. మళ్ళీ ఆ పిల్లల్ని గురించి ఎవరైనా ఏమైనా అన్నప్పుడు మాత్రం ఆయనే అంటాడు "పిల్లల్ని సరిగా పెంచడం తల్లికి వస్తేగదూ! వాళ్లు బాగుపడ్డానికి" అని. ఎప్పుడూ పాలిపోయినట్లుండే ఆమె ముఖమూ, లోతుకుపోయిన ఆమె కళ్లూ చూస్తే యెటువంటివాళ్ళకైనా "అయ్యో" అనిపిస్తుంది. కానీ ఆ యింట్లో వాళ్ళకిమాత్రం దయ కలుగదు. ఒక్కరూ ఒక్క పనిలోనూ ఆమెకు సహాయం చెయ్యరు సరిగదా, ఎవరిపనులు వాళ్ళుకూడా చేసుకోరు. భోజనాలుచేస్తే పళ్ళాలెత్తాల్సింది ఆవిడే. అందరికీ పడకలేసియివ్వడం ఆవిడ పనే. ఎప్పుడైనా ఆవిడకు జబ్బుచేస్తేకూడా ఆమె కార్యక్రమంమాత్రం మారదు. ఆమె పూర్తిగా చేతగానిస్థితిలోనికి వచ్చి, పడక వేసినానాడే ఆమె ఆరోగ్యం సంగతి గుర్తొస్తుంది ఆభర్తకూ, పిల్లలకూ అదికూడా తమ పనులు జరగడానికి ఆటంకం కలిగిందనేబాధతోనేగానీ, నిజంగా తన జీవితంలో పాలుపంచుకుని, కష్టాల్లో ఆదుకుంటూ, తనకోసం, తనబిడ్డలకోసం సర్వస్వాన్నీ త్యాగంచేసిన తన సహధర్మచారిణిగా ఆమె భర్త, తమను కనిపెంచి, తమకోసమై నిద్రాహారాలు మాని, తమనింత పెద్దవాళ్ళుగా చేసిన మాతృమూర్తియని బిడ్డలు

ఎప్పుడూ ఇంతే—9 శంకర్



బాధపడుతున్నారని అనిపించక మానదు. (ఈ విషయాలన్నీ కొందరికి అతిశయోక్తిగా తోచవచ్చుగానీ, ఆ కుటుంబాన్ని నేను స్వయంగా చూసిన దాన్ని కాబట్టి వ్రాస్తున్నాను.) ఆ ఇంట్లో అందరి హృదయాలూ ఎంతో స్వార్థంతో కరుడుకట్టినట్లుగా తోస్తుంది. కానీ ఆమెకు సహాయం చెయ్యకపోయినా, ఆమెను గురించి సానుభూతిపూర్వకంగా రెండుమాటలనే వాళ్ళు యెవరూలేక ఆమె మానసికంగా యెంతో బాధపడిపోతున్నట్లు అనిపిస్తుంది. ఆమెను చూస్తూంటే మాటిమాటికీ "బాబూ యీ ఆడజన్మ యెందుకు పెట్టావ్?" అనిపిస్తుంది.

ప్రపంచంలో అందరూ భర్తలూ, బిడ్డలూ యిలా వుంటారని నేననడంలేదు. ఇలా వున్న యే కొద్ది కుటుంబాలలోనో, నేను చెప్పిన కుటుంబం కూడా చేరివుంటుంది. అందరూ భర్తలూ, పిల్లలూ యిలాగే స్వార్థపరులైయుంటే యిప్పటికి స్త్రీజాతి హీనావస్థకు వచ్చివుండేది.

ఇంటిపనులు చెయ్యవల్సింది స్త్రీ బయట తిరిగి ధనార్జన చెయ్యాల్సింది పురుషుడు. ఇది ప్రకృతి సహజమే. అయితే జబ్బులో వున్నా, చేతకాకపోయినా, యింటిపనులు ఆమే చెయ్యాలనీ, ఆమెకు యింటిపనుల్లో సహాయం చెయ్యడం మగవారికి గౌరవభంగమనీ, అలాచేస్తే, ఆడవాళ్ళు చులకన చేస్తారనీ భావిస్తారు కొందరు సంస్కారం లేనివాళ్ళు. తనకు యింటిపనుల్లో చేతనైనసహాయం చేయడమేగాక సానుభూతి సూచకంగా రెండుమాటలు మాట్లాడితేనే యెంతో తృప్తిపడుతుంది స్త్రీ హృదయం. తన కోర్కెలు చీరెలూ నగలూ తెచ్చి యిచ్చినంత సంబర పడుతుందామె మనస్సు. ఆమె తన పనులన్నీ కూడా యెంతో ఆనందంగా చేసి, యింట్లోవాళ్ళని సుఖపెట్టడానికి ప్రయత్నిస్తుంది. తనభర్త తనకు యింటిపనుల్లో సహాయం చేసినంత మాత్రాన భర్తని చులకనచేసే స్త్రీ యెవరైనా వున్నదంటే ఆమె నిజంగా మూర్ఖురాలే.

"ఇంతపని నువ్వొక్కదానివే యెలా చెయ్యగలవ్? కాస్త సాయం. నేనూ వస్తున్నా" అనో లేక యిప్పుడాపని చేయకపోతే మునిగిపోయ్యేది లేదులే! కాస్సేపు కూర్చోరాదూ?" అనో భర్త అంటే, 'అమ్మా నీవొక్కదానివే అంతపనీ చెయ్యకు. నేను బడినుంచి వచ్చాక యిద్దరం కలిసిచేద్దాం అని కొడుకో, కూతురో అన్నారంటే ఆ గృహిణి ఆనందం వర్ణనాతీతం. అంతకుముందు విసుగుతో చేసే పనులన్నిటినీ, [illegible] ఆనందంగా, అవలీలగా చేస్తుంది. భర్తనీ, బిడ్డల్నీ అవ్యాజానురాగంతో, ఆదరిస్తుంది. వారి అనురాగపూర్వకమైన ఆమాటలనూ, వారు తనపట్ల కనబరుస్తున్న ప్రేమనూ మరి మరీ తలచుకుని వాటిలోనే స్వర్గసుఖాలను చవిజూస్తుంది.

నిజానికి స్త్రీ తన భర్త అనురాగాన్ని చూరగొని, తాను కన్న బిడ్డలు మంచివారై, భర్తా పిల్లలూ ఆనందంగా వుంటూ, వారి ప్రేమాదరణలకు పాత్రురాలు కావడంకంటె మరేం కోరుకుంటుంది?

ప్రతి యింట్లో కూడా భార్యాభర్తలు, స్త్రీ పురుషులు సమానంగా భావించబడాలి. అవసరమైతే స్త్రీ యేవిధంగా పురుషుడి పనులను చేయడానికి సిద్ధంగా వుంటుందో అదే విధంగా పురుషులుకూడా అవసరమున్నప్పుడు స్త్రీలకి సహాయం చేసి, సహకారం చూపడం అవసరం. మగవాళ్ళు యింటిపనులు చేయడం నామోషీ అన్న భావం వదలాలి. పైన నేను చెప్పిన కుటుంబంలోలాగా స్త్రీ తనను దాసిగా చేసి 'మర బొమ్మ' యని మగవాళ్ళు భావించారంటే, వివాహం, సంసారం—వీటి వుద్దేశ్యం నెరవేరకపోగా పూర్తిగా విభిన్న ఫలితాలు కలుగుతవి. భార్యాభర్తల మధ్య అనురాగానికి బదులు ఒక విధమైన అధికారమూ, అహంకారాలతో కూడిన భయమూ, ద్వేషభావమూ, తల్లికి బిడ్డల యెడ నిర్లక్ష్యమూ, కొంత కాఠిన్యమూ యేర్పడుతాయి. జీవితంలో కోరుకున్న మాధుర్యం చవిచూడలేరు గాక గృహిణికీ, గృహస్థుకూ కూడా సంసారం పట్ల విరక్తి కలుగక మానదు కొన్నాళ్ళకి.

ఏ యింట్లో అయితే భార్య, భర్త, బిడ్డలు కూడా పరస్పరానురాగం కలిగి, ఒకరికొకరు సహాయం చేసుకొని, మానవసహజమైన అనురాగాపేక్షలూ, దయాదాక్షిణ్యాలూ తావిచ్చి ప్రశాంతతలో తృప్తిగాను, ఆనందంగానూ జీవితం గడుపుతారో వారికే నిజమైనగృహం - వారిదే ఆదర్శమైనకుటుంబం.



## సరళ సలహా!

వెనుకటొకసారి మరీ అంత వగలి వేషాలు బాగులేదంటూ మనలో మనమాటగా చెబితే అంతా కోపగించుకున్నారు. చీటికి మాటికి ఏమిటీ సలహాలని చీదరించుకుంటారేమో! అయినా 'మంచి' అని పూర్తిగా విశ్వసించి ఇంకొకళ్ళకు చెప్పడంలో తప్పులేదంటాను. ఓ తిడి చేయకుంటా ఉంటే.

భార్యాభర్తల అనుకూలదాంపత్యానికి సంబంధించి మరొకటి నాకనిపిస్తూ ఉంటుంది. మగవాళ్ళతోపాటు స్త్రీలకు కూడా సమానస్వాతంత్ర్యం, హక్కులూ, ఉండాలనేమాట నిజమే కాని, దాంపత్యంలో ఇది ఇలా కొనసాగదు. పురుషుని కోసం స్త్రీ కొంత తన 'అహం' త్యాగం చేయక తప్పదు. అతనితో సహకరించడంలో లొంగుబాటు తప్పదు. ఇది అనుభవంలో తెలిసే విషయం.

అయితే ఈ లొంగుబాటు అంతిమ విజయానికే సుచిహ్నం! లొంగుబాటులోని అర్థాన్ని ఆత్మీయతను గ్రహించి పురుషుడు స్త్రీని ఆరాధిస్తాడు. మీరేమంటారు? ఏదీ కాస్త ఆలోచించి మరీ అనండి!

# పెండ్లిచూపులు

లలితా దేవి

ఈ రోజులలో ఆడపిల్ల పుట్టింది అంటే గుండెలపై పెద్దబండ పడ్డట్టే ఆడపిల్లను కన్న తల్లిదండ్రులు కూడ ఈరోజుల్లో పడే బాధ మనం చూస్తూనే వున్నాము.

చిన్నతనంలో ఎంత గారాబంగా, ముద్దుగా పెంచుతారో తరువాత అవగా పెండ్లి ఈడురాగానే వారికి అంత భారంగా ఉంటుంది. బీదవారికి, గొప్ప వారికి కూడ ఈ రోజుల్లో ఆడపిల్లలు పెండ్లిచేయటం ఒక పెద్ద సమస్యై కూర్చొంది.

పూర్వకాలంలో కరునిదన్నారి చూచి పిల్లవాడిని చూడకుండానే పిల్లనిచ్చెడివారు. పిల్ల నల్లగానున్న, ఎఱ్ఱగానున్నా గాని సాంప్రదాయం పెద్ద కుటుంబం చూచి పిల్లని ఇచ్చిపుచ్చుకోవటము జరిగేది. కాని ఈనాల్లో అలా కాదు. పిల్లవానికి పిల్ల నచ్చాలి.

ప్రతి పెండ్లికొడుకు కూడ పిల్లని చూడటం ఒక అలవాటైపోయింది. పెండ్లి చూపులు కని ఓ డజనుమంది బయలుదేరి ఆమెను ఒక వింతమృగంలాగ చూస్తారు. "సంగీతం వచ్చా? ఏం చదువుకున్నావు? నీ పేరేమిటి? నుంచో, ఒక్కసారి నడు, ఈ పత్రిక చదువు." మొదలైన ప్రశ్నల వర్షం కురిపిస్తారు. పాపం ఆపిల్ల భయం భయంగా అన్నిటికి జవాబు లిస్తుంది. పెండ్లి కుమార్తె గలవారు పెటిన కాఫీ, ఫలహారాలను సేవించి మెల్లగా ఇంటికి చేరి ఆ పిల్లకి అనేకరకాలు పేర్లు పెడతారు. పిల్ల అచ్చంగా కోకిల అనో లేక గార్ధభస్వరమనో నత్తి అనో పేర్లు పెడతారు. ఆపిల్ల ఎంతో అందంగా ఉండి పరీక్షలో నెగ్గిన ఎడల కట్నం చాలదంటారు. కొందరు పెద్ద మనుషులు 5 వేలిస్తేనే పిల్లని చూస్తామని లేకపోతే మా వాకిట్లోకి రానక్కరలేదని నిక్కచ్చిగా చెప్పేస్తారు. పిల్ల బొద్దుగా వుంటే లావుగా ఉందంటారు. సన్నగా ఉంటే కురూపి అంటారు. బి. ఎ. పరీక్షయిన పిల్ల యినను ఈపరీక్షలో నెగ్గటం కష్టం.

మా ఇంటి ప్రక్కన కాపురమున్న వారికి పెండ్లి కున్న ఒక కుమారుడున్నాడు. ఎవరైన మా పిల్లని చూచి వెళ్ళమనటం తరువాయి ఒకడజను అరటిపండ్లు ఒక మూర పూలు చేతపుచ్చుకొని వెళ్ళి చూచివస్తాడు. వచ్చింది మొదలు ఆ పిల్లకి పేర్లు పెడతాడు, ఇప్పటికి కనీసం 50 మందిని చూచాడు. 5 వేలు కట్నానికి తక్కువ ఇస్తే అతని డిగ్నిటీకి భంగమట. ఇలా అనుకునే యువకుల కుండకపోతే ఇల్లు, పడబోతే మంచం ఉండదు. ఇలాంటి వారిని చూస్తే "ఇంట్లో ఈగలమోత బయట పల్లకీల మోత" అన్నట్లుంటుంది.

'చదువుకొన్నదా' అని అడిగే పెండ్లి కుమారులు ఉద్యోగం చేయనిస్తారా? అదీ లేదు. చదువుకొన్న పిల్లని పెండ్లిచేసుకోమని బయట ప్రగల్భాలుకొట్టే వీరంతా చివరకి విద్యావిహీనురాలైనను, కురూపియైనను, ఎక్కువకట్నం ఇస్తామంటె చాలు వివాహమాడుతారు – 'సంగీతం వచ్చా?' అని అడిగినయువకు లేమైన గాన సభలకు చేయిస్తారా? వంట పొయ్యి దగ్గరకు వెళ్ళే ఆడవారికి చదువు, సంగీతం ఎందుకుపయోగిస్తాయి? ఆ చదువు, సంగీతాన్ని సద్వినియోగం చేసుకొంటారా? అదీ లేదు.

మా బంధువుల్లో ఒకతను విద్యాసంస్కారం గలిగి అందమైనపిల్లయితే కట్నం లేకుండానే చేసుకోవచ్చునంటూ వుండేవాడు. కాని తన దాకావచ్చేసరికి కట్నం కోసరమని అందవిహీనం, విద్యాసంస్కారం లేని ఒక (పల్లెటూరి) పిల్లని చేసుకున్నాడు. ఈ విధంగా చేసేవారు తమకుకూడ చెల్లెళ్ళున్నారనే విషయం మరచిపోకూడదు. పెండ్లిచూపులకై వెళ్ళేటప్పుడు పిల్ల జాతకం పంపమంటారు. ఈరోజుల్లో పిల్లల జాతకాలు ఎవరు వ్రాయిస్తున్నారు? చెప్పండి. జాతకాలు ఇస్తేనైనా సంబంధం కుదురుతుందేమో ఆ ఆశతో జాతకం వ్రాయించి ఇస్తున్నారు అసలది నిజమైనదో కాదో వారికే తెలియదు.

మొన్నీమధ్య మా ప్రక్కింట్లో ఉంటున్న ఒక డాక్టరు గారమ్మాయికి జాతకాలు అవి అన్నీ కుదిరాయని 10 వేలు ఖర్చుపెట్టి పెండ్లి చేశారు. పెండ్లయి 8 నెలలైనా కాలేదు, ఆపిల్ల భర్త చనిపోయాడు. కాబట్టి జాతకాలు అవి ఏమీ పని చేయవు. వాళ్ళ నుదిటి వ్రాతనుబట్టి జరుగుతాయి.

ఎప్పుడైతే పెండ్లిచూపులనే ఒక పరీక్ష పెట్టి అందు హాజరైన వధువులను అవహేళన చేయకుండా విద్యావంతురాలైన యువతిని పెండ్లిచేసుకొని భార్యాభర్తలిరువురు ఉద్యోగంచేసి, హాయిగా సంసారమనే సముద్రంలో, భార్యాభర్తలను చుక్కానులతో, జీవిత నౌకను ఒడ్డుకుచేర్చి సుఖ జీవనము చేయాలి. అలాచేసినవాని జీవితమే జీవితము. అప్పుడే దేశం బాగుపడుతుంది.

ఈ పెండ్లి చూపులకు అయ్యే ఖర్చు ఇవ్వబోయే కట్నం కంటే మించిపోతోంది. పెండ్లి సంబంధాల కోసరమని తిరిగి తిరిగి కాళ్ళు అరిగిపోయినను ఆడపిల్ల పెండ్లి చేయటం దుర్భరంగా ఉన్నది. బుద్ధితెలిసిన ఆడపిల్లలు ఈ అగచాట్లన్నీ చూచి నేనింక పెండ్లిచేసుకోనమ్మా అంటున్నారు

ఇంక తిరిగి తిరిగి చివరికి ఏ రెండో పెండ్లి వానికో లేక ఏవిధమైన విద్యాయోగ్యత లేని వానికో పిల్లనిచ్చి తమ బాధ్యత తీర్చుకొంటున్నారు. తరువాత ఆపిల్ల ఏమైన సలుపడ్డా సరే. ఆడపిల్లను కన్నతల్లిదండ్రి ఆపిల్ల పెండ్లి చేయగలిగితే జీవితంలో ఒక పెద్దఘనకార్యం చేసినంత తృప్తిని సంతోషాన్ని పొందుతారు.




18-10-59 తేదీన జరిగిన కలుపులో మొత్తం – 3,00,000 రూపాయిలు ప్రయిజులుగా పంచబడినవి.

కల్లికోట కాలేజి సహాయార్థం ఒరిస్సా, గవర్నమెంటువారిచే అనుమతించబడినది. K. C. చారిటీస్ సంఘ, బరంపురం.

**ఫస్టు ప్రయిజు రు. 85,000**

**ముగింపు తేది 31-1-1960**

టిక్కట్టు 1 కి రు. 1/- పోస్టేజి సహా

5 టిక్కట్లు రు. 4-8-0, 10 టిక్కట్లు రు. 8-8-0.

సమాధానం కావలసినవారు రిప్లైకార్డు వ్రాయవలెను. టిక్కట్లు కావలసినవారు యీ దిగువ వారికి మని ఆర్డరు చేయండి.

శ్రీ కాకోళపు సుభద్రయ్య, మెయిన్ రోడ్డు, కాకినాడ.



బాధపడుతున్నారని అనిపించదు మాకు. (ఈ విషయాలన్నీ కొందరికి అతిశయోక్తిగా తోచవచ్చుగానీ, ఆ కుటుంబాన్ని నేను స్వయంగా చూసిన దాన్ని కాబట్టి వ్రాస్తున్నాను.) ఆ ఇంట్లో అందరి హృదయాలూ ఎంతో స్వార్థంతో కరడు కట్టినట్లుగా తోస్తుంది. పోనీ ఆమెకు సహాయం చెయ్యకపోయినా, ఆమెను గురించి సానుభూతిపూర్వకంగా రెండుమాటలనేవాళ్ళు యెవరూ లేక ఆమె మానసికంగా యెంతో బాధపడిపోతున్నట్లు అనిపిస్తుంది. ఆమెను చూస్తూంటే మాటిమాటికీ "బాబూ యీ ఆడజన్మ యెందుకు పెట్టావ్?" అనిపిస్తుంది.

ప్రపంచంలో అందరు భర్తలూ, బిడ్డలూ యిలా వుంటారని నే ననడంలేదు. ఇలా వున్న యే కొద్ది కుటుంబాలలోనో, నేను చెప్పిన కుటుంబం కూడా చేరివుంటుంది. అందరు భర్తలూ, పిల్లలూ యిలాగే స్వార్థపరులైయుంటే యిప్పటికి స్త్రీజాతి హీనావస్థకు వచ్చివుండేది.

ఇంటిపనులు చెయ్యవల్సింది స్త్రీ, బయట తిరిగి ధనార్జన చెయ్యాల్సింది పురుషుడు. ఇది ప్రకృతి సహజమే. అయితే జబ్బులో వున్నా, చేత కాకపోయినా, యింటి పనులు ఆమే చెయ్యాలనీ, ఆమెకు యింటి పనుల్లో సహాయం చెయ్యడం మగవారికి కొంత భంగమనీ, అలాచేస్తే, ఆడవాళ్ళు చులకన చేస్తారనీ భావిస్తారు కొందరు సంస్కారం లేనివాళ్ళు. తనకు యింటి పనుల్లో చేతనైన సహాయం చేయకపోయినా, లేక సానుభూతిపూర్వకంగా రెండుమాటలు మాట్లాడితేనే యెంతో తృప్తిపడుతుంది స్త్రీ హృదయం. తన కోసం చీరలూ నగలూ తెచ్చి యిచ్చినంత సంబరపడుతుందామె మనస్సు. ఆమె తన పనులన్నీ కూడా యెంతో ఆనందంగా చేసి, యింట్లోవాళ్ళని సుఖపెట్టడానికి ప్రయత్నిస్తుంది. తనభర్త తనకు యింటిపనుల్లో సహాయం చేసినంత మాత్రాన భర్తని చులకన చేసే స్త్రీ యెవరైనా వున్నదంటే ఆమె నిజంగా మూర్ఖురాలే.

"ఇంతపని నువ్వొక్కదానివే యెలా చెయ్యగలవ్? కాస్సేపాగు. నేనూ వస్తున్నా" అనో లేక యిప్పుడాపని చేయకపోతే మునిగిపోయ్యేది లేదులే! కాస్సేపు కూర్చోరాదూ?" అనో భర్త అంటే, "అమ్మా నీవొక్కదానివే అంతపనీ చెయ్యకు. నేను బడినుంచి వచ్చాక యిద్దరం కలిసిచేద్దాం" అని కొడుకో, కూతురో అన్నారంటే ఆ గృహిణి ఆనందం వర్ణనాతీతం. అంతకుమునుపు విసుగుతో చేసే పనులన్నిటినీ, ఆరోజు ఆనందంగా, అవలీలగా చేస్తుంది. భర్తనీ, బిడ్డల్నీ అవ్యాజానురాగంతో, ఆదరిస్తుంది. వారి అనురాగపూర్వకమైన ఆమాటలనూ, వారు తనపట్ల కనబరుస్తున్న ప్రేమనూ మరి మరీ తలచుకుని వాటిలోనే స్వర్గసుఖాలను చవిచూస్తుంది.

నిజానికి స్త్రీ తన భర్త అనురాగాన్ని చూరగొని, తను కన్న బిడ్డలు మంచివారై, భర్తా పిల్లలూ ఆనందంగా వుంటూ, వారి ప్రేమాదరణలకు పాత్రురాలు కావటంకంటె మరేం కోరుకుంటుంది?

ప్రతి యింట్లో కూడా భార్యాభర్తలు, స్త్రీ పురుషులు సమానంగా భావింపబడాలి. అవసరమైతే స్త్రీ యేవిధంగా పురుషుడి పనులను చేయడానికి సిద్ధంగా వుంటుందో అదే విధంగా పురుషులుకూడా అవసరమున్నప్పుడు స్త్రీలకి సహాయం చేసి, సహకారం చూపడం అవసరం. మగవాళ్ళు యింటిపనులు చేయడం నామోషీ అన్న భావం వదలాలి. పైన నేను చెప్పిన కుటుంబంలోలాగా స్త్రీ తమకు చాకిరీ చేసే 'మరబొమ్మ' యని మగవాళ్ళు భావించారంటే, వివాహం, సంసారం—వీటి వుద్దేశ్యం నెరవేరకపోగా పూర్తిగా విభిన్న ఫలితాలు కలుగుతవి. భార్యాభర్తల మధ్య అనురాగానికి బదులు ఒక విధమైన అధికారమూ, అహంకారాలతో కూడిన భయమూ, ద్వేషభావమూ, తల్లికి బిడ్డల యెడ నిర్లక్ష్యమూ, కొంత కాఠిన్యమూ యేర్పడుతాయి. జీవితంలో కోరుకున్న మాధుర్యం చవిచూడలేరు గానీ గృహిణికీ, గృహస్థుకూ కూడా సంసారం వల్ల విరక్తి కలుగక మానదు కొన్నాళ్ళకి.

ఏ యింట్లో అయితే భార్య, భర్త, బిడ్డలు కూడా పరస్పరానురాగం కలిగి, ఒకరికొకరు సహాయం చేసుకొని, మానవసహజమైన అనురాగాపేక్షలకూ, దయాదాక్షిణ్యాలకూ తావిచ్చి వున్నంతలో తృప్తిగాను, ఆనందంగాను జీవితం గడుపుతారో వారిదే నిజమైన గృహం - వారిదే ఆదర్శమైన కుటుంబం.



## సరళ సలహా!

వెనుకటి కొకసారి మరీ అంత నగటి వేషాలు బాగులేదంటూ మనలో మనమాటగా చెబితే అంతా కోపగించుకున్నారు. చీటికీ మాటికీ ఏమిటీ సలహాలని చీదరించుకుంటారేమో! అయినా 'మంచి' అని పూర్తిగా విశ్వసించి ఇంకోటి చెప్పడంలో తప్పులేదంటాను. ఓ తిడి చేయకుండా ఉంటే.

భార్యాభర్తల అనుకూలదాంపత్యానికి సంబంధించి మరోటి నాకనిపిస్తూ ఉంటుంది. మగవాళ్ళతోపాటు స్త్రీలకు కూడా సమానస్వాతంత్ర్యం, హక్కులూ, ఉండాలనేమాట నిజమే కాని, దాంపత్యంలో ఇది ఇలా కొనసాగదు. పురుషుని కోసం స్త్రీ కొంత తన 'అహం' త్యాగం చేయక తప్పదు. అతనితో సహకరించడంలో లొంగుబాటు తప్పదు. ఇది అనుభవంలో తెలిసే విషయం.

అయితే ఈ లొంగుబాటు అంతిమ విజయానికి సూచిన్నాం: లొంగుబాటులోని ఆర్ద్రతను ఆత్మీయతను గ్రహించి పురుషుడు స్త్రీని ఆరాధిస్తాడు. మీరేమంటారు? ఇది కాస్త ఆలోచించి మరీ అనండి!

# పెండ్లిచూపులు

లలితాదేవి

ఈ రోజులలో ఆడపిల్ల పుట్టింది అంటే గుండెలపై పెద్దబండ పడ్డట్టే ఆడపిల్లను కన్న తల్లిదండ్రులు కూడ ఈ రోజుల్లో పడే బాధ మనం చూస్తూనే వున్నాము.

చిన్నతనంలో ఎంత గారాబంగా, ముద్దుగా పెంచుతారో తరువాత అనగా పెండ్లి ఈడు రాగానే వారికి అంత భారంగా ఉంటుంది. బీదవారికి, గొప్ప వారికి కూడ ఈ రోజుల్లో ఆడపిల్లల పెండ్లిచేయటం ఒక పెద్ద సమస్యగా మారింది.

పూర్వకాలంలో వరుసనిదస్తూరి చూచి పిల్లవాడిని చూడకుండానే పిల్లనిచ్చేడివారు. పిల్ల నల్లగానున్న, ఎఱ్ఱగానున్నా గాని సాంప్రదాయం పెద్ద కుటుంబం చూచి పిల్లని ఇచ్చిపుచ్చుకోవటము జరిగేది. కాని ఈ రోజుల్లో అలా కాదు. పిల్లవానికి పిల్ల నచ్చాలి.

ప్రతి పెండ్లికొడుకు కూడ పిల్లని చూడటం ఒక అలవాటైపోయింది. పెండ్లి చూపులకని ఓ పదిజను మంది బయలుదేరి ఆమెను ఒక వింతమృగంలాగ చూస్తారు. "సంగీతం వచ్చా? ఏం చదువుకున్నావు? నీ పేరేమిటి? నుంచో, ఒక్కసారి నడు, ఈ పత్రిక చదువు." మొదలైన ప్రశ్నల వర్షం కురిపిస్తారు. పాపం ఆపిల్ల భయం భయంగా అన్నిటికి జవాబు లిస్తుంది. పెండ్లి ముహూర్తగలవారు పెటిన కాఫీ, ఫలహారాలను సేవించి మెల్లగా ఇంటికి చేరి ఆ పిల్లకి అనేకరకాలు పేర్లు పెడతారు. పిల్ల అచ్చంగా కోకిల అనో లేక గార్దభస్వరమనో నత్త అనో పేర్లు పెడతారు. ఆపిల్ల ఎంతో అందంగా ఉండి పరీక్షలో తగిన ఎడల కట్నం చాలదంటారు. కొందరు పెద్ద మనుషులు 5 వేలిస్తేనే పిల్లని చూస్తామని లేకపోతే మా వాకిట్లోకి రానక్కరలేదని నిక్కచ్చిగా చెప్పేస్తారు. పిల్ల బొద్దుగా వుంటే లావుగా ఉందంటారు. సన్నగా ఉంటే కురూపి అంటారు. బి. ఎ. పరీక్షయిన పిల్ల యినను ఈ పరీక్షలో నెగ్గటం కష్టం.

మా ఇంటి ప్రక్కన కాపురమున్న వారికి పెండ్లి కున్న ఒక కుమారుడున్నాడు. ఎవరైన మా పిల్లని చూచి వెళ్ళమనటం తరువాయి ఒకడజను అరటిపండ్లు ఒక చేడ పూలు చేతపుచ్చుకొని వెళ్ళి చూచివస్తాడు. వచ్చింది మొదలు ఆ పిల్లకి పేర్లు పెడతాడు, ఇప్పటికి కనీసం 50 మందిని చూచాడు. 5 వేలు కట్నానికి తక్కువ ఇస్తే అతని డిగ్నిటికి భంగమట. ఇలా అనుకునే యువకులకు ఉండబోతే ఇల్లు, పడబోతే మంచం ఉండదు. ఇలాంటి వారిని చూస్తే "ఇంట్లో ఈగలమోత బయట పల్లకీల మోత" అన్నట్లుంటుంది.

'చదువుకొన్నదా' అని అడిగే పెండ్లి కుమారులు ఉద్యోగం చేయనిస్తారా? అదీ లేదు. చదువుకొన్న పిల్లని పెండ్లిచేసుకోమని బయట ప్రగల్భాలుకొట్టే వీరంతా చివరికి విద్యావిహీనురాలైనను, కురూపియైనను, ఎక్కువకట్నం ఇస్తామంటే చాలు వివాహమాడుతారు — 'సంగీతం వచ్చా?' అని అడిగినయువకు లేమైన గాన సభలు చేయిస్తారా? వంట పొయ్యి దగ్గరకు వెళ్ళే ఆడవారికి చదువు, సంగీతం ఎందుకుపయోగిస్తాయి? ఆ చదువు, సంగీతాన్ని సద్వినియోగం చేసుకొంటారా? అదీ లేదు.

మా బంధువుల్లో ఒకతను విద్యాసంస్కారం గలిగి అందమైనపిల్లయితే కట్నం లేకుండానే చేసుకోవచ్చునంటూ వుండే వాడు. కాని తన దాకావచ్చేసరికి కట్నం కోసరమని అందవిహీనం, విద్యాసంస్కారం లేని ఒక (పల్లెటూరి) పిల్లని చేసుకున్నాడు. ఈ విధంగా చేసేవారు తమకు కూడ చెల్లెళ్ళున్నారనే విషయం మరచిపోకూడదు. పెండ్లిచూపులైవెళ్ళేటప్పుడు పిల్ల జాతకం పంపమంటారు. ఈ రోజుల్లో పిల్లల జాతకాలు ఎవరు వ్రాయిస్తున్నారు? చెప్పండి. జాతకాలు ఇచ్చేసైనా సంబంధం కుదురునేమో అనే ఆశతో జాతకం వ్రాయించి ఇస్తున్నారు అసలది నిజమైనదో కాదో వారికే తెలియదు.

మొన్నీ మధ్య మా ప్రక్కింట్లో ఉంటున్న ఒక డాక్టరుగారమ్మాయికి జాతకాలు అవి అన్నీ కుదిరాయని 10 వేలు ఖర్చుపెట్టి పెండ్లి చేశారు. పెండ్లయి 8 నెలలైనా కాలేదు, ఆపిల్ల భర్త చనిపోయాడు. కాబట్టి జాతకాలు అవి ఏమీ పని చేయవు. వాళ్ల నుదిటి వ్రాతనుబట్టి జరుగుతాయి.

ఎప్పుడైతే పెండ్లిచూపులనే ఒక పరీక్ష పెట్టి అందు హాజరైన వధువులను అవహేళన చేయకుండా విద్యావంతురాలైన యువతిని పెండ్లిచేసుకొని భార్యాభర్తలిరువురు ఉద్యోగం చేసి, హాయిగా సంసారమనే సముద్రంలో, భార్యాభర్తలను చుక్కానులతో, జీవిత నౌకను ఒడ్డుకుచేర్చి సుఖజీవనము చేయాలి. అలా చేసిన వాని జీవితమే జీవితము. అప్పుడే దేశం బాగుపడుతుంది.

ఈ పెండ్లిచూపులకు అయ్యే ఖర్చు ఇవ్వబోయే కట్నం కంటే మించిపోతోంది. పెండ్లి సంబంధాల కోసమని తిరిగి తిరిగి కాళ్ళు అరిగిపోయినను ఆడపిల్ల పెండ్లి చేయటం దుర్భరంగా ఉన్నది. బుద్ధితెలిసిన ఆడపిల్లలు ఈ అగచాట్లన్నీ చూచి నేనింక పెండ్లిచేసుకోనమ్మా అంటున్నారు

ఇంక తిరిగి తిరిగి చివరికి ఏ రెండో పెండ్లి వానికో లేక ఏ విధమైన విద్యాయోగ్యత లేని వానికో పిల్లనిచ్చి తమ బాధ్యత తీర్చుకొంటున్నారు. తరువాత ఆపిల్ల ఏమవస్థలుపడ్డా సరే. ఆడపిల్లను కన్నతల్లిదండ్రి ఆపిల్ల పెండ్లి చేయగలిగితే జీవితంలో ఒక పెద్దఘనకార్యం చేసినంత తృప్తిని సంతోషాన్ని పొందుతారు. 

18-10-59 తేదీన జరిగిన కలుపులో మొత్తం - 3,00,000 రూపాయిలు ప్రయిజులుగా పంచబడినవి.

కల్లికోట కాలేజి సహాయార్థం ఒరిస్సా, గవర్నమెంటువారిచే అనుమతించబడినది. K. C. చారిటీస్ పంపు, బరంపురం.

**ఫస్టు ప్రయిజు రు. 85,000**

**ముంపు తేది 31-1-1960**

టిక్కట్టు 1 కి రు. 1/- పోస్టేజి సహా

5 టిక్కట్లు రు. 4-8-0, 10 టిక్కట్లు రు. 8-8-0.

సమాధానం కావలసినవారు రిప్లైయికార్డు వ్రాయవలెను. టిక్కట్లు కావలసినవారు యీ దిగువ వారికి మని ఆర్డరు చేయండి.

శ్రీ కాకోళపు సుభద్రయ్య, మెయిన్ రోడ్డు, కాకినాడ.

**పాకశాల:**

# మరికొన్ని ఉత్తరాది వంటలు

## ఆలూ-మటర్

ఈకూర చపాతీలలోకి వుపయోగిస్తారు. ఆలూ అనగా బంగాళ దుంపలు. మటర్ అంటే పచ్చిబటానీలు.

కావలసిన వస్తువులు —

బంగాళదుంపలు ½ శేరు (1 శేరుకు 80 తులములు)

పచ్చిబటానీ కాయలు ½ శేరు.

6 పచ్చిమిరపకాయలు.

కొంచెము అల్లము, తగినంత వుప్పు, 1 పెద్దవుల్లి పాయ.

ముందర బంగాళదుంపలని కడిగి, చెక్కు తీసి, పెద్ద పెద్ద ముక్కలుగ తరుగవలయును. తరువాత మటర్‌ని వొలిచి పెట్టుకొనవలయును. కొంచెము శుభ్రముగ కడిగి పచ్చిమిరప కాయలు, అల్లము, వుల్లిపాయ, తగినంత వుప్పు వేసి మెత్తగ నూరవలెను. తరువాత కుంపటిమీద గిన్నె పెట్టి కొంచెము నెయ్యి గాని, డాల్డాగాని వేయవలెను. తరువాత ఈ నూరినముద్దను ఆనెయ్యిలో వేసి యెర్రగ వేయించవలెను. అది కాగినతరువాత బంగాళ దుంపముక్కలు, మటరు వేసి ముక్కలపరిమాణంవరకు నీరుపోసి పసుపు వేసి మూతపెట్టవలెను. కాసేపటికి అదివుడికి, తినుటకు తయారగును. ఈకూర పల్చగవుంటుంది. నీరు చాలకపోతే యింకొంచెము పోయవచ్చును.

## కారెట్-మటర్

పైవిధముగానే బంగాళదుంప బదులు కారెట్ ముక్కలు తరిగి, మిర్చి, అల్లము, వుల్లి, వుప్పు ముద్ద వేయించి కారెటు, మటర్, రెండు బంగాళదుంపల ముక్కలు వేసి కూరముద్దలాగ అయేటట్లు నీళ్ళుపోయవలెను. ఇదికూడ రుచిగానే వుంటుంది. ఇదికూడ చపాతీలలోనే తింటారు కాని ఇది పైదానిలాగ పల్చగవుండకూడదు.

కారెట్ బదులు కేబేజికూడ వేసి చెయ్యవచ్చును.

## శాండ్‌విచ్

ఏవైనా రెండిటిమధ్య కూరపెట్టిచేస్తే, దానిని శాండ్‌విచ్ అంటారు.

దీనికి కావలసిన వస్తువులు :—

2 గ్లాసుల గోధుమపిండి (½ శేరు)

½ శేరు ఆలూ.

6 పచ్చిమిరపకాయలు.

కొద్దిగ అల్లము, సరిపడినంతవుప్పు, 1 పెద్ద వుల్లిపాయ, కొంచెము నెయ్యి. ముందర గోధుమపిండిని వుప్పు, నీళ్ళుపోసి పూరీల పిండిలాగ కలిపి అట్టేపెట్టవలయును. తరువాత బంగాళదుంపలను చెక్కు తీసి ముక్కలుగ తరిగి వుడికించవలయును. ఈ ముక్కలు చల్లారిన తరువాత, రోటిలో వేసి మెత్తగ

డి. సీతాదేవి

నూరవలయును. తరువాత అల్లము, మిర్చి, వుల్లిపాయ, తగినంత వుప్పు వేసి మెత్తగనూరి దీనిని నేతిలో వేయించవలెను. అది వేగిన తరువాత, ఈ బంగాళదుంప ముద్దకూడ వేసి కాసేపు కలిపి వుంచివేయవలయును.

తరువాత గోధుమపిండిని చిన్న చిన్న కాయంత వుండలు చేయవలయును. ముందు ఒకవుండను పూరిలాగ కొంచెము పల్చగవత్తి దానిని ఒక పక్కన పెట్టవలయును. దాని తరువాత యింకొకపూరీ వత్తి, కొంచెము పైన చేసినకూరను దానిమీద పెట్టి ముందు చేసిన పూరీని యీ కూర మీద పెట్టవలయును. అప్పుడు ఈ రెండిటి అంచులను కలిపి బొటనవ్రేలితో నొక్కవలయును, అతుక్కుపోవును. ఇప్పటికి శాండ్‌విచ్ తయారయినదన్నమాట. ఇక దీనిని కాల్చాలి. కుంపటినిండా బొగ్గులుపోసి బాగా యెర్రగ మండిన తరువాత పెనము దానిమీద పెట్టాలి. పెనము బాగా కాలనిచ్చి దానిమీద యీ తయారుచేసిన శాండ్‌విచ్‌ని వేయవలయును. ఇది రెండువైపుల తెల్లగ అయిన తరువాత నెయ్యివేసి యెర్రగ కాలనిచ్చి తీయవలయును. ఒక శాండ్‌విచ్ కాలేలోపల యింకొకటి తయారుచేసి పెట్టుకొంటే మొదటిది కాలగానే రెండోది వేయవచ్చును. దీనిలో పెరుగు నంచుకొంటారు. ఈ వంటలు యిక్కడ యెక్కువ చేస్తారు. ★








దగ్గు మరియు రొంపలకు
త్వరితమైన మరియు
నిశ్చయమైన గృహస్థ చికిత్స

LGIY-1575 EVEREST




మీ కుటుంబమునకంతటికి ఆరోగ్యమునకు ఆల్‌విటోన్ ఉపయోగించుడు. ఉత్సాహము శక్తినిచ్చు ఆల్‌విటోన్ లో ఆల్మండ్, బార్లీమాల్ట, మీగడపాలు, కోకో చేర్చ బడి మిళితమై, కాల్షియం ఎక్కువగాగలదు. వేడిగా లేక చల్లగా త్రాగినను పేర్తులి. చక్కని రుచి. ఉత్సాహమునిచ్చు పానీయము.

ALVITONE

ఆరోగ్య ఆహారపానీయము.

ఆల్‌విటోన్ లాబొరేటరీస్, మద్రాసు-16

ఆంధ్రకు డిస్ట్రిబ్యూటర్లు: మెసర్సు స్వతంత్ర ఏజెన్సిస్
గాంధినగర్, విజయవాడ-2.

## చదవాలి-సుఖపడాలి

జీవిత రహస్యాలు చదవకముందు | చదివిన తరువాత

దాంపత్య జీవితంలో బలహీనులయి, నాశనమయ్యేవారి నుద్ధరించుటకు ప్రముఖ డాక్టర్లు కనుగొన్న కొన్ని అమూల్య రహస్యాలు "జీవిత రహస్యాలు" పుస్తకంలో ఉన్నాయి. ఇంకా అందులో ఒకచుక్క ధాతువుకు 80 చుక్కల రక్తం నష్టమవుతుందనేది అబద్ధమని ఎలా నిరూపించారు, బీజాల వదులువల్ల ఫలితాలు, వాటిలో నొప్పులువల్ల, బుద్ధ వరిబీజాలు, సుఖవ్యాధులు రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు, దాంపత్య జీవితాన్ని ఆనందమయం చేసుకోవడానికి కనుగొన్న మార్గాలు, కుటుంబ నియంత్రణమార్గాలు, యింకా మీ జీవితంలో వెంటనే తెలుసుకోవలసిన అన్ని సంగతులు, "జీవిత రహస్యాలు" అనే ఈ తెలుగు పుస్తకంలో వున్నాయి. వెల రు. 3-50. పోస్టు ఖర్చు ఉచితం. ఇది క్రిందిచోటే దొరుకును. 'దేశసేవ ప్రచురణలు, అశోకనగరు, ఏలూరు, ఆంధ్రకు వ్రాస్తే వి. పి. పోస్టుద్వారామీకూ పంపబడును.

SWASTI

# పరిస్థితులు...

(13-వ పేజీ తరువాయి)

పరిశుద్ధమైన వుడుపులు.

ఇప్పుడతను ఒక వుద్యోగి! సంపాదనపరుడు! అందుకే ఆ ఠీవి.

మూడేళ్ల క్రితం ఈ చెరువుకట్టమీంచే నడచిపోయాడు తాను. కృంగిన మనస్సుతో నడిచి వెళ్లాడప్పుడు. ఎన్నో సందేహాలతో వేగిపోయాడప్పుడు. ఇప్పుడటువంటి ఆందోళన ఏమీ లేదు. తాను సంపాదిస్తున్నాడు. చేతినిండ డబ్బులున్నాయి. సంచీనిండా తినుబండారాలున్నాయి. సిగ్గు, బిడియం యిప్పుడు లేవు. తనకు ఎందుకుండాలి? తను పారిపోయి రావడంలేదుగా? చేత చిల్లిగవ్వలేదే అన్న బాధ లేదుగా? తానుదొరలా వెళ్తున్నాడిప్పుడు.

ఇక మీదట—రాజక్క యింటికి వచ్చినా వెళ్లకూడదనుకున్నాడు అప్పుడు. కాని ఆ నిశ్చయం నాటాటికి సడలిపోయింది. సుశీలను చూడాలనిపించింది. వస్తే ఏం? తను నెల రోజులుగాని కూర్చోబోవడంలేదు. ఒకటి రెండురోజులుండి వచ్చేస్తాడు.

ద్వారబంధం తగలకుండా వంగి యింట్లో చొరబడ్డాడు భాస్కరం. తలుపుప్రక్క కూర్చుని లేసు అల్లుకుంటోన్న సుశీల 'అమ్మోయ్' అంటూ పులికిపడి లేచినిలబడి ఒకటిరెండు క్షణాల్లోనే అతన్ని గుర్తుపట్టి సిగ్గుతో తడబడుతూ వంటింట్లోకి వెళ్లి 'అమ్మోయ్ లే! అటుచూడు!' అంది.

"ఏమిటే! ఎవరూ?" అంటోంది రాజి.

"అబ్బబ్బబ్బ! నీకు నేను చెప్పలేనుతల్లీ. మరి...శంకరంబావ..."

'ఏమిటీ? శంకరంబావనా?"

"కాదే! ఆయనగారి తమ్ముడుగారు."

'ఆఁ! భాస్కరమా? అది చెప్పడానికి యింతసిగ్గేమిటే నీకు?' అంటూ చంటి పాపను భుజాన వేసుకుని బయటకొచ్చింది రాజి.

రాజి ఇంకో బిడ్డను కన్నదని తాను విన్నాడు. వాడే కాబోలు వీడు!

"ఏం భాస్కరం! కంటికి కనిపించడమే గగనమైపోయిందా? రా! రా! బావున్నావా? రైల్వేలో ఎక్కడో ఉద్యోగం చేస్తున్నావటగా? వందాఏభైయటనే జీతం? మనిషి ఎంత మారిపోయావురా? మూడేళ్లయిపోతున్నైకదూ నిన్ను చూసి? ఒసేయ్! బావకు మంచినీళ్లు పట్రా. కూర్చోరా భాస్కరం. ఆకుర్చీలాగి కూర్చో. అంతా బాగున్నారా? నువ్వొక్కడివే వచ్చావేమిటీ?..." ఈ ప్రశ్న పరంపరతో ఉక్కిరిబిక్కిరైపోయాడు భాస్కరం. తగిన

సమాధానా లిస్తూ బూట్లువిప్పి డ్రాయరు క్రిందపడేశాడు.

సుశీల వెళ్ళి అలమరాలో మ్రగ్గుతూన్న గ్లాసునుతీసి, తువాలు మీద తోమి, దాన్నిండా నీళ్ళు ముంచుకొచ్చి భాస్కరం ముందు నిలబడింది. ముగ్ధ అయిన ఆమెను ఆ పాద మస్తకం చూస్తూ, నీళ్ళు పుచ్చుకోవాలన్న మాటే మరిచిపోయాడు భాస్కరం.

"నీళ్ళు తీసుకో భాస్కరం" అని రాజక్క అనేంతవరకు అలాగే వుండిపోయాడు.

ఖాళీగ్లాసు సుశీల చేతి కందిస్తూ 'అదిసరే గాని అక్కా! పిల్లలంతా ఏరీ?' అన్నాడు.

"బడికెళ్లారు. వొస్తారులే!" అంది.

భాస్కరం వచ్చాడన్న వార్త ఎలా వెళ్ళిందో గానీ, పదినిమిషాల్లో పిల్లలంతా లోపలికి వచ్చిపడి, అతన్ని చుట్టుముట్టేశారు. అందరికీ పిప్పరమెంట్లూ, బిస్కత్తులూ, చాక్లెట్లూ అన్నీ పంచి పెట్టాడు. సాయంకాలం బావ వచ్చాడు. కాని-బావను మునుపటిలా చెరువుగట్టు మీదికీ, చెరకు తోటల్లోకీ పిలిచే ధైర్యం లేకపోయింది. అంతగా మారిపోయాడు బావ.

సాయంకాలం స్కూలునుంచీ శ్రీహరి బావ వచ్చాడు. అతనితో చాలసేపు మాటల్లో మునిగిపోయాడు "జాగ్రత్త భాస్కరం! అసలే రైల్వే వుద్యోగం! వుండవలసిన జాగ్రత్తలో నువ్వుంటే మంచిది. ఆరోగ్యం పాడు చేసుకోవద్దు. అయినా రెండువందల మైళ్ళ కవతల ఎక్కడో వున్నావే— హోటలు భోజనమే గా మాలు! ఎన్నాళ్లుంటావ్ అలా?..."

రాజక్క చెప్పింది. 'సుశీలను బడినుంచి మాన్పించేశాం భాస్కరం! పెద్దమనిషై ఆరునెలలయిపోతోంది. ఏమిటోపాపం విపరీత కాలం! ముందు జాగ్రత్త మంచిదిగాక! దాన్ని యింట్లో పెట్టుకొనివుంటే వాడు అన్నం కూడా మ్రింగుడు పడనంటోందిరా నాయనా!..."

వాళ్ళమాటల్లోని అంతర్యమేమిటో యిట్టే గ్రహించేశాడు భాస్కరం. కోటబురుజుపై కెక్కి కూర్చున్నంత సంబరపడి పోయాడు.

అక్కడ మూడు రోజులున్నాడు. ఈ మూడు రోజుల్లోను సుశీలతోమాత్రం ఎక్కువ మాట్లాడలేదు. ఆమె ఏమేమో చేస్తుంది. తన ముందునుండే వెళ్తుంది. పాడి దగ్గ దగ్గుతుంది. పావడ అంచులు సవరించుకుంటుంది. దావాణి సరిజేసుకుంటుంది. తనవైపు అదేపనిగా చూస్తుంది. తనుమాత్రం ఏమీ చలించడు.

రెండోరోజు సాయంత్రం రాజమ్మ పకోడీలు చేసింది. ఒకప్లేటులో పకోడీలు పెట్టుకొని మంచినీళ్ళ గ్లాసుతో భాస్కరం దగ్గరికి వచ్చింది సుశీల. అతను చూడనట్లు బయటకు వెళ్ళిపోతూంటే తడబడుతున్న గొంతుతో అంది. 'ఇదిగో, ఇదిగో, బా...' మనసులోనే నవ్వుకున్నాడు. తిరిగివచ్చి, పకోడీలు, గ్లాసు తీసి అందుకున్నాడు. ఆ 'బా-'కు బావ అని తాను అర్థం చెప్పుకున్నా, ఆమె 'భాస్కరం' అనబోయిందేమో? కాదు! బావ అనే అనబోయింది. 'బా'ను సరళంగానే పలికింది.

ఇప్పుడు ఎంగిలి కంచాల్లో గిన్నెల్లో వడ్డించడం లేదు. విస్తరాకులు పరుస్తున్నారు తెల్లవారిపూట కాఫీ, టిఫినూయిస్తున్నారు మూడుపూటలూ వేడనీటి స్నానం ఎందుకీ మర్యాదంతా? తాను సంపాదన పరుడనేనా?...

మూడోనాటి ఉదయం సుశీలతో అన్నాడు. "ఇదిగో సుశీ! అమ్మతో చెప్పు నేను సాయంత్రం వెళ్ళి పోతున్నానని."

సుశీల ముఖం ముడుచుకు పోయింది. "సాయంకాలం వెళ్ళిపోతావా?" ఆ ప్రశ్నలో జాలియిమిడి పోయివుంది.

ఆమెకోసమైనా వుందామనుకున్నాడు. కాని తప్పదు. "ఔను!" అన్నాడు.

సుశీల పెరట్లోకి వెళ్లింది. వింటున్నాడు తాను.

"అమ్మా! సాయంత్రం వెళ్లి పోతార్ట!"

"ఎవరు?"

"బావేనమ్మా! సాయంత్రం వెళ్లిపోవాలంటున్నాడు."

భాస్కరం హృదయం పులకించి పోయింది.

"సాయంకాలం వెళ్లిపోతానన్నావుట గా భాస్కరం?" అంటూ తడిచేతులను విదిలించుకుంటూ వచ్చింది రాజమ్మ.

"ఔనక్కయ్యా"

"ఏం? ఇంకో రెండురోజులుండి పోరాదుట్రా?"

"ఉహూ! వీల్లేదక్కయ్యా. వెళ్లాలి. లీవు అయిపోవచ్చింది."

రాజమ్మ బదులు పలుకలేదు.

ఆ మధ్యాహ్నం రెండు గంటలు పైబడ్డాక యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. శ్రీహరిబావ, పిల్లలూ స్కూళ్ళకు వెళ్ళిపోయారు. నట్టింట్లో చంటిబిడ్డను ప్రక్క వేసుకుని నిద్రపోతోంది రాజమ్మ. నడవలో బెంచీమీద పరుపు పరుచుకుని భాస్కరం నిద్రపోతున్నాడు.

సుశీల బెదురుగా చుట్టూ కలయజూచి తిన్నగా అతనిదగ్గరకు వచ్చి, తలవేపు కూర్చుంది. అతని ఉంగరాలజుత్తులోనికి వ్రేళ్ళుపోనిచ్చి అతని మొహంలోకి ఆప్యాయంగా చూసింది. ఆమెకళ్ళల్లో ఒక ప్రక్కగా నీళ్ళు పేరుకొంటున్నాయి. భాస్కరం వులికిపడి కన్నులు తెరిచాడు. సుశీల కనిపించింది. విస్తుపోతూ లేచి కూర్చున్నాడు. "ఏమిటి సుశీ! ఇక్కడ కూర్చు


రోజంతా శుభ్రముగా నుండుటకు

ఆకర్షణీయమైన సువాసన, బహు మెత్తని పొడి-మరే టాయిలెట్ పౌడరులోనూ లేనట్టి-చమట దుర్గంధము, చర్మవ్యాధులను గలిగించు క్రిములను నిర్మూలించే లోకప్రసిద్ధమైన జి-11* వీటిని గలిగియున్నప్పటికి గోద్రెజ్ టాయిలెట్ పౌడరు ఎక్కువ ఖరీదేమీ లేదు.

ఉక్కపోతనుండి నిలకడైన శీఘ్ర విముక్తి గలిగించి చమటవల్ల చర్మము రేగుటను పోగొట్టును.... ఇది పసిబిడ్డలకు వరప్రసాదము!

గోద్రెజ్

టాయిలెట్ పౌడరు

దుర్గంధమును పోగొట్టును • రక్షకమైనది • సువాసనగలది • శమనకరమైనది

సంపూర్ణ రక్షణకు సింథాల్ తో స్నానముచేసిన పిదప వాడండి.

(* పేటెంట్ హెగ్జాక్లోరోఫిన




గోద్రెజ్ శ్రేష్ఠమైన సబ్బులను ఇతర టాయిలెట్రీలను తయారుచేయును.

# పరిస్థితులు...

...న్నావు!" అన్నాడు. ఆమె తన మొహంలోనికి రెండు క్షణాలు చూసి, తలవంచుకొని కొంగుతో కళ్ళొత్తుకుంది.

"నా మీద కోపం పోలేదా బావా?" అంది.

కరిగి నీరైపోయాడు భాస్కరం. ఆమె రెండు చేతులూ అందిపుచ్చుకొని "నీ మీద నాకేం కోపం సుశీ? నువ్వేంచేశావని?" అన్నాడు

"నేను ఏమేమి చేశానో నీకు తెలుసు. బుద్ధితక్కువగా నిన్నెంతగానో బాధపెట్టి వుంటాను. ఇంకా అదంతా మరిచిపోలేదా బావా?"

ఆమె చేతులను తన గుండెల మీద వుంచుకుని "నీ మీద కోపమున్నా అదంతా ఎప్పుడో పోయింది. నిన్నిప్పుడు ద్వేషించడం లేదు. జాలిపడుతున్నాను. పిచ్చితలపులన్నీ విడిచిపెట్టేయి. నన్ను ఎన్నన్నా నా సుశీలే కదూ?" అన్నాడు.

"చెయ్యి విడువు బావా! అమ్మ చూస్తుంది. వెళ్ళాలి" అంది.

ఆమె చేతులు విడిచేసి "సరే వెళ్ళు! ఇప్పుడు తప్పించుకొన్నా పెళ్ళినాటికి ఎలా తప్పించుకుంటావో చూస్తాను" అన్నాడు.

"అమ్మ పాపం. ఆశే! పెళ్ళినాటికి నెత్తెక్కి కూచుంటా."

"నెత్తెక్కి కూర్చుంటే కొప్పుబట్టి కిందికీడవనూ?"

కిలకిల నవ్వుతూ "పో బావా! మాటలు నేర్చుకున్నావు గానీ" అంటూ అతని చెక్కిలిని చురుక్కుమనిపించి, అక్కడినుండి వెళ్ళిపోయింది సుశీల.

వెల్లకిలా పడుకున్న భాస్కరం నవ్వుతూంటే, అతని కడుపు నవ్వుతో బాటు ప్రకంపించింది.

ఆసాయంకాలం అతను వెళ్ళిపోతూంటే సుశీల కన్నుల్లో దైన్యం తాండవించింది. అతను చెరువుకట్ట వెంబడే నడిచి రోడ్డుమీదికి వచ్చాడు. బస్సుకోసం ఎదురుచూస్తూ రోడ్డు ప్రక్కన చింతచెట్టు క్రిందవున్న రాతిపలక మీద కూర్చున్నాడు.

చింతకొమ్మ పైనుండీ జారి క్రిందపడిన ఊసరవెల్లి ఒకటి అతని దృష్టిని ఆకర్షించింది. తర్వాత అది నెమ్మదిగా తన పరిసరాలకు అనుకూలంగా రంగును మార్చుకుంది. ఈమార్పులో ఏదో వైచిత్ర్యం గోచరించిందతనికి. ఇది పోలికగా మానవ నైజమంటే ఏమిటో తేటతెల్లంగా, అద్దంలో ప్రతిబింబంలా ప్రస్ఫుటమైంది.

రంగులన్నీ మనిషిలోనే వున్నాయి. వాటిని పరిస్థితులతోపాటు మార్చుకోగలడు మానవుడు. ఈ విషయం భాస్కరానికి అనుభవంలోనిదే. సుశీల, అక్క, బావ, పిల్లలూ తానూ అందరూ ఇలా మారిపోగలరని తానెనాడైనా వూహించాడా?...భాస్కరం ఈ విధంగా—పరిస్థితులకు అనుబంధంగా రూపుదేరిన పరిణామాలను గూర్చి ఆలోచించుకుంటున్నాడు.

ఇంతలో బస్సు వచ్చి ఆగింది. కొంత భాస్కరం బస్సులో జొరబడ్డాడు. సీటులో పొందికగా కూర్చుని, తన కోరమీసాలను మెలిపెట్టుకుంటూ, బస్సు స్వగ్రామపు పొలిమేరల్లోకి వచ్చేలోగానే, తన పెళ్ళిని గురించి తీయటి కలలొకటి కనేశాడు భాస్కరం. ★




రుచికరమైన ఆహారపానీయం
విటమినులతో శక్తివంతమైనది
వేడినీటిలో కలిపి, త్రాగండి
పాలుగాని, పంచదారగాని
అనవసరం
శ్రీ గణేశ్ రామ్ & కంపెనీ, మద్రాసు-1.
స్టాకిస్టులు అన్నిచోట్లా కావలెను.

మీ ఇంటిని సంగీతముతో కలకలలాడేలా చేయుటకు
తక్కువ ధరలో ఒక సొగసైన నేషనల్-ఎక్కో రేడియో





అందమైన నేషనల్-ఎక్కో రేడియో మోడలు-717 పెట్టుకొంటే మీ యిల్లు సంగీతముతో కలకలలాడుతూ వుంటుంది! ఈ మోడలు, ఏసి/డిసి కరెంటుమీద పనిచేసేదిగా మరియు డ్రై బ్యాటరీమీద పనిచేసేదిగా, రెండు రకములతో దొరకుతోంది.
తక్కువ ధరతో దొరకే యీ మోడలు, రేడియో ప్రసారములను దివ్యముగా వినిపించును మరియు ఏళ్లతరబడి చక్కగా పనిచేయును. దీనితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. త్వరలోనే మీ దగ్గరలోనున్న ఏ నేషనల్-ఎక్కో వ్యాపారివద్దనైనా దీనిని పెట్టమని వినండి!

మోడలు 717 : బంగారు రంగు తాపడములతో మరూన్ రంగు ప్లాస్టిక్ క్యాబినెట్. మోడలు యు-717: 5 వాల్వులు, 3 బ్యాండుల ఏసి/డిసి సెట్.
మోడలు బి-717: 4 వాల్వులు, 3 బ్యాండుల డ్రై బ్యాటరీ సెట్.

రు. 250/- స్థానిక పన్నులు అదనము

నేషనల్-ఎక్కో రేడియోలు శ్రేష్ఠమైనవి...
అవి 'మూవ్ మూర్‌హెడ్' చేయబడినవి



జెనరల్ రేడియో & అప్లయన్సెస్ ప్రైవేట్ లి.
ఒపేరా హౌస్, బొంబాయి 4 • 3 మదన్ స్ట్రీట్, కలకత్తా 13
1/18 మౌంట్ రోడ్, మద్రాసు • 36/79 సిల్వర్ జూబ్లీ పార్క్ -
ఫ్రేజర్ రోడ్, పాట్నా రోడ్, బెంగుళూరు-లోగ్గియాన్ కాంపౌండ్ సివిల్ లైన్స్,
చాందినీచౌక్, ఢిల్లీ.

GRA 4417

(2 వ పేజీ తరువాయి)

## సి. కె. నాయుడు

క్రికెట్ నాయుడుగార్ని గూర్చి "తెలుగు వెలుగులు" (18-11-59) లో పరిచయం చేయడం హర్షించదగింది.

మునగవలస రంగారావు పట్నాయక్,
వేణమ్మపేట (శ్రీకాకుళం జిల్లా)

## పొరపాటులు

శంకర్ జైకిషన్‌ల స్వరలహరిలో, రచయిత పొరపాటుగా 276 మంచిపాటల పేర్లురాయడం మర్చిపోయారు అనుకుంటాను. వింత్రిగా తోచింది. కొన్నిపాటల గురించే రెండుసార్లు రాసేబదులు మరికొన్ని పేర్లు వేస్తే బాగుండేదిగా!

వి. పి. హెచ్. బసవరాజు (ఏలేటిపాడు)

## భిన్నరుచిః

స్వరలహరి అనేదాన్ని వ్యాసం అని పిలుచుటకు ముందు ఒకమాట చెప్పాలి. ఉదాహరణలుగా అన్నిపాటల జాబితా కొటలాగులాగ ఇవ్వడం ఎబ్బెట్టుగా తోచినది. ఇతః పూర్వము వచ్చిన వాటిలోకూడా ఇదే లోపం కనిపించినది. దిద్దుకుంటారు అనుకున్నాను. ఇక పైనైనను ఈ తప్పుచేయకుందురు గాక.

వి. రామశాస్త్రి (విజయవాడ)

## బర్మన్-మన్

కొన్నాళ్ల క్రితం, నా అభిమాన సంగీత దర్శకులు ముగ్గురి (ఎస్. డి. బర్మన్, ఎస్. డి బర్మన్, ఎస్. డి. బర్మన్, పైనా ఒక్క వ్యాసం వెయ్యాలని చెప్తూ నేను లేఖ వ్రాశాను. అది అచ్చు అయిందిగాని వ్యాసం మాత్రం ఇంకా రాలేదు. మీరు వెయ్యదలచుకోనక పోతే నా చందా రద్దుచేస్తాను.

వి. రామనాథం.

## పెళ్ళి మాట చెవితే త్రుళ్ళిపడే పరిస్థితులు

రత్నమహేశ్వర్ గారు సహజముగా రచించారు. కాని అమ్మాయిల విషయము చాలా ఎక్కువగా వ్రాసినందుకు చాలా విచారిస్తున్నాను. త్రుళ్ళిపడే పరిస్థితులు అబ్బాయిలకు కూడ కలుగుట సహజము. అమ్మాయిల విషయములో "సివిల్ వార్" అయితే, అబ్బాయిల పట్టుదలతో పెద్ద "కోల్డు వార్" బయలుదేరుతుంది. అబ్బాయి, అమ్మాయిలకు విజ్ఞానము వచ్చువరకు వివాహములు చేయటము శుద్ధ తప్పు అని అందరూ అంటూంటే పుట్టడముతో నే పెళ్ళయి పుడితే బాగుంటుందని రచయిత్రి వ్రాయడములో ఎంతవరకు సమంజసమని ధర్మసందేహం కలుగుచున్నది. "పేరంటానికి రండి" చాలా బాగుంది.

పాటీలు రామలింగారెడ్డి, బెంగుళూరు-6.

పెళ్ళిమాట చెవితే 'త్రుళ్ళిపడే పరిస్థితి" ఎందుకు రావాలో నాకర్థం కావటం లేదు. ప్రేమించి పెళ్ళి చేసుకున్న దంపతుల జీవిత నౌకలు బోల్తాకొట్టడం ఎన్ని చూడలేదు? నాకు తెలిసినంతలో ఇంతవరకు తల్లిదండ్రులు ఏర్పికూర్చిన దంపతులెవరూ పెండ్లి మాట చెప్పినపుడు త్రుళ్ళిపడనూలేదు, పెండ్లి అయ్యాక దుఃఖపడనూ లేదు!

కృష్ణకుమారిగారి "పేరంటానికి" ఊక దంపుడులా ఉంది.

కొప్పుల హేమాద్రి, గొల్లప్రోలు.

రత్నా మహేశ్వర్ గారి అభిప్రాయాలన్నీ చాలా బాగావున్నవి కాని, "నాన్సెన్స్, పెళ్ళికి ఈడేమిటి, అమ్మాయి అబ్బాయి లిద్దరొకరు ఎప్పుడు అర్థం చేసుకొని ప్రేమించుకుంటారో అప్పటినుంచె పెళ్లీడు" అన్న సరళ అభిప్రాయము నచ్చకపోవటము నాకేమి నచ్చలేదు. "పుట్టడంతోనే పెళ్లయి పుడితే బాగుండు" నన్న అభిప్రాయము చేత కానివారి ఖండవలసినదని నేననుకుంటున్నాను. రచనలో భాష ప్రాధాన్యమేకాని భావప్రాధాన్యము లేదని నా అభిప్రాయము.

పుష్పా రంగనాథ్, కాకినాడ.



'శ్రీ గొగినేని వేంకటేశ్వరరావు' గారు మైకా వ్యాపారమై జపానుకు విమానముపై 12-వ తేదిన వెళ్లిరి.





మీరు
సేవించేయడల
మీ దగ్గు త్వరితంగాపోవును




PAKCO పాక్కో స్లో-స్పీడ్, కోల్డు స్టార్టింగ్, క్రూడ్ ఆయిల్ ఇంజనులు

—: ప్రత్యేక లక్షణములు :—

* పనిచేయ ప్రారంభించుట తేలిక
* తక్కువ ఇంధన ఖర్చు
* క్రమమైన నడక
* దిట్టమైన నిర్మాణం
* ఎక్కువ మన్నిక
* అద్భుతంగా పనిచేయును
* ఫాస్కు-ఫ్యూయల్, ఇంజక్షన్ పరికరములు

మద్రాసు ఆంధ్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రములకు ఏజెంట్లు:

Grams: "LAMP" **K. S. SHIVJI & CO.**, (Estd. 1903)

Phone: 3617 పోస్టు బాక్సు నెం. 5, 178-79 బ్రాడ్వే, మద్రాసు-1.

సోల్ ఏజెంట్లు: దాదా & కంపెనీ,
86, తైనప్ప నాయక్ వీధి, మద్రాసు-1.






నల్లపరెడ్డి బ్రదర్స్‌వారి "పెదకోడలు"చిత్రంలో రంగారావు

ఈ సంవత్సరం ఆరంభంలో భయపడ్డారు చాలామంది – పై యేడాదిపరిస్థితి ఎలా ఉంటుందోనని. ఎలా ఉంటుందో చెబుతూ కొందరు ఊహాగాన సభలు కూడా చేశారు. పై యేటికి ఫిలింపాలంలో రూపాయల పంట సమృద్ధిగా పండడవల్లగు అప్పటి ఆర్థిక, సాంస్కృతిక స్థితిగతుల దృష్ట్యా అందులో కొంత సబబూ ఉండి వుండవచ్చు. కాని మన ఫిలిం వర్గ రాసమస్యల అమావాస్య, మెలిగా తెల్లబోయింది. పెద్దవాళ్ళు పెద్ద ఆలోచనలు చేస్తు ఉండగా చిన్నవాళ్ళు, కొత్తవాళ్లు ఉత్సాహంతో వచ్చి మిణుగురులా ఇంద్రుణ్ణి వెలిగించారు. ఈయేడాది చాలా మంది కొత్త నిర్మాతలు వచ్చారు. వారివెంట చాలా కొత్తదనం వచ్చింది. దినివెంట చాలా కొత్తదనంకూడా రాబోతూందని నిర్మాణంలో ఉన్న చిత్రాలు తెరవాలు చెబుతున్నాయి. కొత్తనటులు నలుగురైదుగురు వచ్చారు. హరనాథ్, సత్యనారాయణగరు, కృష్ణ, రామకృష్ణ మొదలగువారు. అంతకు ముందు వచ్చినకొత్త వాళ్ళదరూ–రమణమూర్తి, బాలయ్య సంపూర్ణంగా పించుకుని నిలబడ్డారు. కొత్తనటీమణులు లిద్దరు – మహానందరావు (సతీ తులసి), కామినిశు (మాయింటిమహాలక్ష్మి) వచ్చారు.

చాలా చిత్రాలు ఇటీవల ఆరంభమైనవి, నివార్యానివార్య కారణాలవల చాలా కాలంగా పూర్తికాకుండా ఉన్నవి ఇపుడు చురుకుగా తయారవుతున్నాయి. కొన్ని శరవేగంతో తయారవుతున్నాయట వీటిలో కొన్ని శిరాలు సంక్రాంతికి గురి పెట్టినవి ఉన్నాయి. పరిస్థితులూ, విడుదలకు హాలు దొరకడం వగైరాలూ అనుకూలిస్తే వేళకి వెళ్లి వాలుతాయి. లేనిచో లేదీ అటు ఇటుగా జరుగవచ్చు.

రావలసినవాటిలో రాజముకుటం, నమ్మినబంటు, శ్రీ వెంకటేశ్వర మాహాత్మ్యంవంటి భారీచిత్రాలు ఉన్నాయి. రెంటిలోను పెద్ద నటీనటులున్నారు. పెద్ద నటవర్గంతోనే నాలుగు నెలల వ్యవధి (మొత్తం)లో రాజశ్రీవారు పూర్తి చేయబోతున్న — 'శాంతినివాసం' కూడా సంక్రాంతికే వస్తుందని నిర్మాతలు తెలియజేశారు. ఆ ప్రాంతాలకే శ్రీ రాజరాజేశ్వరీవారి సాంఘికం రావచ్చు. భరణీవారి ఎండమావులు ఆ తరవాత, మార్చి ఏప్రిల్ ప్రాంతాలలో వస్తుంది. ఈ సంక్రాంతిలోపల రాగల ఇతర చిత్రాలలో పద్మశ్రీ వారి జగన్నాటకం, నగేశ్ చిత్రవారి మగవారి మాయలు, (ఈ రెండిటిలోను అమర్ నాథ్ ముఖ్యనటుడు), ఎ. ఎ. వి. వారి '[illegible]' ([illegible]) ఉన్నాయి. కొత్తఅటూ ఇటూగా–బహుశా ఇటేగా శ్రీరమా ఫిలింస్ వారి భక్త అంబరీష, (డిసెంబరు తొలివారం) వస్తుంది. ఈ నెల 28 న విశాల్ (వద్దంటే పెళ్లి) ప్రొడక్షన్స్‌వారి 'పెళ్లి మీద పెళ్లి', విడుదల అవుతుంది. రేణుక, ఇల్లాలి పెళ్ళి దీపావళి రానున్న మరికొన్ని...

అనువాద చిత్రాలలో టి. నల్లపరెడ్డి బ్రదర్స్‌వారి 'పెద్దకోడలు' ఈ నెల 20 న వస్తోంది. డిసెంబరులో మరిరెండు– బసంత్ పిక్చర్స్‌వారి 'హనుమాన్ పాతాళ విజయం' సాజ్ ప్రొడక్షన్స్‌వారి 'మహాలక్ష్మి మహిమ' విడుదల అవుతున్నాయి.

## ఉత్తర దిగ్విజయం

మాతెల్లవాడు ఎల్. వి. ప్రసాద్ గారు హిందీచిత్రం నిర్మించాలని ఆలోచన చేసినపుడు కొందరాయనను నిరుత్సాహ పరచారు; పడ్డారు. ఉత్తరాదివాళ్లతో సెగ్గుకు రావడం సామాన్యం కాదన్నారు; అనుకున్నారు. తరవాత నాలిక్కరుచుకోవలసి వస్తుందని పెసమ చిరిచారు. ఈ నాలుగున ప్రసాద్ గారి హిందీపిక్చర్లు రెండూ హిట్ అయ్యాయి కాబట్టి హాతాత్తుగా ఆనాటి శ్రేయోభిలాషులందర్నీ హేళనచెయ్యడం ఈ వాక్యాల ఉద్దేశ్యం కాదు; శ్రేయోభిలాషులు కాబట్టే కీడెంచి మరీ మేలెంచమని అంటారు కానివాళ్లు, 'సైదోడు' వాళ్లు అయితే, ఎవరైనాసరే హాలివుడ్ వెళ్ళి టెన్ కమాండ్ మెంట్స్ తీస్తానంటే ఇరికోఇవాళే బయల్దేరండి, వీలైతేనన్నూ తీసుకెళ్ళండి అంటారు. ఎవరికైనా సరే సన్నిహితులంతా హితులు కారు.

మొత్తానికి, తలపెట్టిన పనికి బొమ్మా బొరుసూ కూడా తెలుసుకొని, తనకి సహజమైన నెమ్మదితో ప్రసాద్ గారు బొంబాయి వెళ్ళారు. ఆయన తొలిచిత్రం 'శారద' జౌనవిపించుకుంది; డబ్బూ గడించుకుంది. రెండోది—ఛోటీబెహన్; రెండిందాలా అంతకు రెండాకు లెక్కువేఅయింది. ప్రశంసలూ, రూపాయలూకూడా భారీగా దక్కాయి. ఊరుకాని ఊర, దక్షతగల నిర్మాతగా, ప్రతిభగల దర్శకుడుగా ప్రసాద్ గారు ఉత్తరాదుల గౌరవాభిమానాలు చూరగొన్నారు. వాసన్, మెయ్యప్పన్ లు భారీ ఎత్తున బయల్దేరివెళ్లి విజయంసాధిస్తే,ఈయన అంతకన్న నెమ్మదిగావెళ్లి గెలుచుకొన్నారు. విశేషం ఒక్కటే ఉంది, కాలం నాడు– [illegible]



రాజశ్రీవారి కొత్తచిత్రం 'శాంతినివాసం'లో నాగేశ్వరరావు, సూర్యకాంతం, సురభి బాలసరస్వతి.

పేరుకొనివాడు—ఆయన మొట్టమొదట సి...నీ...మః...లు నేర్చుకున్నది బొంబాయిలోనే. మెప్పు మెహర్బాని లేకుండా తిరిగిన ఆరోజుల్లో ఉత్సాహం, ధైర్యం అప్పు తెచ్చుకొన్నది బొంబాయి వీధులలోనే, కలలుకనీ, అవేతనీ తిరిగింది అక్కడి స్టుడియోలలోనే. అక్కడ పనులు-ఇంచుమించు అన్నిరకాలూ నేర్చుకొని దక్షిణాదికివచ్చి మెట్టుమెట్టే ఎక్కి, ఈనాడు ఆయన తిరిగి ఒకనాడు కట్టెపనిమ్మినచోట పూవులమ్మి అందరినీ అలరించారు.

* * *

ఉత్తరభారతంలోను, హైదరాబాద్ నగరంలోనూ 25 వారాలు విజయవంతంగా నడచి రజతోత్సవాలు జరుపుకొన్న 'ఛోటీ బహన్' గతవారం సుల్తాను ప్లాజా సినిమాలో విడుదల అయింది. లోపాలపాలు అమిత మితంగా నిలిపి, సుఖదుఃఖాలను మితి తప్పని పద్ధతిలో మేళవిస్తూ అన్నాచెల్లెళ్ల అపేక్షను, పొరబాటుమీదపోయి తోటివారిని బాధపెట్టేవారి తీరుతెన్నులను హృదయంగమంగా చిత్రించిన ఈ కథలో, (ఆంధ్ర వారపత్రిక ఏప్రిల్ 8 సంచిక) బలరాజ్ సాహ్నీ, నందా, శ్యామ, మహమూద్, రెహమన్ సుభాఖోటే, రాధాకిషన్ ధుమల్ మొదలగువారు నటించారు. సంగీతం శంకర్ జైకిషన్‌లు సమకూర్చారు. సకుటుంబంగా

# తెర వేలుపులకు ఎరలు

లలితకళలన్నిటా డబ్బుతో పోటీ జాస్తిగా ఉంటేనే సినిమాలే నంటారు. ఈరోజున అంతా రూపాయల భాషే వినబడుతుంది. సత్యం ఎప్పటికైనా ఖంగున మోగుతుందనే వారు లోగడ. ఈనాడు 'ఖంగున' మోగేదే సత్యంగా చెలామణీ అవుతోంది. ఇప్పుడు డబ్బే కార్యం; డబ్బే కారణం. అందువల్ల ఈరోజున సామర్థ్యం సదాశయం ఉన్నవారు కూడా 'పెంచేస్తాం డబ్బుకోసం తప్పదు' అంటున్నారు. కొందరు డబ్బుకోసం పెద్ద తారలను తెచ్చుకొని, వారికోసం ఎలా పెడితే అలా సినిమా తీస్తున్నామంటున్నారు. తారలూ ఈభాషే మాట్లాడుతారు. డబ్బుకోసం వేషానికి ఒప్పుకుని, అందుకోసం ఎలా వెయ్యాల్సివస్తే అలా వేస్తున్నామంటున్నారు. ఏ సినిమా నిర్మాతతోనైనా పది నిముషాలు మాట్లాడితే సమస్య చర్చకురాక మానదు. హాలివుడ్ నుంచి అండమాన్స్ వరకూ ఇదే వరస.

గతవారం హాలివుడ్‌లో, ఎలిజబెత్ టేలర్‌కి క్లియోపాత్రా పాత్రధారణకు ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్‌వారు ఇవ్వజూపిన డబ్బు అందరినీ హడలగొట్టింది. చిత్రం లాభాలలో వాటా తీసుకుంటూగా అక్కడ తారలు. ఆ ప్రకారం. లెక్కకట్టి ఫాక్స్ ఒప్పుకొంది. ఇంత రుసుము ఒకనటికి ఇదివరకెవరూ ఇచ్చి ఎరగరు.

హాలివుడ్ ఏలికలు పదిమంది నటీనటులు ఉన్నారు. హూవర్, గేబుల్, జిమ్మీస్టీవర్ట్, మొదలైనవారు. ముఖ్యంగా ఈ పదిమందీ పుచ్చుకునే రుసుములగురించి నిర్మాతలు అంతా తెరవెనుక మధనపడుతునే ఉన్నారు.

అయితే వీరివల్ల వచ్చేది పోలేదన్న స్త్రీలు మూకిచ్చేదీ పోలేదుండడం న్యాయం అని టోనీ కర్టిస్ వంటి రెండోతరగతి నటుడే వాదించాడు. అతనికి డిఫయంట్ వన్స్ చిత్రంలో వచ్చిన వాటా ఐదులక్షల డాలర్లు. వైకింగ్స్ అనే చిత్రంలో రాబోయేది 9 లక్షల పైచిలుకు.

తారాగణంవల్ల ఖర్చులు తారాపథాన్ని అంటాయనే వారు కిందటి తరంలో ఖర్చులూ పరిశీలించాలి. ఆనాడు మేరీ పిక్‌ఫర్డ్ వారానికి ఇరవై వేలు తీసుకునేది. అప్పట్లో చిత్రం తీయడానికయ్యే ఖర్చులో ఇది నూటికి ఒకవంతు అంటే నవ్వొస్తోంది. ఈరోజున ఒక బాక్సాఫీస్ స్టార్‌కు ఒక్క చిత్రం మీద వచ్చేది చాలా ఎక్కువే అయినా పన్నుల ధర్మమా (ఈ సమస్యపై అన్ని దేశాలవారు అవగాహనగా ఉపన్యసిస్తారు) అని వారికి మిగుల్చుకో గలిగేది ఆనాడు పిక్




# తెన్నులు

మనము ఇలా అధోగతిలో పడిఉన్నాం. మిగతా దేశాలవాళ్లు దర్జాగా కొత్త కొత్త తరహా చిత్రాలు తీస్తారు. వాళ్లకి ఈ సెన్సారు బెడదలు లేవు. ఎంతసేపూ మనం చుట్టూ సున్నా చుట్టుకుని అందులోనే గిలగిల లాడుతున్నాం. గిరగిర తిరుగుతున్నాం అన్నాడొక తెలుగుసినీమనిషి ఉద్వేగంతో. ఆయన అన్న ఈమాటలన్నిటికీ తాత్పర్యం ఒక్క ముక్కలో ఇమడదు. ఇందులో నాలుగైదు అంశాలున్నాయి.

ఆయనచెప్పిన ఆ "వాళ్లు" అనిపించుకునే వాళ్లూ ఇంచుమించు ఈమాటలే అనుకుంటున్నారు. వాళ్లకీ సెన్సారు సమస్యలు ఉంటూనే ఉన్నాయి. వాళ్ళలోనూ చాలా మంది. సున్నాలలోపలే గిరగిర తిరుగుతున్నారు. వాళ్ళు పదేళ్ల క్రితం ఉన్నస్థాయినిబట్టిచూస్తే వాళ్ల ప్రగతివేగం సాలుకు కొలకొద్దీ మైళ్లలో సాగుతుందని చెప్పలేము, అలాగే మనం మన పాతస్థితినితలుచుకుంటే, అక్కడే ఉన్నామనీ, లేదా వెనక్కు పోతు ఉంటుంది. ఎప్పుడూ ఓ పువ్వు పూస్తూనే ఉంటుంది. ఎటొచ్చీ అందులో మనప్రయత్నం ఏపాటి ఉందీ అన్నది ఆలోచించాలి. ప్రయత్నంఉంటే మరికొంత మంచి సాధించేవాళ్ళం అని గుర్తించాలి.

ఇందాకటి సినీ మనిషి పేర్కొన్న 'వాళ్ల' స్థితిగతులు తెలుసుకోవడం కూడా మనం ఉత్సాహం తెచ్చుకోవడానికి-కనీసం నిరుత్సాహం పోగొట్టుకు ధైర్యం తెచ్చుకోడానికి తోడ్పడుతుంది.

'వాళ్ల'లో మనకి దగ్గిర చుట్టాలయిన హాలివుడ్ వాళ్లు' తాలూకు సినీకాలచక్రం తిరిగి తిరిగి కాస్ట్యూమ్ చిత్రాల ఘట్టానికి వచ్చింది. ప్రధానంగా భారీఖర్చుతో తారలతో చిత్రాలు తలపెడుతున్నారు. రెండవ శాఖవారు-ఖర్చు తక్కువ అయినా. వసూళ్లు భారీగా లభించేలా సెక్సు, నేరాలను ప్రయోగిస్తున్నారు. 1958 లో ఈరకం చిత్రాలకు బాగా డబ్బొచ్చింది; మహా చెడ్డపేరూ వచ్చింది.

అలా చెడ్డపేరూ మంచిడబ్బూసంపాదించుకున్న కొన్ని చిత్రాలను పట్టుకుని నీతిపరులు సినిమా లన్నిటినీ మూకఉమ్మడిగా తిట్టిపోశారు. ఒక సందర్భంలో ప్రొడక్షన్ కోడ్ ఆమోదంపొందిన చిత్రానికే అధికారుల శాసనం అడ్డుపడింది. కథ ఉన్నత న్యాయ

అంగా సర్వహక్కులూ ఉన్నాయి. కాదన డానికి వీలులేదు అని కోర్టు తీర్పు.

ఈమధ్య అనాటమీ ఆఫ్ మర్డర్ అనే చిత్రంపై పోలీసు సెన్సారుబోర్డు పేరిట ఆరుగురు స్త్రీలు విమర్శచేసి ఒకరాష్ట్రంలో ప్రదర్శనం నిషేధించారు. ఆ చిత్రాన్ని విమర్శకులంత మెచ్చుకున్నారు. సామాన్యులంతా చూసి బాగుందన్నారు. అందులో ఒక స్త్రీని చెరచే సన్నివేశం కొంచెం మితిమీరిందని కొందరనుకున్నారు. కాని మహిళామండలి ఆ చిత్రం నిషేధించడానికి ఈ సన్నివేశం ముఖ్యకారణం కాదు. చిత్రం మొత్తంమీద సంభాషణలు కటువుగా విన తగనివిగా ఉన్నాయన్నది. ఇలా ఆరుగురు ఆడవాళ్లకు నచ్చనందువల్ల అరవై లక్షల మందికి ఒక చిత్రంచూసే అవకాశం తప్పిపోవడం దారుణం అని అక్కడి ప్రముఖ విమర్శకులు అన్నారు. సెన్సారుపేరిటసాగే అధికారుల ఓ ఘాయిత్యాలకు ఇదొక పెద్ద నిదర్శనం అని న్యూయార్క్ టైమ్స్ విమర్శకుడు బాస్లీ క్రౌదర్ వ్రాశాడు.

## మిలియన్

## డాలర్ల పెట్టు తిట్టు

ఆ మధ్య, సోవియట్ ప్రధాని నికితా కృష్చేవ్ అమెరికా వెళ్లినప్పుడు హాలివుడ్‌లో కాన్ కాన్ డాన్సు (కిందటి శతాబ్దపు ఫ్రెంచి నృత్యం) షూటింగ్ చూశాడు. అది చాలా అసభ్యంగా ఉందని అన్నారు సినిమావారికి-ముఖ్యంగా హాలివుడ్‌కు పబ్లిసిటీకి ఏదైనా ఉపయోగపడుతుంది. కృష్చేవ్ తిడితే, ఆ తిట్లే ప్రకటించి ఆయన ఇలా తిట్టిన చిత్రం చూడండి అని ప్రచారం చేస్తారు. ఆ ఒక్క తిట్టు పదిలక్షల డాలర్ల పెట్టుఅని అక్కడివారంతా సంతోషపడ్డారు. అసలాయన ఆ డాన్సును ముందర చూసినప్పుడు బాగానే ఉందని సంతోషించారని కొందరి నమ్మకం. అందువల్ల, కృష్చేవ్ ముందర భూషించి ఆనక దూషించిన చిత్రం అంటూ ప్రచారం చేయాలని సినీపతులూ, ప్రచారమతులూ సరదాపడ్డారట. కాని దానికి అధికారరీత్యా ఆమోదం రాకపోవచ్చుననుకుంటున్నారు.

మొత్తానికి కృష్చేవ్ విమర్శను హర్షించిన అమెరికన్ చలచ్చిత్రకారులను చాలామంది పెద్దలు కూడా దుయ్యబట్టారు.



ప్రకాశ్ వారి 'రేణుకామాహాత్మ్యం'లో జి. వరలక్ష్మి, జగ్గయ్య

అయితే ఇలా ఎవరో కొందరు ఏవో కొన్ని 'అసభ్య' (సెన్సారు దృష్టిలో) చిత్రాలు తీసినంతమాత్రాన, పరిశ్రమ నంతటినీ తిట్టడం సబబు కాదనీ, తయారవుతున్న మొత్తం చిత్రాలలో వీటి సంఖ్య తక్కువే ననీ కొందరు అన్నారు. డబ్బుతోపాటు పేరు గల చిత్రాలకోసం కథలు దొరక్క తాపత్రయపడుతూ వుండగా వచ్చే కొసిని కథలను తిట్టడం తగవుకాదని వారి నమ్మకం. ఈరోజున హాలివుడ్‌లో చక్కని కొత్త కథలతో తీసే చిత్రాలు తక్కువ. టెలివిజన్ పోటీ, పరిశ్రమ ఆర్థికస్వరూపం, మార్కెట్ స్థితిగతులూ మొదలైన కారణాలవల్ల ఎక్కువగా పాతకథలను పాత చిత్రాలను తిరుగ వ్రాసి భారీ ఎత్తున చిత్రాలు తీయడమే వ్యాపారరీత్యా లాభసాటిగా ఉంది. ఈ తరహా చిత్రాలలో ఎం. జి. ఎం. వారి 'బెన్ హూర్' చాలా పెద్దచిత్రం...ఈ చిత్రం నిడివి 31 రీళ్ళట. ప్రతిభగల కొత్త తరం దర్శకులు కూడా ఈ భారీ చిత్రాల బాక్సాఫీసు సూత్రాలమధ్య ఇరుక్కు చిక్కడిపోయి ఉన్నారు.

## బ్రిటన్

### సంచలన చిత్రాలు

బ్రిటన్‌లోనూ కొత్త ప్రయత్నాలకు ప్రతిఘటన ఎక్కువగానే ఉంది. అక్కడ భారీ చిత్రాల నిర్మాణం భారీ ఎత్తున జరగడం అరుదు. సాధారణంగా కామెడీలూ, విశిష్టమనతగ్గ (హాలివుడ్ పైన) స్థాయిగల అపరాధ చిత్రాలూ తీస్తారు. కాబోయిన క్లాసిక్స్ కూడా తీస్తున్నారు. గత సంవత్సరం ఒక్క బిగిన హారర్ చిత్రాల రకం వచ్చిపడింది—డ్రాకులా వంటి జనానికి జ్వరం వచ్చేరకం సంచలన చిత్రాలు, గుండె ఆపేసే రకంవి తీశారు. జనం కొల్లలుగా వెళ్ళి జ్వరం తెచ్చుకున్నారు. గుండె ఆపుచేయించుకున్నారు కొందరు. "జనానికి ఇలాటివి ఇష్టం. నాకూ అంతే" అన్నాడు ఆ తరహా చిత్రాల నిర్మాత. అలవాటు ప్రకారం సెన్సార్లు, పత్రికలవాళ్ళు హాహాకారాలు చేశారు. ఈ కారణంతో హాటే సెక్స్ ట్రాజెడీ చిత్రాల యాక కూడా రాబోయి తగ్గింది.

"ఈ కామెరా లెన్స్‌కి కళాత్మకమైన దృష్టి ఉంది" అని చెబుతూ నగ్న దృశ్యాలు ఉన్న చిత్రాలు తీశారు. ఇది ఆరోగ్య వ్యాప్తికి తోడ్పడం చేస్తుందన్నారు. వీటిని బ్రిటిష్ సెన్సార్ ఆమోదించింది. ఈ రెండూ తప్ప విడిచి బ్రిటన్‌లో చర్చనీయమైన ధోరణులు ఏమీ కొట్టవచ్చినట్టు కనబడలేదు.

చర్చనీయమైన తరహా ఉన్నవి రెండు చిత్రాలు వచ్చాయి గాని, ఒపక్క చర్చలు జరుగుతున్నా, అవి చర్చనీయమైన వవునా కాదా అన్న చర్చ కొన్ని చోట్ల ఇంకా తెమలలేదు. **కొందరు ఇది వట్టి వయోజనో**ద్యమం అని కొట్టిపారేయబోయారు. కాని అది వచ్చినంత హడావుడిగా వెళ్ళేటట్టులేదు. ఈ ఉద్యమానికి 'ఆంగ్రీ యంగ్ మన్ ఉద్యమం' అని నామం ఉంది. కాని ఇది సినిమాలో పుట్టినది కాదు. సారస్వత రంగస్థలం మీద.

కొన్నాళ్ళ క్రితం బ్రిటిష్ కవి టి. ఎస్. ఇలియట్ ఒక సందర్భంలో మాట్లాడుతూ నేటి కవిత నీరసించిపోతోందన్నారు. ఆంగ్రీయంగ్ మన్. జీవితమే సర్వతోముఖంగా నీరసించిపోతుందన్న నినాదంతో నిన్నటివైన అన్నిటిపట్లా నిరసన, నేటిపట్ల అసంతృప్తి, కోపం ప్రకటిస్తూ గర్హణే పాశ్చాత్య నిశ్వాసాలుగా ఈ ఉద్యమం ఆరంభించారు. ఇందులోంచి పుట్టిన రచనలలో రెండు నాటకాలు సినిమాలుగా కూడా వచ్చాయి. 'లుక్ బాక్ ఇన్ ఆంగర్' అనే నాటకం లండన్ స్టేజిమీద పెద్ద విజయం సాధించింది. అరమరిక లేకుండా నోటికొచ్చినట్లు మాట్లాడడం దీని ప్రత్యేకత అని ఒక విమర్శకుడు హేళన చేశాడు. మొత్తం మీద, అందులో ఆంగ్రీయంగ్ మన్ నాటకం చూస్తే సానుభూతి అట్టే కలగదు. నిష్కారణం కీచపడుతున్నాడు ఆర్నెల్ల తరవాత స్తిమితపడతాడనిపిస్తుంది. ఇందులో అతను తనబాధను ఎదుర్కొనడానికి పోగొట్టుకొనడానికి ఆలోచనా చెయ్యడు; అతని కోపం, తిక్క కూడా (తిక్క అనేది సహజం కాకపోయినా) సహజమైనవి, నిజమైనవి కావనిపిస్తుంది. మొత్తానికి బ్రిటిష్ చిత్రరంగంలో హడావుడి చేసినవి ఇవే. ఈ ఉద్యమం నిలదొక్కుకుంటుందో లేదో తెలీదుగాని, ప్రస్తుతానికి బాక్సాఫీస్ హిట్.



శ్రీరామా ఫిలింస్ వారి 'భక్త అంబరీష'లో మీనాకుమారి, పద్మనాభం, కాంతారావు.

## ఫ్రాంసు

### గోడమీది రౌరవం

ఫ్రాంసునుండి వచ్చిన ఒక ఉత్తమ చిత్రం 'లే అమాంత్' తాలూకు పోస్టరు లండన్ రైల్వే స్టేషన్లలో ఇటీవల నిషేధించారు.

ఫ్రాన్ అనగానే అందులో ఏదో ఓఘాయిత్యం ఉంటుందని, ఖరితెగించిన బాపతు బొమ్మలు, మాటలు ఉంటాయనీ అనుకుంటారంతా. ఫ్రెంచి చిత్రాలమీద ఫ్రాన్ అంటే మరీను. కాని ఇక్కడ కారణం అలాటిది కాదు. ఆ పోస్టరు మీద బొమ్మ ప్రపంచమంతటా గౌరవం పొందినది. అది రోడిన్ శిల్పం 'ది కిస్'కు ప్రతి చిత్రం. స్త్రీ పురుషులిద్దరు వివస్త్రులై కౌగలించుకొని ఉన్న బొమ్మ అది. ఆ బొమ్మ పోస్టరు మీదకు ఎక్కి, ప్రతిచోటా ఉంటే గోడమీదిబొమ్మ ఆర్టిస్టులకు అందుబాటులో ఉంటే (బొమ్మ ఎత్తుగా అంటించినా 'ఉత్సాహవంతులకు' అందనిది కాదుగదా) వారు దానిమీద గీయరానిగీతలు గీసి వ్రాయరాని వ్రాతలకు ఆస్కారం కల్పించి దాని గోడమీది గౌరవాన్ని కూడా నేలపడింపేస్తారన్న భయంతో అధికారులు ఈ నిషేధం అమలుచేశారు. గోడల

# ★ చలనచిత్రాల తీరుతెన్నులు ★

మీద తమలోని అజ్ఞాన ప్రజ్ఞను ప్రదర్శించి గోడలను బొమ్మలను కూడా భయంకరంగా తయారు చేసే అజ్ఞాత చిత్రకారులు ఎక్కడ చూసితే అక్కడే ఉన్నారు మరి.

మొత్తానికి ఈ పోస్టర్ లాగే దీనితాలూకు చలనచిత్రంకూడా లండన్‌లో సంచలనం కలిగించింది. మానవసహజమైన కామం, వస్తువుగా కథకట్టి తీసిన ఈ చిత్రం ఈ తరం మంచి ఫ్రెంచి చిత్రాలకు మచ్చుతునక అని విమర్శకులంతా మెచ్చుకున్నారు. లండన్ సెన్సార్లు మటుకు అన్యథా భావించి, అందులో ప్రేమఘట్టం కత్తిరించి కాముఘట్టం అనిచెప్పి అది తీసేశారు. అది తీసి వేస్తే ఆ చిత్రంలో మిగిలిన సలభై నిముషాలూ (ఆ దృశ్యం 20 నిముషాల ఏర్పాటు) నిస్సారమైన దవుతుందని, ఉట్టి నీతికథ అనీ నిర్మాతా, విమర్శకులూ వాదించారు.

సెన్సారు లేమన్నా మొత్తానికి, బ్రిటిష్ ఫిలిం ఇన్‌స్టిట్యూట్ సభ్యులుమాత్రం ఈ చిత్రాన్ని ఈ తరం చలనచిత్రకారులు తీసిన మరికొన్ని గొప్ప చిత్రాలను వార్షించి, ప్రత్యేక బహుమతితో ఈ తరం కళాకారులను సత్కరించారు. కొత్త ప్రయోగాలు జరిపి కొత్తమార్గాలు కనిపెట్టాలన్న తపన, కృషి ఫ్రెంచి లలిత కళాకారులలో ఎక్కువ. కిందటితరం చలనచిత్ర దర్శకులు-కాక్టో, క్లూజోట్ ప్రభృతులు చేయగలిగినది చేశారని, ఇప్పుడు వారు డాక్యుమెంటరీలు (మన డాక్యుమెంటరీల వంటివి కాదు) తీసున్నారనీ, ఈ తరం బృందం వచ్చి ఉద్ధృతమైనశక్తితో కొత్తచిత్రాలు తీయడం ఆరంభించి సత్ఫలితాలను సాధిస్తున్నదనీ ఒక విమర్శకుడు వ్రాశాడు. ఫ్రెంచిదర్శకులు సాధారణంగా తమే కావలసిన కథ కల్పించుకొని కావలసినవిధంగా తీస్తారు. అక్కడి చిత్రాలు సాధారణంగా ఒక్కొక్కటి ఒక్కొక్క దర్శకుడి రచనగా ఉంటాయి. నటులూ ఛాయాగ్రాహకులూ మొదలకువారంతా ఆ రచనలో వాక్యాలే తప్ప వాక్యకారులు కారు.

ఈ తరంవారికి-అంటే వీరిలో చాలామంది, ఆంగ్రీ యంగ్‌మన్ ఉద్యమానికి చెందినవారు-అయినా, వీళ్లందరిమీదా మూకుమ్మడిగా ఒక ముద్రవేసి వీరిపద్ధతిఇదని గీతగీసి గోడకట్టడం ఏ వొక్కరికీ గిట్టదు. వీరు స్టుడియోనిర్మాతల కథలూ తీసుకోరు; అలాగని వాళ్లు "స్వంతి పైత్యం"తో కత్తి లేకుండా కథకట్టి ప్రేక్షకులపై వదలంతాన రుద్దరు. సమకాలిక జీవితాన్ని, సామాన్యుని హృదయాన్ని అర్థంచేసుకొని ఆవిష్కరించడం వీరి మతం. మానవుడు వీరి ఇష్టదైవం. ఈ చిత్రాలలో ముఖ్యపాత్ర'అంటి-హీరో' సినిమాలో బాక్సాఫీస్ హీరోకు వుంటున్న లక్షణాలతో పోలిస్తే 'అంటీమాటర్'లాంటి మాట అని మనకనిపిస్తుంది. బాక్సాఫీస్ మాత్రకారులు ఇతన్ని "హీరో కాదు; జీరో" అనవచ్చు.

సమకాలిక జీవితం మహాసంగ్రామంలా ఉందికాబట్టి ఏరోజుకారోజు బ్రతకడం హీరాయిజం. బ్రతికే సామాన్యులుకూడా హీరోలే. ఫ్రెంచిచిత్రాల హీరో సామాన్యుడే. ఇతను ఒకసారి భయపడతాడు. ఓసందర్భంలో ఎదిరిస్తాడు. ఓడిపోతాడు, గెలుస్తాడు.

ఈదృష్టితో సామాన్యుల కథలు చెప్పడం ఈనాటి ఫ్రెంచి చిత్రాల పద్ధతి.

గత సంవత్సరం ఈ కోవకుచెందిన దర్శకులు సుమారు 80 మంది అయినా చిత్రాలు తీసిఉంటారు. ఇంచుమించు ఏ ఒకరికీ సినిమాల అనుభవం లేదు. అయినా ఎనిమిదిమందికి ఈ తొలి చిత్రాలలోనే మంచిపేరు వచ్చింది. చిత్రాలకు డబ్బూ వచ్చింది. మార్సెల్ కేమస్, లూయిస్ మాల్, ఫ్రాంకోయిస్ ట్రుఫో, క్లాడ్ షాబ్రోల్ వీరిలో కొందరు.

అయితే ఒకటే చిన్న అపశ్రుతిఉంది. ఈ కొత్తతరంవారు తీసిన చిత్రాలలో సాధారణంగా జీవితంఅంటే సెక్సు అనే తాత్పర్యం అయినట్టు తోస్తుందని ఒక విమర్శకుడు అన్నాడు. చిత్రల్లో కూడా సెక్సుకు విశేష ప్రాధాన్యం ఇస్తారు. ప్రేమఘట్టాలు సినీ- కొత్తపద్ధతిలో, కొత్తతరహా కామెరా శిల్పంతో తీస్తారు. అంతకుమించి స్థూలంగా లటేలో ఎన్నతగ్గ దృక్పథం, తత్వం ఏవీ ఉన్నట్టు కనబడదు. గట్టిపునాది ఉన్నట్లు తోచదు.

ఉదాత్తబుద్ధితో తీస్తున్నా, ఇక్కడా సెన్సారుబాధ తప్పలేదు. ఫ్రెంచి వాళ్ళకి సెన్సారు బెడదలు వుండవని పలువురి నమ్మిక. అక్కడే సెన్సారు కలగజేసుకుంటే అదెంతదారుణమో అనుకుంటారు.

కొన్నివిధాల ఆమాటా నిజమే. మిగతా దేశాలకన్న అక్కడ ఆంక్షల హద్దులు ఎత్తుగా విశాలంగా వున్నా, అక్కడి వారికి అవి ఇరుకే. అందులో చెడ్డవాళ్ళు ఉంటారు. మంచివాళ్లూ వుంటారు. ధనబుద్ధులూ ఉంటారు; ఘనబుద్ధులూ ఉంటారు. అందరూ ఉప్పూ కర్పూరంలా చూట్టానికి ఒకలాగే ఉంటారు కాబట్టి సెన్సారువాళ్ళు పరిహద్దు సవిగట్ట లేక ఒక్కొక్కసారి అన్యాయంచేస్తారు మరి.

ఈ సినిమాలవల్ల పిల్లలు పాడైపోతున్నారన్న ఉద్యమం అక్కడా వుంది. ఆ మోకాలో ఆరుగురు మహిళలూ, న్యాయమూర్తీ 13 వేలమంది తల్లులూ ప్లస్ శ్రీమతి లీలావతీ మున్షీ, ఉన్నట్టే అక్కడా నీతిసంరక్షకులు ఉన్నారు.

అందుకని పెద్దల చిత్రాలను చూడతగ్గ పిల్లల వయస్సును 16 నుండి 18 కి పెంచాలని

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు అక్టోబరులో నిర్వహించిన అంతర్ కళాశాల యువజనోత్సవ సందర్భమున ఏకాంక నాటిక పోటీలలో ఉత్తమ నాటికగా ఎన్నుకొనబడిన 'పాపిష్టి డబ్బు'లో పాల్గొనిన మిసెస్. ఎ. వి. ఎన్. కళాశాల నాటకబృందం. యూనివర్సిటి రిజిస్ట్రార్ శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి, రచయిత అంగర సూర్యారావుగారలతో.

ప్రభుత్వం ఆలోచిస్తున్నది. అలాగైతే సినిమాపరిశ్రమ పెద్దదెబ్బ తింటుందని నిర్మాతలు భయపడుతున్నారు. కారణం: ఈ 16–18 ఏళ్ళ పిల్లలే ఫ్రెంచిసినిమాకి ముఖ్యమైన పోషకులు. (అన్ని దేశాలలోనూ ఇంతే) వీరి సంఖ్య పడిపోతుంది. వీరిలో నూటికి 90 మంది నెలకు 42 సార్లు సినిమాకి వెళ్తారు.

ఇంట్లో ఇంత గందరగోళంగా ఉన్నా, విదేశాలలోమాత్రం ఫ్రెంచిచిత్రాలు ప్రపంచదేశాల గౌరవాభిమానాలు బహుమానాలూ, చాలా ఫ్రాంకులూ సంపాదించుకుంటున్నాయి.

ఈ ఏడాది ఫ్రాంసులో 84 కథాచిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి.

## డీసీకా దేశం
### నిజంవల్ల నిర్వేదం

ఇటలీ ప్రస్తుతం కళ్ళు చెదిరిపోయేలా ప్రకాశించటంలేదు–విట్టోరియో డిసీకా అతనితో మరొకరిద్దరూ ఒకటీ అరా చిత్రాలు తీసినప్పుడు తప్ప; ఇటాలియన్ చిత్రాలకు ప్రపంచఖ్యాతి, హాలీవుడ్ మోజూ సంపాదించిపెట్టిననియోరియలిజంకొంత దెబ్బతింది. స్టూడియోలూ, నిర్మాతలూ దర్శకులూ అమెరికన్ సహాయ "సహకారాల"తో చిత్రాలు తీయడం మొదలుపెట్టి బాక్సాఫీసుసూత్రాల మధ్య చిక్కుపడిపోయారు– అమెరికనైస్డ్ ఇటాలియన్ చిత్రాలు వస్తున్నాయి. నటీనటులు చాలమంది హాలీవుడ్‌కు తరలిపోయారు.

నియోరియలిస్టుల చిత్రాల లిస్టు చిక్కనైపోయింది. ఇది చాలా దిగులు ఉద్యమం అనీ జీవితంలో దిగులునంతా పోగేసి ఇలా జనం నెత్తిన రుద్దడం తగదనీ ప్రభుత్వ ప్రతినిధులులోకూడా అభిప్రాయ పడ్డారు. ఇప్పుడు చిత్రాలలో సెక్స్ప్లాయిటేషన్ మిగిలిందని ఒక విమర్శకుడు అన్నాడు. డీసీకా వంటివారు ఒకటీ అరా చిత్రాలు డబ్బురాని పద్ధతిలో తీస్తున్నారు.

డీసికా, తన ఈ సదాశయంకోసం గబగబా పలుగురు నిర్మాతలదగ్గరకు వెళ్ళి వేషాలు అడిగివేసి (ఆయనకేటు చాలా ఎక్కువఉన్న ఆ డబ్బుతో ఓ చిత్రం తీస్తాడు. మళ్ళీ కొన్నాళ్ళు వేషాలువేసి ఇంకో చిత్రానికి డబ్బు పోగేస్తాడు. నటుడుగా కూడా డిసికాకు చాలా విలువ ఉంది.

ఎవ్వెరిడే ఈజ్ ఎ హాలిడే అనే కథల సంపుటిలో ఆయన్ను చూసినవారు ఎవరూ హోహార్లు చెయ్యకుండా ఉండరు. డిసీకా (ఐదు)కథల సంపుటి ఇంకోటిఉంది, పేరు: ది అనాటమీ ఆఫ్ లవ్. రెండిటిలో ఆయన వేశాడు. మరోదాంట్లో సోఫియాలారెన్ (ఇప్పటికన్న జూనియర్ గా ఉన్నపుడు) వేసింది.

**ఇటాలియన్‌లు ఫ్రాంసువాళ్ళని చూసి,**



విక్రమ్‌వారి 'మహిషాసుర మర్దిని'లో జానకి, రాజ్‌కుమార్.

మగసిరిగల చిత్రాలు తీయాలంటే అవధులు పెంచడం అవసరమని గుర్తించారు. అవధులు పెంచడంఅంటే, ఆడవాళ్ల గౌను అంచులు పైకిజరపడం; తద్వారా ప్రమాణాల పై అంచులు కిందకు దిగలాగడం. అదే చివరకి మిగిలింది అని నేటిచిత్రాల స్థితిగతులపై ఒక వ్యాఖ్యాత అన్నాడు.

## పశ్చిమ జర్మనీ
### కాషెన్‌క్లాగర్

1982నాటి గ్రాండ్ హోటల్ కథను జర్మనీఅగ్రశేణి నిర్మాత ఆర్సరుబ్రానెవ్‌స్కీ 'మెన్ షెన్ ఇమ్ హోటల్' (హోటల్లో మనుషులు) అనే పేరుతో ఇటీవల విడుదలచేసింది. డబ్బు కుంభవృష్టిగా కురిసింది. అది కాషెన్‌క్లాగర్ ... అంటే బాక్సాఫీస్ హిట్.

పశ్చిమ జర్మనీ సినిమాలస్థాయి ప్రధానంగా ఇదే. కాబినెట్ ఆఫ్ డాక్టర్ కాలిగరీ, బ్లూ ఏంజల్ చిత్రాలు తీసిన దేశంలో ఇప్పుడూ కొన్ని మంచి చిత్రాలు తయారవుతున్నాయి.

ఇల్సా అనే అమ్మాయి అక్కడా యిక్కడా చాలా పనులుచేసి యుద్ధకాలంలో చిత్రాల ఎగ్జిబిటర్‌గా తరవాత నిర్మాతగా పుంజుకొంది.

దేశంలో ఆడుతున్న చిత్రాలలో ఆమెవి నూరింట 12 వంతులు అయినా వసూళ్లు మటుకు నూటికి 30 వంతులు (సాలీనా సుమారు 12 కోట్ల రూపాయలు) ఉన్నాయి. ఈవిధంగా అక్కడి చిత్రపరిశ్రమకు ప్రాతినిధ్యం వహిస్తుందనతగ్గ నిర్మాత ఇల్సా చెప్పిన బాక్సాఫీస్ సూత్రం తెలుగువారి సూత్రానికి సూత్రప్రాయంగా దగ్గరచుట్టం.

"నాకు ఏమిచూడాలని ఉందో అదే, అందరూ చూసే సినిమాలో ప్రవేశపెడతాను. ఒక చక్కని చిన్నవాడూ, అందమైన చిన్నది, కాస్తంత డాన్సింగ్, కొంచెం హాస్యం. కానీ కన్నీళ్లూ ఉద్వేగం ఉండాలి. ఆపైన హృదయాన్ని కరగించే ఏర్పాటు పుష్కలంగా ఉండాలి" అని ఆమె అంది.

ఈరోజున పశ్చిమ జర్మనీలో క్రమేపీ టెలివిజన్ పుంజుకొని సినిమా ప్రేక్షకులను అపహరించి వేస్తున్నందువల్ల సినిమా నిర్మాతలు కలవరపడుతున్నారు. అటు టి.వి. తో పోటీచేసేందుకు కావలసిన పద్ధతుల్లో చిత్రం తీస్తూ ఇటు జనం తగ్గారు కాబట్టి తప్పనిసరిగా టిక్కెట్ల రేట్లు పెంచుతున్నారు. ఇపుడిపుడు కొందరు భారీ చిత్రాల నిర్మాణం తలపెట్టి హాలీవుడ్‌తో కలసి తీస్తున్నారు. పశ్చిమ జర్మనీలోని పశ్చిమ బెర్లిన్. గటింజన్, హాంబర్గ్, మ్యూనిక్ స్టుడియోలలో పశ్చిమ జర్మన్ నిర్మాతలు 25 కథాచిత్రాలూ, తూర్పు జర్మన్ నిర్మాతలు 18 చిత్రాలూ తీస్తున్నారు.

ఇటీవలనే సరికొత్త సీజన్ ఆరంభమైంది. పారిశ్రామిక కథావస్తువులపై చిత్రాలు తీయడం.

* * *

ఇన్ని దేశాలగురించి మాట్లాడుతున్నపుడు సహజంగా మనసంగతి మనసులో మెదులుతుంది. మనదేశంలో ఈరోజున ప్రధానంగా కనిపించేది బాక్సాఫీస్ ట్రెండ్ ఒకటే. కొన్నేళ్ళక్రితం మొహమాటానికైనా కళాత్మక చిత్రకళ, అదీ ఇదీ అనేవారు. ఈరోజున ఇంచుమించు అన్ని ప్రాంతాలా సమర్థులు కూడా "ఏం చేస్తాం" డబ్బు. డబ్బు కోసం ఇదంతా చేస్తున్నాం" అంటారు దిగులుగా.

డబ్బు చేదు కాదు. ఎవరికీ కాదు. డబ్బు రాకపోతే కథే లేదు. అందులోనూ లక్షల

# చలన చిత్రాల తీరుతెన్నులు

ఖర్చుతో తీసే చిత్రాల విషయంలో—ప్రయోగాలు చేసి నెగ్గి డబ్బు గడించే కొందరు మినహా—సాధారణ చిత్రనిర్మాతలు డబ్బు గురించి సాధ్యమైనంత బెంగ పెట్టుకోవలసిందే. కాని నేటి తీరుతెన్నులు చూడగా, చాల మంది దీనికోసం బెంగపడి, ఏది సంపాదిద్దామనుకుంటున్నారో అదెక్కడ తమ జోలికి వచ్చిపడదో ప్రమాదం రానివ్వకుండా అలా బాక్సాఫీసు సూత్రాలు తీసుకున్నారు అనిపిస్తుంది. పేరూ డబ్బు సాధించే ఉభయ తారక మంత్రం చదువుతున్నామనుకుంటూ, డబ్బు రాదన్న భయంకొద్దీ కేవలం భయ తారక మంత్రమే పునః పునః పునశ్చరణచేస్తూ, స్వయంగా ఆలోచించి చెప్పతగ్గ కొత్త విషయాల జోలికీ కొత్త కథల జోలికీ పోకుండా, నూటికి తొంభై పాళ్ళు, వారి కథలను వీరు, వీరి హిట్‌లను వారూ ఒకరి హిట్‌లను ఇంకొకరు తమిళ కథలను హిందీ వాళ్ళు, హిందీ బెంగాలీ కథలను తెలుగువారు, తెలుగు కథలను తెలుగువారు, తమిళ కథలను తమిళులూ అనుకరిస్తున్నారు. కొత్త తోవలు పెట్టడానికి సెన్సారు భయం ఉంటుందని అని కొందరి సమీక్ష. కాని ఇదేమంత నిజం కాదనీ మన సెన్సారువారు ఎంతసేపూ మద్యపాన నిషేధం సినిమాలో అమలు జరపడం ధ్యేయంగా వ్యవహరించే మధు-మధురేకనీ తోవాల జోలికీ, అప్రభంశపు కోర్టు సీనుల జోలికీ, న్యాయపరిపాలన, దుష్టశిక్షణ వంటి విషయాలలో జరిగే తప్పుల పొరపాట్ల జోలికీ బాక్సాఫీసు రైటర్లు వ్రాసే అవాచ్యార్థ పదసంపద జోలికీ పోరు కాబట్టి, నిర్మాతలూ రచయితలూ సాహసించి కొత్త కథావస్తువులు తీసుకొని, జీవితాన్ని చూపగల చిత్రాలు తీస్తే ఏమీ కొంపమునగదనీ, వాళ్ళ మీద అభాండాలు వేయడం భావ్యం కాదనీ తెలిసిన పెద్దలు అంటున్నారు.

ఒకటి మాత్రం ఆలోచించుకోవాలి. మనం ఇప్పుడున్న నాలుగు గోడల మధ్యా నిలబడి ఇంకా ఎన్నాళ్ళు గారడీలు చేస్తాం? ఇంకా ఎన్నాళ్ళుకాలచిత్రాలు తీస్తాం? ఎన్నాళ్ళు జనాన్ని నిందిస్తాం? అని. ★

# తెరవేల్పులకు ఎరలు

(57-వ పేజీ తరువాయి)

ఫర్' చాప్లిన్ వసకేసుకున్న దానికన్న తక్కువ అని పెద్ద తారల వాదం. ఆటో ప్రిమింజర్ వంటి పెద్ద డైరెక్టర్లు కూడా ఈ వాదాన్ని బలపరుస్తారు.

మొత్తానికి పన్నులవల్ల, నేటి మేటి తారలకు ఒక చిత్రంమీద ఎంత డబ్బువచ్చినా అవటంలేదు. అందుకని నిర్మాతలు మరికొన్ని విధాల ఆశచూపుతున్నారు. వీటిలో సరికొత్త రకం: మార్టిన్ మెల్చర్ అనే నిర్మాత ఒక పెద్ద నటుడికి కావలసినంత డబ్బుతోపాటు, తన నూనె గనులలో వాటా కూడా ఇస్తానని ఆశపెట్టిఒప్పించుకున్నాడు! మొత్తానికి దీనివల్ల విశదం అయేది ఒకటే. కొందరు నిర్మాతలు తమ అవసరాలను బట్టి నటులకు ఎంత పెడితే అంత ఇసామని రేట్లు పెంచేస్తారు. తర్వాత, తారలను తిట్టేవాళ్ళే కూడా ఎక్కువగా ఈ నిర్మాతలే. ★


జస్మిన్ వాజూకైన వస్త్రములు
మీకు సొగసుదనము నిస్తాయి,
హాయిగా ఉంటాయి, ప్రత్యేకత నిస్తాయి।



జస్మిన్ వాజూకైన బట్టలను ఎంచుకొని తక్కువ ఖర్చుతో సంవత్సరము పొడుగునా సొగసుగా వస్త్ర ధారణ చేసేవారిలా కనపడగలరు!

జస్మిన్ బట్టలు చక్కని రంగులలో, ఆకర్షణీయమైన అద్దకములలో దొరుకుతున్నాయి. వాటిని కట్టుకొంటే మీకు ఒక ప్రత్యేకత వస్తుంది.

మీరు ఎంచుకొందుకు వీలుగా జస్మిన్ బట్టలు ఎన్నో రకములవి, రీతులవి లభిస్తున్నాయి. జస్మిన్ బట్టలనే కొనండి.

జస్మిన్
మిల్స్ ప్రైవేట్ లిమిటెడ్.
500, కల్బాదేవి రోడ్, బొంబాయి-2

## కొత్తబాట

రచన : మంజు శ్రీ

దొరకుచోటు : విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ. మూల్యము:

రూ 2-25 న. పై.

ఇది మధ్యతరగతి ప్రజలకు సంబంధించిన ట, ఆడపిల్లలకు పెండ్లి చేయలేక పెద్ద గా పడే బాధలు, తత్ఫలితంగా యువతులు ల్లి తండ్రుల బాధలు చూడలేక విచా ంచటం, బాగా వయసు వచ్చిన తర్వాత గాడా పెళ్ళికాకపోతే, స్వతంత్రించి, ప్రేమించి పెళ్ళిచేసుకోవడం—అదయినా మ శాఖలో వాడినికాక, వేరొక శాఖవాణ్ణి పెండ్లిచేసుకొన్నచో సంఘం లేచిపోయిన , నిందలుమోపటం—అట్టి కోవలోనికి ప్రధాన సరోజపాత్ర.

సరోజ తనవల్ల ఇతరులకు కష్టాలు కల్గకూడదని భావించి తక్కువకులంవాణ్ణి పెండ్లి చేసికొంటుంది. అట్లా జరుగుటవలననే తమకు కష్టాలు కల్గాయని తండ్రి, సోదరులు ఆమెకు దూరంగావుండి బాధలుపడుతుంటారు. కుటుంబక్షేమం విచారించలేదని, వ్యక్తిగత క్షేమం చూసుకున్నదని ఆమెపై ఆరోపించుతారు. కాని సరోజ వారికోసం పరితపిస్తుంది. బాధపడుతుంది. జాలి చూపుతుంది. సానుభూతి కనపరుస్తుంది. తానేది మంచి దనుకున్నదో దానిని ధాటిగా ఆచరించే వ్యక్తి సరోజ. పరంధామయ్య, వసుధ, సత్యం పాత్రలు కూడా ఫర్వాలేదు. సత్యం కథానాయకుడు. చదువుకున్నవాడు. అతను ఉపయోగించుకోలేదు. ఉత్తి బుద్ధిమంతుడు మాత్రమే.

సరోజ, పరంధామయ్యగారింటికివచ్చి తానుచేసిన నేరమేమిటో కనుక్కుందామని తమ్ముని యెదురుగా తన నిర్దోషిత్వాన్ని చెప్పుతుంటుంది. సత్యం ఆమెపై సానుభూతికి బదులు కోపం ప్రకటించి మాట్లాడక ఊరుకుంటాడు. ఆమె వెళ్ళిన తర్వాత వసుధ సత్యంను 'మా అక్కయ్యను గుర్తుపట్టలేదా?' అని అంటే మా అక్కయ్యకాదని చెప్పుతాడు. అయితే చివరలో వసుధవచ్చి 'తమకు మరో కరులోడుగావుండాలి. పెళ్ళికోసికోండి. లేనిచో మీరు చిన్నపిల్లవానివలె బాధపడ్తారు. బాధపడ్డచిన్నపిల్లవానికి చందమామను చూపి ఏవిధంగా సముదాయించుతామో ఆ విధంగా మిమ్మల్ని బుజగించాలి. ఇది నాదే కాకుండా, మీ అక్కయ్యగారి అభిప్రాయము కూడనని చెప్పుతుంది. అప్పుడు తన అక్కయ్యలో ఇంత మంచితనమున్నదా అని ఆశ్చర్య పడ్డాడు. తనకు తెలియకుండా వాళ్ళ అక్కయ్యపై గౌరవముంచుతాడు. ఆమె ముఖం చూడటానికికూడా వొప్పుకోనిసత్యం బాబుని తన అక్కదగ్గరకు చేరదీసి తనతో తీసుకుని పోతుంటే అప్పుడతనికి ఆమెలోని గొప్పతనము కనపడుతుంది.

బాబు తన అక్కతో నేను నీతో వస్తే నీకు కమలా అక్కయ్యా అని లేత హృదయంలోనుంచి అంటాడు. ఆ ఒక్కమాట సరోజని నిలువెల్ల కుంగదీస్తుంది. తనతో తీసుకుపోతుంది. ఆమెభర్త ప్రేమస్వరూపుడు. దయార్ద్రహృదయం గలవాడు. అట్టి వ్యక్తులు సంఘంలో వుండటం చాల అరుదు.

వైకుంఠంలాంటి వ్యక్తులు సంఘంలో వుంటూనే వుంటారు. సత్యానికి మనసు బాగుండక ఆలోచనలతో సతమతమవుతుండంగా మనసును బాగుంటేట్లు చేస్తానని త్రాగించుతాడు. వైకుంఠంలాంటి స్నేహితులున్నచో సహజంగా జరిగే సంఘటన ఇట్టిది.

కసాయివాడికికూడా హృదయంవుంటుందని, ఒక్కొక్క సమయంలో ఎవ్వరికిఎవ్వరు ఆపబంధువు లవుతారో తెలుసుకోవడం చాలకష్టమని పరంధామయ్య, రూంప విక్రేత పాత్రలు తీసుకోవచ్చు.

అర్థంలేని మూఢాచారాలు, మూఢనమ్మకాలు పనికిరావని మానవునికి కావలసినది హృదయమేనని ఈ నవల సందేశం. ఇందులో చెట సినీమాలలోవలె కొన్ని సుదీర్ఘమైన సంభాషణ లక్కడక్కడ వున్నాయి. అట్టి సంభాషణలేకపోయినచో 199 పేజీల పుస్తక రూపంలోనికి రాదనుకొన్నచో వాటివల్ల మనకు నష్టంలేదు.

ఈ నవలా సందేశములు నాటకాలుగాను, నవలలుగాను, ఇదివర కెన్నిటినో విన్నాము. చూశాము. చూస్తున్నాము. కాని ఇందలి నది. కాబట్టి కథసామాన్యమైన దయినప్పటికీ ఈ 'కొత్తబాట' రూపురేఖలు తెల్పుకొనుటకు బాటవెంపోవుటకు ఎవ్విధమయిన అడ్డంకులు లేకుండా సాఫీగా సొమ్మని పవిత్రమయిన కొత్తబాటను వేసి దానిపై మనలను పొమ్మన్నారు మంజు శ్రీ.

రా. మూ.







## రాజధాని కబుర్లు

(౮ వ పేజీ తరువాయి)

బ్రహ్మయ్య ఇంటిపై దాడిచేస్తే, ఈ దొంగ నాణేలు తయారుచేసిన అచ్చులు దొరికాయ్. ఈ అచ్చులు బెంగుళూరులో ఒక సంస్థ తయారు చేస్తోందిట. ఇంకా తమాషా చూశావ్ లే - ఇంకా ప్రతిధ్వనులు వింటావ్ !" అంది శ్రీకృ. జ. స్థా. అని, కృ. జ. స్థా. ఏదో ప్రశ్నలడుగుతూంటే, వినిపించుకోకుండా దూరదూరంగా అడుగు వేసుకుంటూ, లోపలికిపోయి కటకటాల తలుపు వేసేసుకుంది.

* * *

అలావెళ్లిపోయింది శ్రీకృ. జ. స్థా. వచ్చే వారం ఆకాశవాణి గాలికబుర్లు చెప్పడమూ లేక ఆరిటిసికి ఇచ్చిన నాలుగు వారాల గడువు వ్యర్థంగా జరిగిపోయిందని హెచ్చరించడమూ అని ఆలోచిస్తూ కూచున్నాడు ప్రవీణుడు. ★

# ఆంధ్రపత్రిక 'నుడికట్టు' 7



## అడ్డం ఆధారాలు

1. పొలాలపై పొగలరాణి.
2. మూడు స్వరాలతో జరిపేయచ్చు.
4. కలిచివర ఉన్న అవ్యక్త మధురధ్వని.
6. మొదట దేవత, అరటి చివర కలిస్తే విసురుకొనే రాగం.
8. వెంకటరమణస్వామిలో కనబడే అందం
9. బరెట్ అంటే బోర్లా పడింది.
11. పూర్తిగా సువరము కాదు. కొంత అదృష్టమే.
12. బోగూడదో అంటానికి మరోమాట.
13. కాలేనికాళిమ.
14. దిల్ రుబా యిలా వాయిచే పార్సీ పద్యం పలుకుతుంది.
16. యోగ్యతాపత్రం.
18. శత్రువు ఇష్టం అపర్థం సుమా.
19. ఎటు తిప్పినా ధరించే వస్త్రమే.
20. లేడీ లేడి

## నిలువు

1. పావురం కొంచెం మార్చినా పావురమే.
3. నా పైగల భారంవల ఎంత అలగి జరిగిందో
4. చెడ్డయుద్ధం హేతువు కావచ్చు.
5. చీకటిలో కూడా వడుం కనిపిస్తుంది.
6 వసంతుని ప్రేయసి పుష్పసుందరి.
7. కబుర్లు చెప్పే రాజధాని.
8 మురళి చివర తీసుకుని శబ్దం కలిగించవచ్చు.
10. ఏకవచనంలా కనిపించే రెట్టమా చేతులు.
12. .........పొంగులాభం.
15. పావలు, వరదలు తెచ్చే బ్రహ్మదేవుడు.
16 ప్రకాశంగారి ఊరుదు చివర.
17 సగం చొక్కా ఉన్న భార్య.

## 6-వ నుడికట్టుకు జవాబులు




## ★ క్రాస్‌వర్డ్స్ - కల్యాణం

(23-వ పేజీ తరువాయి)

అని చూడబోయిన శాంతి, బండిలోంచి దిగిన యువకుణ్ణి చూసి సిగ్గుతో ఇంట్లోకి పారిపోయింది. ఎవరో వచ్చేరని తండ్రితో చెప్పింది. 'ఎవరా' అని వీధిలో కొచ్చి రామాన్ని, ఇంకో వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయేడు పరంధామయ్య. పరంధామయ్యని చూసి నమస్కారం చేసేరు రామం." "ఈయన మా మామయ్యండీ" అని పరిచయం చేసేడు కేశవరావుని.

"నమస్కారమండీ!" అని ఒకరొకరు పలుకరించుకున్నారు పరంధామయ్య, కేశవరావు.

ఇద్దర్నీ లోపలికి తీసుకెళ్ళి కూర్చోపెట్టి ఇంట్లోకెళ్ళి భార్యతో చెప్పేడు వాళ్ళొచ్చినట్లు. ఆవిడ వంటింట్లో కెళ్ళిపోయింది. తను వాళ్ళదగ్గర కూర్చున్నాడు.

"ఏమిటండీ సంగతులు? వస్తున్నట్టు ఉత్తరమైనా రాయకపోయారా? అనుకోకుండా ఒక్కసారి వచ్చేరు" అన్నాడు పరంధామయ్య చిరునవ్వు నవ్వుతూ.

"మామయ్య ఈవూళ్ళో వుండగా వుత్తరమెందుకని రాయలేదు" అంటూ ఇంకా ఆలస్యం ఎందుకని.

"ఇది మీకిమ్మని నాన్నగారిచ్చేరండి" అని ఓకవరు పరంధామయ్య చేతిలో పెట్టాడు రామం.

ఏమిటో అని గాభరాగా ఆ ఉత్తరం విప్పి చదువుకోటం మొదలెట్టాడు చదువుతున్నంతసేపూ అతని ముఖంలో విరిసిన ఆనంద రేఖల కంతేలేదు. పూర్తిగా చదివిన తర్వాత ఆనందం పట్టలేక ఒక్కగుటున యింట్లో కెళ్ళి భార్యతో ఆ విషయం కాస్తా చెప్పేసి "అమ్మాయిచేత కాఫీ పంపు" అంటూ తను వాళ్ళదగ్గర కొచ్చి కూర్చున్నాడు. ప్రక్కగదిలో గుమ్మందగ్గర నిలబడ్డ శాంతకూడా ఆ సంగతి సాంతం విని సంతోషం ఆపుకోలేక సిగ్గుతో ముఖం కప్పుకొని మంచంమీద పడిపోయింది.

"శంకరంగారంతటి పెద్దవారడుగుతే నే కాదనగలనా, చెప్పండి అన్నయ్యగారూ, పెద్దల దయుంటూ కలిగి రావాలిగాని..." అంటూ వుండగా—

"అది సరేకానీ...మీరెంత తొందర్లో ముహూర్తం పెట్టిస్తే మావాడికంత మంచిది" అంటూ రామంవేపు క్రీగంటచూసేడు కేశవరావు. రామం ముఖం సిగ్గుతో కందగడ్డలా అయిపోయింది. అప్పుడే కాఫీ కప్పులతో యివతల అడుగడుతున్న శాంత ఆ మాటలు విని క్షణం ఆగిపోయింది.

అది గమనించిన పరంధామయ్య "రామ్మా! మరేం ఫరవాలేదు. మనవాళ్ళేగా" అన్నాడు. వినకనించి తల్లికూడా ప్రోత్సహించింది వెళ్ళమని. రామం, కేశవులు శాంతని చూసేరు. శాంత సిగ్గు భరించలేకపోయింది. కాఫీ కప్పులు పరంధామయ్య దగ్గరగానున్న బల్లమీద పెట్టి, రామంవేపు క్రీగంట చూసి గిరుక్కున తిరిగి గదిలోకెళ్ళిపోయింది. శాంత వదలిన దృగ్బాణం తగిలి, రామం ఓ క్షణంపాటు అలానే వుండిపోయేడు. కేశవరావు, పరంధామయ్య మాట్లాడుతున్న మాటలే వినపళ్ళేదు రామానికి.

పెద్దలిద్దరూ మాట్లాడుకొని, చివరికి మాఘమాసంలో పెళ్ళి స్థిరపరచేరు.

చిన్న కూతురి పెళ్ళి, పెద్ద కూతురు పెళ్ళికన్నా ఘనంగా జరిపించి, అందర్నీ సంతోషపెట్టగలిగేడు పరంధామయ్య క్రాస్‌వర్డ్స్ ధర్మమా అని.




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

నవంబరు
20-వతేదీ
విడుదల

నల్లపరెడ్డి బ్రదర్స్ వారి

# పెద్దకోడలు

ఉత్తమ సాంఘిక చిత్రం..

మాటలు. పాటలు. నారపరెడ్డి.
సంగీతం. యం. రంగారావు...

నిర్మాత. నల్లపరెడ్డి గోపాలరెడ్డి.....

'Chitralekha'

KRISHNA

ఆంధ్ర: మహాలక్ష్మీపిక్చర్స్, విజయవాడ; సీడెడ్: భాస్కర్ పిక్చర్స్, గుంతకల్; నైజామ్: సుందర్‌పిక్చర్స్ సర్క్యూట్, సికిందరాబాద్.